శ్రీ

# ఆంధ్రవాచస్పత్యము.

మూఁడవ సంపుటము

త మొదలు మ

వఱకు



ఇది

## కొట్ర శ్యామల కామశాస్త్రిచే

వ్రాయఁబడి

ప్రకటింపఁబడినది.



శ్రీ లక్ష్మీముద్రాక్షరశాల,

[illegible], కాకినాడ.

1938

మూఁడవ సంపుటము } వెల రు. 5-0-0


{ మొత్తము వెల రు. 25-0-0

# శ్రీ ఆంధ్ర వాచస్పత్యము.

## మకారాంతము వఱకు పదముల పట్టిక.

| [illegible] | శబ్దరత్నాకరము 25344 | | ఆంధ్ర వాచస్పత్యము 52, 828, | | | | | | | | లక్ష్మీనారాయణీయం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | సం | తె | సం | తె | ఆం | ఫా | జా | ఆంగ్ల పర భాష | వాడుక | లోకోక్తులు | అచ్చ, తెనుఁగు పదములు |
| ‘అ’ మొదలు ‘ఔ’ వఱకు | 5670 | 6740 | 18445 | 11838 | 1194 | 1908 | 143 | 295 | 608 | 67 | 11817 |
| త | 452 | 1324 | 779 | 2143 | 191 | 71 | 45 | — | 174 | 9 | 2083 |
| థ | — | — | 4 | — | — | — | — | — | — | — | — |
| ద, ధ | 708 | 622 | 1046 | 938 | 849 | 26 | 4 | — | 128 | 4 | 900 |
| న | 767 | 986 | 885 | 1305 | 206 | 35 | 18 | — | 159 | 3 | 1894 |
| ప, ఫ | 1751 | 2356 | 2292 | 8281 | 872 | 75 | 48 | — | 808 | 11 | 8282 |
| బ, భ | 651 | 869 | 1038 | 1384 | 175 | 15 | 8 | — | 424 | 5 | 1382 |
| మ | 706 | 1742 | 1243 | 2512 | 242 | 40 | 34 | — | 186 | 8 | 2500 |
| మొత్తము | 10705 | 14639 | 20727 | 28491 | 2729 | 2170 | 300 | 295 | 2512 | 102 | 22798 |

# త

త. ఒకయక్షరము. సం.వి అ. పుం. 1. అంటు. చూ, సంయోగము; 2. నిశ్చయము. చూ, సత్యము; 3. కోపము: చూ, రోషము, 4. తోఁక, చందితోఁక (అనికొందఱు) చూ, వాలము. 1; 5 పరస్వరవిరోధమును గలుగఁజేయు మాట. చూ, శబ్దము 2, 6 దొంగ: చూ, ముచ్చు. 1; పుం న. 7. ఆడుట, విశే. 8 ఆడించువాఁడు; 9 ప్రస్తుతప్రయోజనపుమాట. చూ, శబ్దము 2; 10. కారణము. చూ, హేతువు.1, 11 లక్ష్మీముఖము, అం. 12. దంత్యములలో నొకటి. చూ, దంత్యములు, 13 పరుషములలో నొకటి చూ, పరుషములు

తంకర. దే. వి. తుచ్ఛధాన్యము చూ, ధాన్యము

తంగు. దే వి. చూ, రూ_టంగు.

తంగువాలు దే. వి చూ, రూ-టంగువాలు

తంగేడు దే. వి రూ-తంగేడు* చూ, హేమపుష్పకము.

తంగేటిజున్ను జా సులభముగా లభించునది. "అపసగ్గ కాంతుచేనాకొన్న వానికిఁదంగేటి జున్ను శ్రీరంగశాయి." కవికర్ణరసాయనము

తంగేడు దే వి చూ, రూ-తంగడు *.

తంట. దే. వి. రూ-తంటా. 1 అప్పు చూ, బాకీ. 2, 2 మోసము చూ, వంచన, 3 అతలసతలము చూ, కల్మషము. 1, 4. కలహము చూ, యుద్ధము, 5 కొండెము- రూ-కొండెము చాడీ-రూ-చాడీ.

తంటలమారి దే. విశే. రూ-తంటాలమారి కలహకారి. చూ, సూచకుఁడు 1.

తంటసము. వా. వి. 1 చూ, తండసము. (1); 2 చూ, తండసము. (2).

తంటా. దే. వి: చూ, రూ-తంట.

తంటియము దే వి. రూ-తంటెము *: చూ, పరిప్రావ్నటము. (దీని ఆకులలోను విత్తులలోను 'క్రైసోఫానిక్ ఆసిడ్' గలదు. ఇది తామరకు సిద్ధౌషధము )

తంటెము దే. వి. —పై—

తండకము. సం వి. అ పుం 1. = దంతియ. ఇంటిమూలము. చూ, మదనచేతులు; 2 కొటుకపిట్ట. చూ, పిచ్చుక; 3. నురుగు: చూ, ఫేనము, 4 కాలికివేసికొనెడునగ. చూ, భూషణము 2

తండము సం వి అ పుం. _ తండా. లంబాడీల గుంపు చూ, సమూహము.

తండసము. సం వి అ పుం 1 కమ్మరకొలిమి చూ, రంధ్రము. 1, దే. వి (1) మంగలి వెంట్రుకల నూడఁబెఱికెడి పనిముట్టు చటిలిక, తంటసము, వా. (2) జేరమానా, తంటసము

తండా నై వి 1 = తండ. లంబాడీల గుంపు: చూ, సమూహము, 2 సరకునింపిన గోనెల సమూహము.

తండిరి. దే వి రూ- తండిరి చూ, పెనుఁడు.1.

తండు దే స క్రి. ఇయ్యానలసినధనమును పోయుచుండు (కొందఱనుఅరియు)

తండుకోల దే వి (తండు + కోల) వేఁపలఁగొడి దెడు చిల్లకోల, ఖండము పంచ. వేం 1, ఆ 614 చూ, సప్పాల

తండులీయము సం. వి. అ. పుం 1 కఱుగుకీరు చూ, శుక్ర్షము 1, 2 కీటకము. చూ, పురుగు, 3 బొబ్బరిలు చూ, ధాన్యము

తండులకాలింగనము అం ఆలింగనములు పదునాలుగింటిలో నొకటి చూ, ఆలింగనములు.

తండులఫల సం. వి. అ స్త్రీ. పిప్పలి *: చూ, కాంచి

తండులము. సం. వి. అ. పుం 1. చూ, బియ్యము; 2. చూ, వాయువిడంగము*. (ఇట్లు తండు లీయిక - తండులువు.)

తండులాంబువు సం. వి. ఉ. న. పులికడుగు చూ, శుక్తము 1. [ధండీరము.

తండులి సం. వి. ఈ స్త్రీ చిట్టి * చూ,

తండులీకము సం. వి. అ. పుం. — పై —

తండులీయకము సం. వి అ. పుం — పై. —

తండులీయము సం. వి. అ పుం 1. — పై. —; 2 ఒకానొక ధాన్యము. చూ, ధాన్యము; 3 చూ, వాయువిడంగము*

తండులేరము సం వి. అ పుం చూ, తండులీ-

తండులోత్థము సం. వి. అ. న చూ, తండు లాంబువు

తండులోదకము సం వి అ న — పై —

తండువు సం వి ఉ. పుం, ఊ స్త్రీ 1 = తొండ్లు-తెడ్డు రూ-తందువు-తర్దువు హస్తా కారమైన దాపువు చూ, దర్వి 1. (చూ, పాత్రము 6), 2 = తొండ్లు-తెడ్డు. రూ-తందువు-తిద్దు-తడ్డు-తడ్డువు-తర్దువు నాప సడపు తెడ్డు చూ, పీలి. 2, ఉ పుం 3 నందీశ్వరుడు(శ ర.) (తుంబురుఅనిఅమరము) చూ, వృషభము. 1.

తండెలు. దే. వి. రూ-తండేలు చూ, సరంగు

తండేలు దే వి — పై —

తండోపతండము. వి వి 1 అహమహమిక, అహంపూర్వక, వా. వి. ఒ. 2. గుంపులు గుంపులు. “తప్పులెన్నువారు తండోపతండంబులు” వేమన శతకము

తండ్రి. దే. వి. 1 చూ, పితరుడు. 1; అం. 2 స్త్రీరక్షకు లాబుగురిలో నొకడు. చూ, స్త్రీరక్షకులు; 3. గయాపిండ దాతార్థులలో నొకడు: చూ, గయాపిండదాతార్థులు.

తండ్రికి పూర్ణాయుర్దాయమునిచ్చు జాతకుడు.- పా. (ఎ) నవమాధిపతి స్వక్షేత్రమందున్నను, ఉచ్చయందున్నను, పాపగ్రహసంబంధము లేక శుభగ్రహ సంబంధమున్నపుడును, (బి) పితృస్థానమందు శుభులుండి పాపగ్రహ సంబంధము లేకుండినను, (సి) పితృస్థానము కర్కాటకమయి యచ్చోట గురునకు పాపగ్రహసంబంధము లేకుండినను, (డి) పితృస్థానాధిపతి పాపసంబంధములేక శుభసంబంధియైనను, (ఇ) పితృస్థానము శుభగ్రహమధ్యస్థమయి యుండునపుడును, (ఎఫ్) పాపసంబంధములేక పితృస్థానమందు శుభులుచ్చస్థులై యుండునపుడును, (జి) నవమాధిపతి పరమోచ్చ స్థానమందుండి గురునితోఁ గలసినను, లగ్నమునకుఁ గేంద్రములయందు శుక్రుఁడున్నను తండ్రికి దీర్ఘాయుర్దాయము గలుగును. [హుండు. 1.

తండ్రితండ్రి. దే. వి. తాత. చూ, పితామ

తండ్రినిగర్భములోనుండునపుడుచంపెడి(శిశువు) జాతకుఁడు. పా (ఎ) సూర్యుఁడు 6—8—12 స్థానములలోనుండి, అష్టమాధిపతి నవమమునకుండి, వ్యయాధిపతిలగ్నమునందుండి షష్ఠమాధిపతి పంచమమున నుండునపుడును, (బి) దివమందు జననమై, రవి పాపులతో సంబంధించి, రవికిఁ బంచమ నవమముల యందుఁ బాపగ్రహములుండి, జననకాలము నకు వీరిలో నెవరిదయిన దశవచ్చినపుడును, (సి) రాత్రి జననమై, శనిపాపులతో సంబంధించి యట్టిశనికి బంచమనవమములయందుఁ బాపగ్రహములుండి, వీరలలో నెవరిదయిన దశజననకాలమునకు వచ్చినపుడును శిశువు గర్భములోనుండఁగ తండ్రి చనిపోవును.

తండ్రిని బాల్యమందుఁజంపెడి జాతకుఁడు. పా (ఎ) రవిశనులుగూడి 12 వ స్థానమందుండి, చంద్రుఁడు సప్తమస్థానమునందుండి,

శుభగ్రహసంబంధములేక జననకాలమునకు పేరిలో నెవరిదశయైన వచ్చినయెడలను, (బి) ద్వాదశమున శనిరాహువులుండి, క్షీణ చంద్రుఁడు సప్తమముననుండి, శుభగ్రహ సంబంధము లేనియెడలను, (సి) రవిపాపుల తోఁగలసి, 9వ స్థానమందుండి, జననకాలము నకు వీని మహాదశవచ్చినయెడలను, (డి) రవి కుజశనులు, లగ్న పంచమ నవమ ద్వాదశ ములలో నెచ్చటనైననుండి, శుభగ్రహసంబం ధములేక వీరిలో నెవరిదైన మహాదశ జనన కాలమునకు వచ్చినయెడలను,(ఇ)నవమమందు రాహువుగాని, కేతువుగాని యుండి జనన కాలమునకు వీరి దశవచ్చిన యెడలను, (ఎఫ్) పితృస్థానాధిపతియున్న రాశ్యధిపతి పితృస్థాన మందుండి రవి రాహువులతోఁ గలిసి శుభసంబంధములేక జననకాలమునకు వీరి దశవచ్చినయెడలను, (జి) నవమాధిపతి రాహువుతో గలిసి, నవమముందుండి, జనన కాలమునకు నీరాహుదశ వచ్చినయెడలను (హెచ్) పితృస్థానాధిపతి రవితోగాని రాహువుతోగాని కలిసి అష్టమాధిపతి సం బంధముండి, శుభసంబంధములేక జననకాల మునకు వీరిదశవచ్చిన యెడలను (ఐ) పితృ స్థానాధిపతికి రవిరాహువులు అష్టమ మం దుండి శుభసంబంధము లేనపుడును, (జే) పితృస్థానాధిపతికిని రాహువునకును షష్టా ష్టమముగలిగి, వీరిలో నెవరిదైన దశవచ్చినపు డును, (కే) పిగ్రహములయిన పితృస్థాన మందుచ్చ యందుండి, రాహువుతో గలిసి వీరిదశవచ్చియుండిన యెడలను,(ఎల్)నవమ మందు పాపులు శుభసంబంధములేకయుండి, వీరిదశ వచ్చియుండునపుడును, (ఎమ్) సిం హమందు రాహువుగాని, కేతువుగాని యుండి, పాపగ్రహములతోఁగూడి, వీరిదశ వచ్చినపుడును, (ఎన్) జననకాలమునకు రాహుమహాదశవచ్చి యీరాహువు పితృ స్థానాధిపతితోఁగూడి, శుభగ్రహ సంబం ధము లేనపుడును బాల్యమున తండ్రి చేసి పోవును.

తంతి. వై. వి. 1=తంత్రి. తీఁగయు: చూ, సూ త్రము. 1, 2. వీణె మొదలగు వానికి వేసెడు ఉక్కు కమ్మి. చూ, సారణి 3; వా. వి. 3. వార్తలనందించెడి ఉక్కుతీఁగె, తంతువు.

తంతియ దే. వి. రూ-తంతె. మెట్టు చూ, సోపా నము. (బ. తంతియలు = మెట్లు.)

తంతీపు దే. వి: చూ, సంగ్రామము ఆం, భా. పర్వ 140 (తరితీపు అని కొందఱు)

తంతు వై. వి 1 = తంత్రి క్షుద్రదేవత కొలువు. (దేశ్యమని శ. ర.) చూ, పండు గ. 2; 2 =తంత్రమ్ ఉభయార్థసాధకమైన ఉపాయము చిట్కె (సం ప).—తంత్రము, 3. వివాహాదులలోఁజేయు కార్యవిశేషము.

తంతుకాష్ఠము సం వి. అ న. 1 సాలెవాని నాడె చూ, నాడె, 2 నూలు వడికెడు కదురు చూ, తర్కువు. [చూ, పురుగు.

తంతుకీటము. సం వి. అ పుం. పట్టు పురుగు.

తంతునాగము సం. వి అ. పుం. నెగడు చూ, మత్స్యము 1 [పురుగు.

తంతునాభము. సం వి. అ. పుం చూ, సాలె

తంతుభము. సం. వి. అ. పుం. ఆవాలు చూ, సర్షపము. [పురుగు.

తంతువాయము సం. వి. అ. పుం. చూ, సాలె

తంతువాయుఁడు. సం. వి. అ. పుం. 1: చూ, సాలెవాఁడు; ఆం. 2. చూ, జాతులు.

తంతువు. సం. వి. ఉ. పుం. 1. నూలిపోఁగు: చూ, సూత్రము. 1; 2 చూ,తంతునాగము; 3: చూ, తంతి. 2; 4: చూ, తంతి. 3.

తంతుస్నేహము. సం. వి. అ. పుం: చూ, తంతు భము.

**తంతె.** దే. వి: చూ, రూ- తంతియ.

**తంత్రికము.** సం. విణ. క్రొత్తది (బట్ట): చూ, వస్త్రము.

**తంత్రిభేదము.** అం. శివప్రోక్తములగు చతుష్షష్టి తంత్రములలో నొకటి చూ, తంత్రములు.

**తంత్రము.** సం. వి. అ. న. 1 చూ, తంతు 2, 2 స్వరాష్ట్రచింత (చూ, ఆవాపము 4), 3 వ్యాకరణ శాస్త్రము చూ, శాస్త్రములు, 4. కుటుంబవ్యాపారము, 5 ఉత్తమమైన ఔషధము: చూ, మందు. 1, 6 నవవిధజ్యోతిష గ్రంథములు చూ, సిద్ధాంతము 2 (చూ, జ్యోతిషము), 7 ప్రధానము చూ, ప్రాధాన్యము; 8. నూలుపడుగు: చూ, మగ్గము, 9 పరిజనము చూ, పరివారము 1, 10 ఒకానొక వేదశాఖ చూ, వేదము, 11 కారణము చూ, హేతువు 1, 12 ఇట్లు చేయదగిన పనుట, 13 ఒకపదమునకు రెండర్థములు కలుగుచుండుట, 14 శంసు క్షుద్రదేవతా రాధనము చూ, పండుగ 2, 15 ఆగమములు ఇరువదెనిమిదింటిలో నొకటి చూ, ఆగమములు (చూ, ఉపవిద్యలు)

**తంత్రములు.** ఆం 1. మిత్రలాభము, మిత్రభేదము, సంధివిగ్రహము, లబ్ధనాశము, అసంప్రేక్ష్యకారిత్వము (5); 2 అవ్యాజవాత్సల్యాది — అవ్యాజపాలనీ, రాజ్యలక్ష్మీ ప్రసాదక, సర్వసామ్రాజ్య, అంగారగమన, రాజ్యపాలన, శ్రీబాలరాజ, చామరద్వంద్వ, ప్రహర్ష రాజ, ధీర, గ్రామపాలన, మిత్రలక్ష్మీ ప్రయోగ, దుర్గపాలన, ప్రాణలక్ష్మీ ప్రయోగ, ప్రభాలక్ష్మీ ప్రయోగ, తోయలక్ష్మీ ప్రయోగ, గంధలక్ష్మీ ప్రయోగ, పుష్పలక్ష్మీ ప్రయోగ, కామరూప, కళాజీవనిక, కుంజకంబళ, కనకప్రయోగ, బోధనీ, సత్యలక్ష్మీ ప్రయోగ, పాదుక, ప్రజ్ఞాలక్ష్మీ ప్రయోగ, ఖేటక, చాపలేప, కల్యాణీమలక్ష్మీ ప్రయోగ, మణిస్థాపనప్రయోగ, పాతాళగమన, మర్దిని, స్ఫులింగలక్ష్మీ, శంఖమర్దళ, చక్రాయుధ ప్రయోగ, భైరవాది ప్రయోగ, సూపతంత్ర, రేఖతంత్ర, పృథివి, అశ్వ, గజ, గోరక్ష, ఐశ్వర్యలక్ష్మీ, శుల్క, మిత్రలక్ష్మీ ప్రయోగ, జీవని, గిరి, వన, స్థానాపత్యప్రయోగ, శ్రీసర్వదంసిని, విఘ్నచ్ఛేద, భరత, శృంగకాద్యప్రయోగ, నరవాహన, స్తంభిని, వాహిని, మారిణి, ద్వేషిణి, మృతసంజీవని, ఉచ్చాటన, శోషిణి, ఆకర్షణ, వాగ్, మేఖలికా తంత్రములు (60), 3. శివప్రోక్తములగు చతుష్షష్టి తంత్రములు — మహామాయాశంబరము, యోగిని జాలశంబరము, తత్త్వశంబరము, సిద్ధభైరవ తంత్రము, కాలాగ్ని భైరవ తంత్రము, అగ్నిభైరవ తంత్రము, శక్తిభైరవ తంత్రము, యోగినీ భైరవ తంత్రము, మహాభైరవ తంత్రము, ప్రధాన భైరవ తంత్రము, బ్రాహ్మీతంత్రము, మాహేశ్వరీ తంత్రము, కౌమారీ తంత్రము, వైష్ణవీ తంత్రము, వారాహీ తంత్రము, ఇంద్రాణీ తంత్రము, చాముండా తంత్రము, శివదూతీ తంత్రము, యామళాష్టక తంత్రము, చంద్రజ్ఞాన తంత్రము, మాలినీవిద్య, మహాసమ్మోహనము, వామజుష్ట తంత్రము, మహాదేవ తంత్రము, వాతూలము, వాతూలోత్తరము, కామికము, హృద్భేద తంత్రము, తంత్రభేదము, గుహ్యతంత్రము, కలావాదము, వాచ్యాయ నాదకము, కళాసారము, కుండికామతము, మతోత్తమము, వీణాఖ్యము, త్రోతలము, త్రోతలోత్తరము, పంచామృతము, రూపభేదము, భూతోడ్డామరము, కులసారము, కులోడ్డీశము, కులచూడామణి, సర్వజ్ఞానోత్తమము, మహాకాళీ మతము, అరుణేశము, మోదినీశము, వికుంఠేశ్వరము,

పూర్వము, పశ్చిమము, దక్షిణము,ఉత్తరము, నిరుత్తరము, విమలము, విమలోద్ధము, దేవీమతము, శుభాగమపంచకము, వశిష్ఠసంహిత, సనకసంహిత, శుకసంహిత, సనందనసంహిత, సనత్కుమారసంహిత (మహావిద్యలు 18 యును ఉపవిద్యలు 46 ను గూడిచతుష్షష్టివిద్యలయ్యె.స సార.సం75పా

తంత్రి. సం. వి ఈ. స్త్రీ. 1.=తంతి లోహపు తీఁగె చూ, సారణి. 3; 2 తిప్పతీఁగె* చూ, సోమవల్లి, 3. నాడి చూ, నరము (1)

తంత్రిక సం వి. ఆ స్త్రీ చూ, తంత్రి. 2.

తంత్వాతర్చనము సం వి అ న ఆసుగోవి చూ, మగ్గము.

తందనము వై వి =తానః మాటిమాటికి తాన శబ్దపూర్వకముగా చేసెడు రాగాలాపము కళా. 3, ఆ 187 చూ, స్వరము 2

తందర. వై వి.=తంద్రి. 1 తూఁగు, కునికిపాటు చూ, ప్రమీల, 2 నిద్దుర చూ, స్వప్నము. 2. [లోదికము

తందరీణము సం. వి. అ పుం చూ, తండు

తందువు. సం వి ఉ. పుం చూ, రూ-తండువు. [తండుకీణము

తందూరీణము సం. వి. అ. పుం: చూ, రూ-

తంద్రి. సం. వి. ఆ స్త్రీ=తందర. చూ, తందరు.

తంద్రి. సం. వి. ఈ. స్త్రీ.—పై.—

తంద్రిక. సం. వి. ఆ స్త్రీ.—పై —

...ి. కుండలో తేగలులోనగు వాని రెట్టిగడ్డిలోనగువానిచేతనుడి

క్రిమవిరుద్ధముగా [పద్మము. 1.

...గు పు, షండము: చూ,

తంపి. దే. వి. రూ-తెంపి. 1. జాలిగుంట:చూ, రంధ్రము. 1; 2. కయ్యము చూ, యుద్ధము.

తంబ. సం. వి ఆ. స్త్రీ. 1. ఆవు. చూ, ధేనువు; దే వి. (1) తంబతీఁగె*: చూ, శింబి.

తంబళ. దే. వి. రూ-తంబలి-తంబన-తమ్మలి-తంబిగ. 1. శివార్చనచేసె బ్రదికెడు జాతి. (తంబళవాఁడు, తంబళది); 2 అర్చకుఁడు: చూ, పూజారి; 3. శివార్చకుఁడు: చూ, పూజారి; 4. విష్ణ్వర్చకుఁడు చూ, పూజారి.

తంబలి. దే. వి.—పై.—

తంబిగ దే వి —పై.—

తంబి దే వి రూ-తమ్ముఁడు చూ,సహోదరుఁడు. (ఇది వాత్సల్య సంబోధనమునందు వాడఁబడును )

తంబుగ దే. వి. మెడ నిడుపుగా నుండెడు చెంబు చూ, పాత్రము 6.

తంబురు వై వి =తుంబురు రూ-తంబురా-తంబుఱ-తంబుఱా. ఉ, రా. 6, ఆ. 116: చూ, వీణె

తంబురా. వై. వి =—పై —

తంబుఱ. వై. వి =—పై — (తంతి + బుఱ్ఱ) (ద్వయమని శబ్దరత్నాకరము) ఉ, రా. 6, ఆ. 116. (వైకృతిమనికొండలు)

తంబుఱా వై. వి.=—పై.—

తక. పా చూ, కిట.

తకతక. దే. వి తాళమునందగు ధ్వన్యనుకరణము. చూ, హుహూహుహూ.

తకపికలాడు. దే అ. క్రి. (తకపికలు + ఆడు) ఇట్టట్టుచలించే శశాం. 4, ఆ. 61 చూ, సళించే

తకపికలుసేయుట జా ఎచ్చొతగ్గులు సేయుట. "మకరాంకుని యనుఁగు మేనమామకు నీకుం దకపికలు సేయవలదనుము." విజ. 2,ఆ.196.

తక్కోలము. సం. వి. అ.న: చూ, తక్కోలకము

తక్కోలబుట్లు. మి. వి: చూ, కటిఘము.

తక్తు. వా. వి. సింహాసనము: చూ, తఖ్తు.

తక్రము సం. వి. అ. న. పాలికపాలు నీళ్లుచే ర్చిన మజ్జిగ· చూ, మజ్జిగ.

తక్రాటము. సం వి. అ పుం. పెరుఁగుచిలి కెడు కవ్వము· చూ, మంథానము

తక్షకుఁడు. సం. వి అ. పుం. 1 తక్షకుఁడను సర్పరాజు: చూ, సర్పము, 2. వడ్లవాఁడు రూ-తక్షుఁడు-తక్షానుఁడు (కృశము గాఁజే యువాఁడు) చూ, స్వర్ణకారుఁడు.

తక్షణము సం వి అ న 1. (మాని) చెక్కు ట; వా వి 2 జరుగుదు, వెంటనే చూ, అకస్మాత్తు, డబ్బాటు

తక్షిణి. సం. వి ఈ. స్త్రీ. బాడిస· చూ, వాశి

తక్షశిల. సం. వి ఆ. స్త్రీ. తక్షశిలయను దేశము చూ, దేశము. [కుఁడు 2

తక్షుఁడు. సం. వి న్ పుం చూ, రూ-తక్ష

తగటి దే. విణ (తగటు + ఇ) రూ-తగటీ సరిగది: చూ, వస్త్రము.

తగటీ. దే. విణ —పై.— [193· చూ, సరిగ

తగటు. దే. వి జలతారు అచ్చ. బాల, కాం

తగడు. దే. వి. బంగారు లోనగుకాని రేకు పాండు. 3, అ. 202· చూ, సరిగ.

తగణము పా. రెండుగురువులు ఒకలఘువు గలది ఉ దా.— శ్రీరామ (చూ, అష్టగణ లక్షణము) [(చూ, ఉపగణములు.)

తగము. పా. త + గ ఉదా — విశ్వేశ్వరా.

తగరపాదికము. సం. వి. అ. న. తగరము: చూ, లోహము. 1.

తగరము. సం. వి. అ పుం. 1.=తగరు. పొట్టే లు: చూ, మేషము. 1; 2. జిహ్మము*. చూ, నందివర్ధనము; వై. వి. (1).=తమల- తిరుల. రూ-తవరము: చూ, లోహస్థా

తగరు. వై. వి. 1.=తగర. పొట్టేలు. చూ, మేషము. 1; అం. 2. దిక్పాల వాహనములు ఎనిమిదింటిలో నొకటి: చూ, దిక్పాల వాహనములు.

తగరురవుతు. వై. వి.=తగర రాహుత్త. అగ్ని: చూ, వహ్ని 1. (ఇట్లు తగర బాబాసామి)

తగవరి. దే వి (తగవు + అరి) రూ-తగువరి. న్యాయాధిపతి చూ, స్వామి. 3.

తగవు జే వి రూ-తగువు. 1 న్యాయము. భార ఉద్యో 2. అ. 64. చూ, సత్యము.1; 2 తగుట, 3 ధనాది నిమిత్తమైన జగ డము చూ, యుద్ధము, 4. పెండ్లప్పుడు పెండ్లికూఁతునకు తల్లిదండ్రులిచ్చెడు బహు మానము, విణ 5. తగినది, యుక్తము. భార. స్త్రీ 2, అ 62· చూ, సమీచీనము. 1; వా. వి. 6 తగాదా. "తగవు తెచ్చివాఁడు"

తగవుగోరి దే విణ. (తగవు + కోరి) సంధిచే యువాఁడు చూ, మధ్యస్థుఁడు.

తగాదా. వా. వి. 1 తగవు, 2. వ్యాజ్యము 2;

తగాయిదా. వా వి —పై —

తగిరిస. దే. వి తంటెము* చూ, ప్రపున టెత్తు-

తగు దే. అ. క్రి 1. ఒప్పు. ఆ 83. చూ, సమ్మతించే —పై.— పరి. చూ, సరిపడు 2. క్రిం. 1 మబ్బు

తగుకత్తి ద్వి వి. పా [illegible] కు.8. కత్తి చూ, రిష్టి. [illegible] , రూ-

తగులఁగట్టు దే [illegible] నుండునది. తగిలించే. [illegible] గటిగి పాడి

తగులఁబడు. [illegible] . జా. చోఁద తగులు, . [illegible] కుండఁగ ఆయా లోఁబ , అ. [illegible] నది హిమఘృణిచే

తగులఁ[illegible] న. దే [illegible] గొంతుఁగోయు తగవి 1. టు [illegible] లివరిణయము)

[illegible] , భా. [illegible] నబట్ట: చూ, వస్త్రము.

[illegible] ఇవముకొను: చూ, నాసు·

-తటతట దే. వి గుండెలదరుటలోనగువాని యందగుననుకరణము. ప్రభా. 3, ఆ. 126 చూ, హూహూ.

తటపటాయించే వా. అ. క్రి. 1. వెనుకముందులు ఆలోచించే, 2. సందేహించే.

తటమట. దే వి 1. మోసము. చూ, వంచన, విణ. 2 మోసముగలది రూ- తటపట చూ, పంచకము, 3. కలఁతనొందినది లక్ష్మి. 4, ఆ. 172 చూ, వ్యాకులము.

తటమటించే. దే. స క్రి. 1- మోసపుచ్చే చూ, వంచించే, 2. కలఁచే భాగ 4, స్కం 748 చూ, కలగుండుపెట్టు

తటము సం. వి. అ న 1 పరిమడి . చూ, భూమి. 1. (చూ, పొలము), పుం, స 2 = తట్టు. రూ-తటి ఏటిఒడ్డు చూ, గోధస్సు, 3 గోటు చూ, స్థానము 1, పుం 4 కొండచేరియ చూ, పర్వతము.

తటవట దే వి చూ, రూ- తటమట. 1-2-3, 4. కల్ల చూ, వితథము.

తటపటచేయు దే స. క్రి. చూ, పంచించే.

తటవిటలు వా. వి బ. చిక్కులు

తటవిట్లు వా వి బ —పై.—

తటస్థము. సం. విణ 1. సమీపమందున్నది చూ, సమీపము. 1; 2 ఒనఁగూడినది చూ, సిద్ధము. 3; వా. వి. 3. కలుగఁజేసికొనకపోవుట. "తటస్థవృత్తి."

తటస్థించు సం. అ. క్రి. 1: చూ, స ంబు, 2: చూ, సిద్ధించే.

తటస్థుఁడు. సం. విణ 1. న్యాయ డు చూ సత్యవంతుఁడు; వా. 2. కల ఁజేసికొనవాఁడు.

-తటాకపరివాహన్యాయము. పా. చెఱువ రు తూముగుండా కొంచెముగానైన విడువని యెడల గట్టు బ్రద్దలయి నీరంతయుఁ బోవు నను విధము.

తటాకము. సం వి. అ. పుం. రూ-తటాగము- తడాకము- తడాగము. చెఱువు చూ, సరస్సు 1. అం. 2. సంతానములు ఏడింటిలోనొకటి చూ, సంతానములు.

తటాగము.—పై —

తటాన. దే ద్రి. క్రి. విణ రూ-తటాలున-తటుకున-తటుక్కున - తడుకున దబ్బున. చూ, వేగము. 3 [వారించే.

తటాయించే. దే స క్రి అడ్డగించే చూ,

తటారించే. దే అ క్రి చొచ్చే. అం, భా. ర్య. 122 చూ, సోఁకు 4 [మహిసము.

తటార్ధము సం వి అ పుం దున్న చూ,

తటాలు దే వి చూ, తటతట హై 6, ఆ 13.

తటాలున. దే ద్రి క్రి. విణ చూ, రూ-తటాన. వసు 2, ఆ. 83

తటి సం వి ఈ. స్త్రీ 1 చూ, తటము 2; 2 చూ, తటము 4

తటిత. సం వి. త్ స్త్రీ రూ-తటిత్తు-తటిత్తు మెఱపు చూ, విద్యుత్తు

తటిత్తు సం [illegible] స్త్రీ —పై.— పరి

తటిత్వతి [illegible] 1. మబ్బు

[illegible] .విద్యుత్తులు ఏడిభ 8.

[illegible] ద్యుత్తులు. రూ-

[illegible] వి. త్. పుం. రుండునది

[illegible] చూ, మేఘము.గలిగి పాడి

[illegible] వి. ఈ. స్త్రీ. ఏఱు [illegible] చోఁప

[illegible] న. దే. ద్రి. క్రి. విణ:కుండఁగ ఆయా

[illegible] హై. 4, ఆ. 107. [illegible] హిమఘృణిచే

తటుక్కున. దే ద్రి. క్రి [illegible] ంతుఁగోయు తగని

[illegible] లీపరిణామము)

తటుకుపాటు. ద్వ. వి [illegible] నబట్టు: చూ, వస్త్రము.

అం, భా. ప్రి. [illegible]). ఇవముకొను:చూ, నాను

తడకాలు. దే. వి. మల్లబంధవిశేషము. ఆం,భా. ద్వి ఉ. 209 (చూ, విన్నాణములు.)

తడగము దే వి. రూ-తణగము- తణగాము- తటాకము పక్కాలి, పద్మాకరము, ఎగ్గు మీఁద నీళ్లుతెచ్చెడు తోలుసంచి. చూ సంచి. [నడి 3

తడప. దే వి. కట్టుగానుండు నార చూ,

తడపెట్టు. దే. స. క్రి తడఁబఱచు

తడయు దే అ. క్రి అలస్యముచేయు. చూ, వివరించు. 3 [డియు

తడవ దే వి· సరవాయి, అవృత్తి చూ, నం

తడవాడు దే. అ క్రి (తడవి + ఆడు)1 చూ, డొంగాడు; 2. తడఁబడు చూ, లుకలుక లాడు

తడవియాడు. దే. అ క్రి· చూ, డొంగాడు

తడసిల్లు దే వి తడబిడ్డల కిల్లు చూ, బాణము 1

తడవు. దే వి. 1 రూ-తడువు. అలస్యము. భార ఉద్యో 4,అ 195. చూ, విలంబము 1, 2. రూ-తడువు. చిరకాలము (అంతకును దలగు శబ్దములు ముందువచ్చునపుడు ఇది కేవలము కాలవాచకమగును ఉదా —అంతతడవు-ఇంతతడవు-ఎంతతడవు-కొంతతడవు ము.), అ క్రి 3. చేతులలో అట్టిట్టు పాఱు. భార ఆది 6, అ. 160 చూ, పాఱు. 4, 4· చూ, డొంగాడు, స. క్రి 5: చూ, నిమురు. భార. ద్రో 3, అ. 151, 6· చూ, వెదకు; 7 ప్రస్తావించు. కళా 3, అ. 38. చూ, వచించు, 8 చూ, విచారించు. కళా. 8, అ. 256; 9: చూ, రక్షించు. [శివుఁడు. వేం. ఆం 2.

తడవుఁగనవట్టిఁగన్నయ్య. ద్వ. వి: చూ,

తడవుట. దే. వి: చూ, వెదకుట. ఆం, భా ద్వి. 178.

తడవుడు. దే.వి.1:చూ,తడవుట; 2. పరామర్శ: చూ, విమర్శనము.

తడవుదాల్పు దే వి. బ్రహ్మచారి: చూ, వటువు

తడ(డు)వులనిడుపడు దే వి. శేషుఁడు అశ్వ. యు, కాం 449. చూ, సర్పము.

తడాకము సం. వి. అ. పుం· చూ, రూ-తటాకము

తడాకా వా వి శక్తి. "నాతడాకా చూడుము", (గోదావరి జిల్లాప్రాంతమున వాడుక)

తడాగము సం వి అ. పుం. 1 చూ రూ-తటాకము, 2 బంగారు కడియము చూ, భూషణము 2

తడి దే వి 1 తేమ· చూ,పదను 2; 2. నీరు చూ, సలిలము; విశే. 3 తేమగలది చూ, క్లిన్నము

తడిక దే వి చూ, రూ-తడక

తడికగోప్రపరి దే వి (తడిక + గోప్రపరి) చూ, రూ-తడక గోపరి.

తడికె దే వి చూ, రూ-తడక

తడికగోపరి దే వి చూ, రూ-తడకగోపరి.

తడిత్తు సం. వి త్ స్త్రీ చూ, తటిత్తు.

తడితీయు దే అ క్రి. అఱు చూ, మిడుకు.8.

తడిత్వంతము సం వి. త్. పుం చూ, రూ-తటిత్వంతము [గానుండునది

తడిపొడి దే విశే. కొంచెము తడిగలిగి పొడి

తడిపొంతను గొంతుఁగోయుట. జా. చేయు క్రిందినీటివల తెలియనీయకుండఁగ ఆయాసపెట్టు చేంపుట. "ఉదుటతి హిమఘృణిచే బరేఁ, ఎడిపొంతం గొంతుఁగోయు తగవె తెఁగితికో." (పాంచాలీపరిణయము)

తడిబట్ట. దే. వి. తడిసినబట్ట: చూ, వస్త్రము.

తడియు. దే. అ. క్రి. ఇవముకొను:చూ, నాను·

**తత్తటించే.** దే. అ. క్రి. రూ-తత్తటిలు-తత్తటిల్లు. 1: చూ, సంభ్రమించే; 2. చూ, సలించే. [7, ఆ. 76.)

**తత్తటిలు.** దే. అ. క్రి.—పై-(చలించే.-కళా.

**తత్తటిల్లు.** దే. అ. క్రి.—పై.—

**తత్తెర.** దే. వి. సారాయిపోసెడుతిత్తి చూ, సారాయితిత్తి. [చూ, లుబ్ధుడు. 2

**తత్పరుడు.** సం. విశే. (ఒకట) అసగలవాడు

**తత్పురుషము.** పా. తత్పురుషమునే వ్యధికరణము, అసమానాధికరణము అనివాడెదరు. ప్రథమాతత్పురుష, నఞ్ తత్పురుష సంస్కృతమందు మాత్రమే కలవు నిర్జనములోనగు వానిని కొందఱునఞ్ తత్పురుషలను కొందురు. అదికాదు అవి అవ్యయీభావసమాసములు అయోగ్యము, అశక్తి, అనేకము మొదలైననఞ్ తత్పురుషములు ద్వితీయాతత్పురుషము-నెలదాల్పు; తృతీయా-నెలతక్కువ, చతుర్థి-బ్రాహ్మణ సంతర్పణము, పంచమి-చోరభయము, షష్టి-మల్లెపూవు, సప్తమి-దైవభక్తి. అతీంద్రుడు, కుంభకారుడు, తత్వజ్ఞుడు ప్రకృతులు సంకరతత్పురుషములని తెలియునది) తత్పురుషము అయిదు విధంబులు — సమానాధికరణము, వ్యధికరణము, నఞ్, ప్రాది, ఉపపదము చూ, సమాసము 1; అం 2. శివాసనములుఅయిదింటిలో నొకటి చూ, శివాసనములు

**తత్ర** సం. అవ్య 1 తత్రార్థకము (కె ప).- అందు, అట, అక్కడ, అగ్గెడ, అచేట- రూ-అచ్చేట-అచ్చోట, అయ్యెడ- రూ- ఆయెడ-ఆడ; 2 కూడుకొనియుండుట, 3 పాటిపోవుట.

**తత్రత్యము.** సం విశే అక్కడకలిగినది.

**తత్రభవానుడు** సం. వి. త్. పుం: చూ, శ్లాఘ్యుడు. |చూ, హంసుడు.2

**తత్వజ్ఞుడు** సం. విశే. తత్వముతెలిసినవాడు.

**తత్వము.** సం వి. అ. న. 1 పరమాత్మ : చూ, హంసుడు. 2; 2. స్వభావము : చూ, రూపు 3, 3: చూ, ఘనము. 1; (పంచవింశతితత్వములు.— అష్టప్రకృతులు షోడశవికారములు పురుషుడు.);4. పదార్థము· చూ, వస్తువు; అం. 5 ఆకాశములుఅయిదింటిలో నొకటి· చూ, ఆకాశములు.

**తత్వశంబరము** అం. శివప్రోక్తములగు చతుష్షష్టి తంత్రములలో నొకటి: చూ, తంత్రములు

**తత్సతి** సం వి ఈ. స్త్రీ ఆమె చూ, స్త్రీ.

**తత్సమక్రియలు.** పా. సంస్కృతధాత్వాదులకు 'ఇంచే' చేర్పగానైనవి తత్సమక్రియలు. చూ, క్రియలు.

**తత్సమము** పా. సంస్కృతశబ్దముతోను ప్రాకృతశబ్దముతోను సమానమైనరూపముగలది.

**తత్సము** సం వి అ పుం ఎరవేసినమాంసము: చూ, మాంసము.

**తథా** సం. అవ్య 1. వలెను పోలికయందు వర్తించును (వత్, వా, యథా, తథా,ఇవ, ఏవం ఈఅను పోలికయందు వర్తించును ), 2 అలాగు- రూ- ఆలాగు, 3. పరస్పరనిరపేక్షములగు నవయవవస్తువులకు నొక క్రియతో సంబంధముగలుగుట, 4. పరమార్థము; 5 ఉత్తరువుచేయుట, 6. నిశ్చయము·చూ, సత్యము, 7. నిర్ణంచుట, 8. సెన్స: చూ, శుభము 1; 9 సాంగము, 10. యోగ్యమగుపని.

**తథాగతుడు** సం. వి.అ.పుం చూ,బుద్ధుడు 1.

**తథ్యము** సం వి. అ న 1 చూ, సత్యము; విశే. 2. సత్యమైనది చూ, సత్యము

**తథ్యానుజుడు.** సం వి అ. పుం. బృహస్పతిగ్రహము చూ, రాహువు. 2.

**తదా.** సం అవ్య. అప్పుడు: చూ, సద్యము.

వై. అవ. (1)=త్వమ్: భావార్థమునందు వచ్చెడు ఒకప్రత్యయము " గొప్పతనము. చిన్నతనము." వెయి. [ప్రతిక 1.

తనయ. సం. వి. ఆ. స్త్రీ. కూఁతురు. చూ,

తనయుఁడు. సం. వి. అ. పుం. కొడుకు చూ, పుత్రుఁడు. 1

తనరారు. ద్వ. అ. క్రి. (తనరు + ఆరు) రూ-తనరు. 1. అతిశయించు చూ, ముమ్మరించు, 2. ఉన్నతమగు, నిక్కు. భార విరా 1, ఆ. 162 చూ, పొడుగు. 6.

తనరు. వై. వి. 1 మంజులము చూ, హృద్యము, అ క్రి. రూ-తనరారు. 2. అతిశయించు. భాగ. ఆది 7, ఆ. 180: చూ, ముమ్మరించు, 3 చూ, తనరారు 2; 4. ఒప్పు చూ, సమ్మతించు, 5.=తనర్ చూ, విజృంభించు భార. విరా. 2 అ 133.

తనరుచు. వై అ. క్రి. రూ- తనర్చు చూ, రూ- తనరు. 2-3-4-5, అం. శ్రీ 6. తనరఁజేయు. లక్ష్మి 4, ఆ. 8.

తనర్చు వై. అ. క్రి. —వై —

తనరుపు. వై వి రూ-తనర్పు. 1 అతిశయము చూ, హెచ్చు 2; 2. ఉన్నతము: చూ, పొడవు 2, 3. విశాలము: చూ, విస్తారము.1; 4 చూ, సంతోషము.

తనర్పు. వై వి. —వై.— (పొడవునకు.— భార సభా. 1, అ 62; అతిశయమునకు - భార. స్త్రీ. 1, ఆ. 88)

తనవయస్సు. అం. తన యేండ్లు పరికాశింపఁజేయఁగూడనివగు వదునొకండింటిలో నొకటి: చూ, పరికాశింపఁ జేయఁగూడనివి.

తవాటి. దే. వి. స్తంభములమీఁదిగోడకు క్రింద వేసెడు పెద్దపలక. చూ, మదనచేకులు.

తని. వై. విశ. 1. అల్పము. కై. 6, ఆ. 85: చూ, స్వల్పము; 2.=తనుః. అలఁతి: చూ, సూక్ష్మము. 4.

తనిమము సం. వి. న్ పుం. 1. కార్శ్యము చూ, అవస్థలు; 2: చూ, విస్తారము. 1; 3 శరీరత.

తనియు. దే. అ. క్రి: చూ, తృప్తిపడు.

తనియూవాఁడు. దే. వి ఆపోవువాఁడు. (సం. ప).—ఆప్యాయిత [సాహిత్యము.

తనివి. దే. వి. రూ-తనువు. తృప్తి. చూ,

తనివిలేనివాఁడు. దే. వి చూ, అతృప్తుఁడు.

తనివు దే వి చూ, రూ-తనివి.

తనివెచ్చ. దే. వి ఇనుమంతకాఁక చూ, మందోష్ణము (చూ, వేఁడిమి.)

తనివోవు. దే అ. క్రి (తనివి + పోవు) చూ, తనియు.

తనిసను దే. అ క్రి (తనివి + వేను) -వై.-

తనిసినవాఁడు దే. వి. చూ, ఆప్యాయితుఁడు.

తను దే. విశ వృత్తియందు తనువుశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. నిర్వ. 4, అ 78.

తనుకాంతి పా దీ-కి ఉపమానములు —బంగరువు, మెఱుపుతీఁగె, కుందనము, పచ్చేవసుపుకొమ్ము.

తనుకు దే. వి 1 రూ-తనుక్కు. తాపము చూ, సంతాపము; అ.క్రి. 2 కలుగు భార.సభా.1, అ 42 చూ, పుట్టు 2; 3 జ్వలించు భార. ఆది. 2, ఆ. 199: చూ, మండు.1; 4: చూ, పరికాశించు ఉ. హరి. 4, ఆ. 89; 5 తపించు చూ, సంతాపించు.

తనుగంధము. పా. దీనికి ఉపమానములు.— కర్పూరము, ఉత్పలము, పాటలపుష్పము, పద్మము, పువ్వు, మంచిగందము, మొగలిపువ్వు.

తనుజ. సం. వి. ఆ. స్త్రీ. కూఁతురు: చూ, పుత్రిక. 1.

తనుజుఁడు. సం. వి. అ. పుం. కొడుకు: చూ, పుత్రుఁడు. 1. [వారవారణము.

తనుత్రము. సం. వి. అ. న. కవచము. చూ,

తనుత్రాణము. సం. వి. అ. న. —పై.— (శిరస్త్రాణము శిరస్కము, ముఖత్రాణము దలపము, ఉదరత్రాణము నాగోదము, జంఘాత్రాణము మంఖణము, బాహుత్రాణము బాహులము, అంగుళీత్రాణము గోధ)

తనుత్వచ. సం. వి. చ. స్త్రీ. —పై.— (ఇట్లు తనుత్వచము, తనుపత్రము)

తనుపారు. దే. అ. క్రి. (తనుపు + ఆరు) 1. చూ, తృప్తిపడు, 2. చల్లబడు. ఉ. హరి. 4, ఆ. 31. చూ, శైత్యించు.

తనుపు. దే. వి. రూ-తన్పు. 1. ఇగురు. చూ, శైత్యము. 2. చూ, సంతోషము, 3. పిప్పళ్ల, ముష్టము, 4. చంద్రకాంతి. ఆం. భా. శ్రీ. 42. చూ, వెలుతురు 1, 5. రూ-తన్పు-తనివి-తన్వి. భా. శా. 1, ఆ. 310 చూ, సౌహిత్యము; 6. శైత్యోపచారము, 7. తడి చూ, పదను 2, క్రి. 8. రూ-తన్పు-తనియఁజేయు.

తనుపంచాత. అం. దూతీచతుష్టయము సందర్శ మొదటిదానిలోని అష్టాంటిలో నొకటి. చూ, దూతీచతుష్టయము.

తనుభస్త్ర. సం. వి. ఆ. స్త్రీ: చూ, ముక్కు.

తనుమధ్య. సం. వి. ఆ. స్త్రీ. 1. అఁడుది: చూ, స్త్రీ, 2. సన్నని నడుముగల ఆఁడుది. చూ, స్త్రీ, పా. 3. ఒకానొక వృత్తము ఒక్కొక్క పాదమునకు ఒకతగణము ఒక యగణముఁగలదై యాఱక్షరముఁలు పుట్టిన వృత్తము. ఉదా.— "కామేశులి వానుస్, హేమెంతుమనంగస్, శ్యామా తనుమధ్యస్, భూమిన్ దయలొప్పన్." చూ, వృత్తము. 1. [స్వేదము.

తనురసము. సం. వి. అ. పుం. చెమట. చూ,

తనురుహము. సం. వి. అ. న. రూ-తనూరుహము 1. రోమము: చూ, వెండ్రుక. 1; 2. పక్షి ఱెక్క: చూ, ఱెక్క.

తనువడు. ద్వ. అ. క్రి. (తనుపు + పడు) చల్లనగు: చూ, శైత్యించు.

తనువు. సం. వి. ఉ. స్త్రీ. 1. రూ-తనుస్సు: చూ, శరీరము, 2. తోలు. చూ, బొందు; వెం. 3. తరి. చిన్న. చూ, స్వల్పము; 4. ఒక్క. చూ, పేలవము, 5. సన్నము. (కస్తూరింపఁబడు సన్నని నూలుపోఁగు). చూ, సూత్రము 1, అం. 6. భావములు పండ్రెండింటిలో నొకటి చూ, భావములు.

తనువచ్చు. దే. వి. చూ, రూ- తనితెచ్చు.

తనుహ్రిదము. సం. వి. అ. న. చూ, ముడ్డి.

తనూక్షయము. సం. వి. చూ, తప్పము.

తనూజుఁడు. సం. వి. అ. పుం. చూ, రూ-తనుజుఁడు.

తనూనపాత్తు. సం. వి. త్. పుం. 1. అగ్ని: చూ, వహ్ని 1, అం. 2. గహీనతానము లుపదింటిలో నొకటి చూ, గహీనతానములు (చూ, తానములు. 2) [చూ, తనుజుఁడు.

తనూభవుఁడు. సం. వి. అ. పుం. కొడుకు:

తనూరుహము. సం. వి. అ. న: చూ, రూ-తనురుహము.

తనూహ్రిదము. సం. వి. అ. న. చూ, రూ-తనుహ్రిదము.

తన్కు. చూ, రూ- తనుకు. 1.

తన్ను. దే. వి. 1. పాదతాడనము; స. క్రి. 2. అడుగుతాటించు, గుదితోఁయు, తన్ను, తాఁచు (సం. ద)— అంఘ్రితాడించు; 3. ఒరయు: చూ, రుద్దు. 1.

తన్నుఁగోల దే వి. (తన్ను+కోల) ఏటవాలుగా పోటిపెట్టిన కోల చూ, బోటు. 4

తన్నుగట్టఁదాళ్ళుతానే తెచ్చుకొన్నట్లు లో స్వయంకృతాపరాధము. ఉదా — "తన్ను గట్టఁదాళ్లుతానై, కొనివచ్చిన జోడయను చుఁ గుదియించి కరం,బునఁ బాశముఁగొని దాన నవనథీశునిఁగట్టె ననురపయ్యండా జీన్ " (కవికర్ణరసాయనము )

తన్నుగన్నవాఁడు అం పితలు ఆయిదుగురిలో నొకఁడు. చూ, పితలు

తన్నుగోడ దే వి అంపగోడ చూ, ముట్టుగోడ (చూ, మఱుఁగుగోడ )

తన్నుబల్ల దే వి ద్వారముయొక్క అడుఁగాళ్ల మీఁదవేసెడు పలక చూ, మదనచేసులు.

తన్నుబిల్ల దే వి చూ, బాలక్రీడ

తన్నుమానినధర్మము-మొదట చెడ్డబేరము గలదా? లో. ఉదా — "తన్నుమాని పరుల రక్షింపవలెననుట నీతికాదు. తన్నుమానిన ధర్మము- మొదట చెడ్డబేరము గలదా? యనులోకోక్తి విన్నాఁడవుగావా? (నీతి చంద్రిక - మిత్రలాభము)

తన్నులాడు దే అ క్రి (తన్నులు+ఆడు) ఒకరనొకరు తన్నుకొను.

తన్ను చూ, రూ-తనువు.

తన్మనము సం. వి అ పుం. ఏనుఁగు వెన్నెముకయొక్క మాంసాదిభాగము చూ,హస్తి

తన్మయము సం విణ తత్స్వరూపమైనది

తన్మాత్రము. సం వి అ న శబ్దాది-పంచతన్మాత్రములు —శబ్దము,స్పర్శము,రూపము, రసము, గంధము

తన్వి. సం వి. ఈ. (స్త్రీ) 1. అఁడుది చూ, (స్త్రీ); 2 కృశించిన దేహముగల అఁడుది చూ, (స్త్రీ); దే వి (1)రూ-తనివి తృప్తి. విజ. 2, ఆ. 109 చూ, సాహిత్యము; (2) ఒకానొకవృత్తము. ఒక్కొక్క పాదమునందు భ, త, న, స, భ, భ, న, యగణములు గలిగి పదునాలుగింట యతిగల ఇరువదినాలుగన ఛందస్సునందుఁబుట్టిన వృత్తము. చూ, వృత్తము. 1

తపతప దే. వి. రెక్కలు గుండెలులోనగు పవి కొట్టుకొనుట యుండగు నను కరణము. కళా. 8, ఆ 24 చూ, హాహాహా,

తపతి. సం. వి ఈ (స్త్రీ) శరితల్లి చూ, వరి.

తపనతనయ. సం వి ఆ (స్త్రీ) 1 జమ్మి*; చూ, శమి, 2. యమునానది చూ, నది

తపనమణి సం వి. ఇ. పుం సూర్యకాంతమణి: చూ, రత్నము 1

తపనము సం. వి. అ న 1 తాపము చూ, సంతాపము, 2 నాయికకు ప్రియవియోగకాలమందుమన్మథావేశముచేతఁ గలిగెడు చేష్ట, చూ, సంయోగము, పుం 3 వేసవికాలము, (జ్యేష్ఠ ఆషాఢ మాసములు) చూ, మాసద్వయము,4 నరకములాఱింటిలోనొకటి (పాపులనుదిపింపఁజేయునది) చూ, నరకములు; 5 జీడి* చూ, భల్లాతకి, 6 చిన్నవెల్లి *: చూ, శ్రీపర్ణము 1,7 జెచ్చెన చూ, వేఁడిమి.

తపనీయకము సం. వి. అ. న బంగారు,చూ, లోహము. 1

తపనీయము సం వి అ న —పై—

తపనుఁడు సం వి అ పుం రూ-తపానుఁడు_తాపనుఁడు చూ, సూర్యుఁడు

తపము. సం వి అ పుం రూ-తపస్సు 1 చూ, తపనము. 3, స్ న 2 రూ-తపస్సు, అతరము, జపము-రూ-జాపము, మంత్రావృత్తి, (తె.వ.).— కాక-రూ-కార్క, తలము; 3. రూ-తపస్సు తపోలోకము: చూ, లోక

ము. 1; 4. రూ-తపస్సు. చాంద్రాయ ణాది పుణ్యకర్మము (కృచ్ఛ్రాదికర్మ); స. పుం. 5 రూ-తపస్సు శిశిరఋతువు (మాఘ-ఫాల్గుణమాసములు); చూ, మాసద్వయము, 6. రూ-తపస్సు. మాఘమాసము చూ, మాసము. 1, 7 పక్షి చూ, పక్షి

తపసి వై. వి 1.=తపస్వి. జీవహారి చూ, ముని 1, 2 గార* స్వా 3, అ 77 చూ, హింగుది [హిమాంశువు

తపసికన్యాప ద్వి. వి. చంద్రుఁడు చూ,

తపసుఁడు సం వి అ. పుం —పై—

తపస్తంకుఁడు సం వి. అ పుం ఇంద్రుఁడు చూ, వేలుపుఱేఁడు.

తపస్తక్షుఁడు సం వి అ పుం —పై—

తపస్థలి సం వి. ఈ స్త్రీ కాశీపట్టణము చూ, దేశము

తపస్య సం వి అ స్త్రీ వ్రతానుష్ఠానము, వ్రతచర్య (పనినిమిత్తము తిరుగులాడుట)

తపస్యము సం వి అ పుం 1 ఫాల్గునమాసము చూ, మాసము 1, అ. వ 2, కుందపుష్పము

తపస్వి సం వి ఇ పుం 1.=తపసి-తబిసి తాపసుఁడు, వ్రతి చూ, ముని 1, 2 కనికరింపఁదగినవాఁడు

తపస్విని. సం వి ఈ స్త్రీ 1 తాపసురాలు చూ, స్త్రీ, 2 కటుకరోహిణి* చూ, కటుకరోహిణి, 3 జటామాంసి* చూ, మాంసి. 1

తపస్సు సం వి స న —తపము-తపము చూ, రూ-తపము

తపాత్యయము సం. వి. అ పుం వర్షకాలము (శ్రావణ-భాద్రపద మాసములు) చూ, మాసద్వయము [సుఁడు

తపానుఁడు సం. వి అ పుం చూ, గూ-తప

తపారము. దే. వి. రూ-తపారు. ఒకరకమగు కుళ్ళాయి: చూ, వస్త్రము.

తపారు. దే. వి.—పై.—

తపించే. సం. అ. క్రి. 1: చూ, సంతాపించే; 2: చూ, జపించే.

తపిసీలు వా. వి. అరా, వివరము, రూ-తబిసీలు.

తపువు సం. వి. స. పుం 1. నిప్పు చూ, వహ్ని. 1; 2 చూ, తపనుఁడు.

తపేల. దే వి రూ-తపేలా-తప్పేల-తప్పేలా. పచనపాత్రము చూ, పాత్రము. 8.

తపేలా దే. వి —పై — [ధండీగము. 2.

తపోధని సం. వి. ఈ. స్త్రీ చిల్లీకూర* చూ,

తపోధనుఁడు సం. వి అ. పుం తపస్సే ధనముగా గలవాఁడు చూ, ముని 1

తపోధనులను బ్రాహ్మణులు పా. పూరతు దేశమున తపతీనదికి సమీపమువనుండు బ్రాహ్మణులు శివాలయములందు పూజారులుగానుండి శివార్పిత ద్రవ్యముల భుజించెదరు. భూమిని సాగుబడిచేసి జీవించెదరు. ఋగ్వేదులు చూ, బ్రాహ్మణులు. [ర్యుఁడు.

తపోపహుఁడు. సం. వి. హ. పుం చూ, సూ

తపోలోకము. అం ఊర్ధ్వలోకములు ఏడింటిలో నొకటి చూ, ఊర్ధ్వలోకములు (చూ, అధోలోకములు. |దేశము. చూ, దేశము.

తపోవటము. సం వి అ పుం బ్రహ్మవర్త

తపోవృద్ధు అం వృద్ధులు మువ్వురిలో నొకఁడు: చూ, వృద్ధులు.

తప్తకాంచనము. సం వి అ. పుం. మేలిమి బంగారము: చూ, లోహము. 1.

తప్తకుంభము సం. వి అ. పుం. తప్తకుంభమను నరకము చూ, నరకములు.

తప్తకృచ్ఛ్రము. సం వి. అ. పుం. ఒకానొక వ్రతము. మూఁడురోజులు వేఁడినీరును,

మూఁడురోజులు వేఁడిపాలును, మూఁడురోజులు వేఁడినేయియును, త్రాగి, మూఁడురోజులు ఏమియును త్రాగక ఉపవసించుట. (6 పలముల నీరును- 3 పలములపాలును- 1 పలము నేయియును త్రాగవలెను). చూ, కృఛ్రము.

తప్తతైలాంబున్యాయము. పా. కాగినసూనెపై నీటిబొట్టువేసిన భగ్గునమండునరీతి.

తప్తపాషాణకుండము సం. వి. అ. న చూ, తప్తకుంభము.

తప్తము సం. విణ తపింపఁజేయఁబడినది. కాఁచబడినది: చూ, కాఁగు 2. [లోహము. 1

తప్తరూపకము. సం. వి అ న. వెండి చూ,

తప్తరూపము సం. వి. అ. పుం —పై—

తప్తవాలుకము సం. వి. అ పుం. తప్తవాలుకమను నరకము చూ, తప్తకుంభము.

తప్తశిలారోహణము. అం. బౌద్ధధర్మములలో నొకటి చూ, బౌద్ధధర్మములు.

తప్తశూర్మికుండము సం. వి అ. పుం చూ, తప్తకుంభము.

తప్తసురాకుండము సం వి. అ పుం.—పై-

తప్తాయఃపిండన్యాయము. పా కాలిన యినుపగుండుపకు పొగయుండదుగాని తక్కిన యగ్నిలక్షణములన్నియుఁ గలిగియుండునను రీతి.

తప్తాయసపతితబిందున్యాయము పా. కాలిన యినుపరేకుపై నీటిబొట్టుపడిన యెడల నామరూపములు లేక నశించునను రీతి.

తప్తు. వా. వి. సింహాసనము: చూ, తక్తు.

తప్తుఁడు. సం. విణ. తాపయుక్తుఁడు.

తప్ప. దే. వి. 1. గింజపట్టని ధాన్యము చూ, ధాన్యము; అవ్య. 2. కాక. చూ, వినా.

తప్పకనుజోచే. దే. స. క్రి: చూ, పొఁజోచే. అం, భా తృ. 133.

తప్పకాయ. దే వి: చూ, తప్ప. 1.

తప్పట. వై. వి.=తమ్మట: చూ, వీణె.

తప్పితము వై. వి.=దంభ. రూ-తప్పిదము-తప్పు: చూ, నేరము (ద్వ్యయమని శ. ర.)

తప్పిదము వై. వి.=దంభ (తప్పు + ఇదము) —పై—

తప్పిదారి జా. పొరపాటున. "ఈవరమగోప్యమో పుత్రియో పుగంధ్రి తప్పిదారియు యొటెంగింపఁ దరముగాదు." (పాండురంగమహాత్మ్యము) (వాడుక తప్పిజాతిఅనియు)

తప్పిపోవు ద్వ. వి చూ, అసిపోవు.

తప్పు. వై. వి 1=దమ్భః చూ, తప్పితము (దేశ్యమని శ ర.); దే స. క్రి. 2. అతిక్రమించే, భార. ఆది. 3, అ. 14: చూ, దాఁటు. 6, అ. క్రి 3. తక్కు వై. 7, అ. 88 చూ, మిడివోవు, వై. అ. క్రి 4. తప్పు చేయు.

తప్పుడు వై. వి. తప్పుట తప్పుదల. [పక్షి.

తప్పుడుగాయ. ద్వ వి ఒకానొకపక్షి: చూ,

తప్పుడువడు. వై అ క్రి (తప్పుడు + పడు) 1.తప్పుపడు; 2. పరితప్పు. [ము 1.

తప్పుతోవ. ద్వ. వి. తప్పుదారి చూ, మార్గ

తప్పుదల. ద్వ. వి చూ, తప్పుడు.

తప్పుదారి ద్వ వి చూ, తప్పుతోవ.

తప్పుదెబ్బలు ద్వ. వి. బ 1. బడులయందు పొర్లుపోయి వచ్చినందులకై వచ్చిన క్రమమునుబట్టి బాలురను ఉపాధ్యాయులుకొట్టెడు ఒకటిరెండు (పిఁచుక్క) మొదలగు దెబ్బలు; వా.2. నేరనిష్ఠకి విధించే దెబ్బలు.

తప్పెట వై వి 1.=తమ్మట చూ, వీణె;2.చూ, వాయసోటి*; 3. అడవిఈలన*:చూ,సరటి_

బూలము, చెమ్మ, ఆకేలము: చూ, వీడి యము (దేశ్యమని శ. ర.); దే వి 2.తంబ*: చూ, శింబ.

తమ్మంటు. దే వి (తమ్మె + అంటు) చెవినగ పొందు. 1, అ. 165 చూ, భూషణము. 2. (తమ్మెట్టు అనియు వాడుక)

తమ్మటము సం వి అ. పుం 1 =తప్పెట రూ-తమటము. కళా 7, అ 69, పను 6, అ. 9 చూ, పీనె, వై. వి. (1)=తమట. —పై.— (పురుషోత్తమకవీయము)

తమ్మతమకు దే వి తమ్మపడిగము చూ, పాతరియు 6 [పడిగ —పై—

తమ్మపడిగ ద్వి. వి రూ-తమ్మపడిగ-తమ్మ

తమ్మపడిగము. ద్వి వి —పై—

తమ్మపడిగె. ద్వ వి —పై.—

తమ్మలము వై వి =తాంబూలమ్ రూ-తమలము చూ, పీడియము.

తమ్మళి దే వి చూ, రూ-తంబళి

తమ్మళి జే వి —పై—

తమ్మి వై వి 1 =తామరసమ్ రూ-తామర చూ, పద్మము 1, 2 పద్మవ్యూహము; జే వి. 3 ఒకానొకచెట్టు చూ, వృక్షము.

తమ్మికంటి ద్వ వి (తమ్మ + కన్ను) 1 ఆఁడుది చూ, స్త్రీ, 2 కమలములవంటి కన్నులుగల ఆఁడుది చూ, స్త్రీ; 3 విష్ణుఁడు చూ, విష్ణువు 1 (ఇట్లు తామరకంటి)

తమ్మికెంపు ద్వ వి చూ, తమ్మితాయి

తమ్మిగద్దియవడకవాయి ద్వ వి నలువ చూ, బ్రహ్మ. 1. [పాం 1, అ. 9

తమ్మిచేక్కలిగింత ద్వ వి చూ, తమ్మిదొర.

తమ్మిమేట్టము ద్వ వి -పై- అం, భా ప్ర.81

తమ్మిచూలి. ద్వ. వి పద్మయోని భాగ. 1, స్కం 19 చూ, బ్రహ్మ 1

తమ్మిదీవి. వై. వి. 1. పుష్కరద్వీపము: చూ, లంక. 1; అం. 2. ద్వీపములు ఏడింటిలో నొకటి: చూ, ద్వీపములు

తమ్మిదొర. ద్వ. వి. పద్మినీవల్లభుఁడు చూ, సూర్యుఁడు. [హిమాంశువు.

తమ్మిపగతుఁడు. ద్వ. వి. అబ్జారి: చూ,

తమ్మిపుట్టు. ద్వ. వి. చూ, తమ్మిచూలి.

తమ్మిబిడాకెంపు గరితమిన్న. ద్వ. వి చూ, తమ్మియింటిగరిత.

తమ్మియ దే వి. రూ-తమ్మె 1. చెవితమ్మె: చూ, భూషణము 2, పలుపుతమ్మె చూ, రూ-తమ్మె: 3. చెవియొక్క అడుగు భాగము. [లక్ష్మి. 1.

తమ్మియింటి గరిత. ద్వ వి పద్మాలయ చూ,

తమ్మితాయి ద్వ వి. పద్మరాగమణి చూ, రత్నము. 1. [దొర.

తమ్మివాల్గంటి మగఁడు. ద్వ. వి చూ, తమ్మి

తమ్ముఁడు దే. వి రూ-తమ్మువాఁడు-తంబి: చూ, సహోదరుఁడు. (వృత్తియందు తమ్ముగమి-తమ్ముగుజ్జి-తమ్ముదోయి- తమ్ముపోయి వృమె ) [తుఁడు.

తమ్ముల పగవాఁడు ద్వ వి చూ, తమ్మిపగ

తమ్ములము. వై. వి = చూ, రూ-తమలము. వై. 8, అ 141

తమ్ములవిందు. ద్వ వి: చూ, తమ్మిదొర.

తమ్మువాఁడు దే. వి. చూ, రూ-తమ్ముఁడు.

తమ్మె దే వి చూ, రూ-తమ్మియ.

తయవాయతి వా వి కాఁచికొని యుండుట: రూ-తయివాయితి.

తయారు వా. వి: చూ, సిద్ధము. [యతి.

తయివాయితి. వా. వి. చూ, రూ- తయవా

తయిరు వా. వి. రూ- తైరు చూ, పెరుఁగు.1.

తరంగన్యాయము. పా. ఒకదానివెంబడి నొక టి విడువకవచ్చునను రీతి.

తరంగప్రతిబింబన్యాయము. పా. తరంగము నందుఁ బ్రతిబింబించే సూర్యుఁడొక్కఁడై నను, ప్రతిబింబములు తరంగములయందుఁ జాల గాన్పించుననురీతి [చూ, వీచి 1

తరంగము సం. వి అ పుం.= తరగ అల

తరంగిణి. సం వి. ఈ. స్త్రీ 1. ఏఱు చూ, నది; అం 2 భాషాంగములు పదునొకటిం టిలో నొకటి· చూ, భాషాంగములు (చూ, భాష 1)

తరండము సం. వి అ పుం, న 1 ఓడ,ఏఱుదాఁటుపుట్టి (అని కొందఱు) చూ, హోడము, 2. గాలపుదారము కట్టిన కొయ్యలోనగునది

తరఁగ వై. వి = తరంగః చూ, వీచి 1

తరళ. సం. వి. ఆ. స్త్రీ. కొరింద చూ, ముర్కురి [వాదించే

తరకటించే వై అ క్రి = తర్కించే చూ, తరకటింపు వై. వి = తర్కః చూ,వాదము 1

తరకసము. దే. వి రూ- తరకసా. అమ్ముల పొది. స్వా 4, ఆ. 28 చూ, బాణము 1

తరకసా.దే వి 1 —పై—;2 చూ,తఁకటింపు

తరక్షువు సం వి ఉ. పుం· చూ, సివఁగి 1

తరగంపియ. దే. వి రూ-తిరగంపె ఒకానొక ఱంపము· చూ, ఱంపము

తరగంపె దే. వి —పై —

తరగతి వా. వి. (తరము + గతి) 1 తరమును జరిపెడు భాగము; 2, క్లాసు. “మాబడి యందు నాలుగు తరగతులు గలవు”

తరగతిగుండ్లు మి వా. వి. బ. అఁడుదాని మెడనగ· చూ, భూషణము. 2.

తరటు. దే. వి 1 రూ-తిఱటు. చేటుకు.చూ, మునికోల. 2; 3. అశ్వాదుల శీఘ్రలంఘనము: చూ, హయము; 3. తోలుసారి:చూ, మార్త్వి. 1.

తరణము. సం. వి. అ. న 1. (ఏఱు మొదలైనవి) దాఁటుట. చూ, లంఘు; పుం.2.ఓడ: చూ, హోడము.

తరణి. సం. వి ఈ స్త్రీ 1. రూ- తరము- తరి తర్తి, ఓడ. చూ, హోడము; 2. ఏఱు: చూ, నది, 3 దాఁటుట · చూ, లంఘు; 4. పిన్నగోరఁట * చూ, మహాసహ, 5 కుమారియను మందు, 6. చూ, సేమంతి *; పుం 7 చూ, సూర్యుఁడు, 8 చూ, సముద్రము [చూ, వాపి. 4.

తరతమభావము సం వి అ. న. తారతమ్యము·

తరతరము. దే. అవ్య క్రి విశ 1. క్రమక్రమముగా భార. ఆది. 2, ఆ. 4, 2 పరంపరగా.

తరపణ్యము సం వి. అ. న. ఆతరము, అవాపము. (తె ప) — ఓడకేవు, కేవు.

తరపణ్యుఁడు సం. వి. అ పుం చూ, మాలిమి 3.

తరపు దే న. క్రి 1. పోఁగొట్టు. భాగ 6, స్కం 89 చూ, ధంగించే, వా. వి 2 రూ- తరఫు. పక్షము, ఒకవైపు.

తరబడి దే. వి (తరము + బడి) రూ-తరము. 1 చూ, పురుషాంతరము 2. మానము చూ, తరము, 3. సామ్యము· చూ, సమానము 2; 4 వరుస· చూ, పంక్తి 1, 5 వస్తువు చూ, సరకు. 2 [అనియు)

తరబియతు. వా. వి. నేర్పు (రూ- తరిఫియ్యత్తు

తరము. సం. వి అ. పుం. 1. దాఁటుట చూ, లంఘు, 2. పడవ, పుట్టి (అని కొందఱు): చూ, హోడము, 3 నిప్పు· చూ, వహ్ని 1: 4. చెట్టు: చూ, వృక్షము, న. 5. వడి: చూ, వేగము 3; 6· చూ, మాంసము;

దద్దడము దే వి రూ-దద్దళము 1. అల్పదేవాలయము. చూ, సదనము. 1, 2 బోడిపిట్ట చూ, సదనము.1. (రాయలసీమలోని యిండ్లు చాలవఱకు దద్దడములే.)

దద్దిల్లు. దే అ క్రి రూ-దద్దిల్లు తబ్బిబ్బుపడు కళా. 5, ఆ 24 చూ, భయపడు

దద్దిలు దే అ క్రి.—పై.—

దద్దళము దే. వి చూ, రూ-దద్దడము

దద్దిల్లు దే. అ క్రి చూ, రూ-దద్దరిల్లు

దద్దు నై వి రూ-దద్దుర ఎఱ్ఱమాఱి చీమ కుట్టుట లోనగువానిచే గలిగెడు బుడిపి చూ, పదుళ్ళు

దద్దురు. నై. వి —పై — [పరిపుష్టాటము

దద్రుఘ్నము సం వి అ. పుం తగిరిస* చూ,

దద్రురోగుడు సం విణ రూ-దద్రుణుఁడు, (దద్రు వనుకుష్ఠరోగముగలవాఁడు) దద్రురోగి

దద్రురోగి సం విణ.—పై —

దద్రువు. సం. వి ఉ పుం -దద్దురు గ్రంథి (తె ప)—ఆణియ-రూ-ఆణె- ఆణెము-ఆణియ-ఆనె, కంతి-రూ- కడంతి-కణంతి, దద్దు-రూ-దద్దురు, గోరును తద్వి —చీము లోనగునవి పుట్టిన దద్దురు.—(తె. ప)-కంతి (చూ, మండలము. 3) (దద్రువుకుష్ఠ రోగ జాతిలోనిది)

దధి. సం వి. ఇ. న. 1 చూ, పెరుఁగు. (దధి భేదములు.—అశ్లేష్మము, పారిగారిటము, అఘనము), 2 సరళమను ధూపద్రవ్యము చూ, రాజాగ్న్యము; 3 చూ, మద్ది*

దధిచారము సం వి. అ పుం కవ్వము చూ, మంథానము [వెన్న, 2 చూ, వెలగ*.

దధిత్థము సం వి అ. పుం 1 మిసిమి చూ,

దధిఫలము. సం. వి. అ పుం —పై —

దధిమండము సం వి. అ. న.మీఁగడతీసిన పెరుఁగు (మీఁగడపెరుఁగు అశ్లేష్మము): చూ, పెరుఁగు.

దధిమథము. సం. వి. అ న. చిలుకుట: చూ, మథనము.

దధిసారము. సం. వి అ. పుం చూ, దధిత్థము.

దధిసముద్రము అం సముద్రములు 7 లో నొకటి (పెరుఁగుసంద్రము). చూ, సముద్రములు.

దధిప్రహిన్యాయము పా పెరుఁగును నద్దును గలసినట్లుగా నేమియులోఁ చక యుండెనను రీతి. [ముని 1.

దధీచి సం వి ఇ పుం. దధీచియనుముని చూ,

దధీచిబ్రాహ్మణులు పా. యజుర్వేదులు. వీరు గురువులుగను పైరు పెట్టెడి వారుగను యాచకులుగను ఉన్నారు వీరికీ పేరు దధీచియను ఋషివలంబట్టి గలిగినది చూ, బ్రాహ్మణులు.

దధ్యాకరము సం. వి. అ. పుం చూ, దధిసముద్రము.

దధ్యాణ్ణము. సం. వి.అ. పుం.—పై —

దధ్యుదము. సం. వి అ పుం.—పై —

దనము నై. వి-ధనః ఆస్తి, సొత్తు. చగా, విత్తము. 1.

దనియము నై. వి-ధన్యా. కొతిమిరి*. (తాపమును వాంతిని శ్వాసమును త్రిదోషములనుపోఁగొట్టును పచ్చిదనియాలు మాత్రము నధికబలిచును.)' చూ, వితున్నకము 1.

దనియాలు. నై వి బ-ధనికా-ధాన్యాక. కొత్తిమిరివిత్తులు. (విత్తులు చెప్పుతో రాచిన గాని మొలకలెత్తవు "దనియాలజాతి"): చూ, వితున్నకము. 1.

దనియు దే స. క్రి. కూడు చూ, సంగమించే.

దనివు. దే. వి కూడిక, సంగమము చూ, సంయోగము. [చూ, వఱకు..

దనుక. దే. ద్రి. రూ-దాఁక. పర్యంతార్థకము:

దనుకు దే స.క్రి. రూ-దన్ను.1. తాఁకు: చూ, స్పృశించే; 2. పొందు, సక్తమగు: చూ, ప్రాపించే.

దనుజాఁడు. సం. వి. అ. పుం రక్కసుఁడు (కశ్యపునకు దనువను భార్యయందుఁగల్గిన సంతతి): చూ, రాక్షసుఁడు. 1

దనుక. దే. స క్రి· చూ, రూ-దనుసు

దప్పము దే విణ. దట్టము చూ, సాంద్రము 2

దప్పళము. దే వి చూ, పులుసు

దప్పి దే వి 1. రూ-డప్పి-దప్పిక. నీరువట్టు. భార. అర. 7, ఆ 143 చూ, పిపాస; 2 అలసట చూ, శ్రమము 1. [యము )

దప్పిక దే వి —పై— (స్వార్థమునకప్రత్య

దఫా వా వి తడవ, మరల

దబకాయించే వా స. క్రి అగుచు, గదమా యించు, దబాయించే, బుకాయించే

దబదబ. దే. వి తలుపులోనగునవి తట్టుట, పరు గెత్తుట, బాఁదుట, మొత్తుట లోనగువాని యందగు ధ్వన్యనుకరణము. చూ, హాహా.

దబము. దై. వి.=తపస్ చూ, తపస్సు

దబరా. వా వి. వెడల్పయినగిన్నె, బోగిణి చూ, పాత్రము. 6

దబాదిబ. దే. వి: చూ, రూ-దబదబ.

దబాయించే. వా. స. క్రి: చూ, దబకాయించే

దబాలున. వా. దశ్రి. ఒక్కుమాఱుగా, దబు క్కున, దిబుక్కున, దిబ్బున: చూ, వేగము.3.

దబుక్కున. వా. దశ్రి.—పై.—

దబ్బ. వై. వి. 1.=దర్భ*· చూ, తృణము. 1; 2. కావడిబద్ద: చూ, బద్ద. 3; 3 వెదురు బద్ద: చూ, బద్ద, 2; దే.వి. 4. నాగరంగము* (దీనిభేదములు:— కోలదబ్బ, తియ్యాదబ్బ, దూదిదబ్బ, పుల్లదబ్బ, నాగదబ్బ మొ): చూ, శర్కరాంకము.

దబ్బడము. దే. వి. 1. రూ-దబ్బు- దబ్బుడు, మూఁకుడు, సిబ్బి (మూఁతఆనియు): చూ, పాత్రము. 6; వా. వి. 2: చూ, రూ-దబ్బ నము.

దబ్బడించే. దే స క్రి 1 చూ, బోరలించే; 2. చేతులతో చేఁచే చూ, పటుతళించే.

దబ్బనము. దే. వి రూ-దబ్బడము. గోనె కుట్టెడుసూది, బృహత్సూచి చూ, సూది.

దబ్బయుంగరము ద్వ వి పవిత్రపుముడివలె బంగారుతో చేసిన యుంగరము: చూ, భూషణము 2.

దబ్బర. దే వి. అరివాణము చూ, పాత్రము 6.

దబ్బఱ. దే వి 1.(రూ-డబ్బఱ-దబ్బా-డబ్బ-డబ్బు) బొంకు: చూ, వితథము; నై. వి 2. =దభ్రి (దేశ్యమని శ. ర) మోసము అచ్చ. బాల, కాం. 172· చూ, వంచన; దే వి 3. ఆపద చూ, విపత్తు, 4. తప్పు: చూ, నేరము, విణ. 5. కల్లరి చూ, బొంకుకాఁడు, 6 మోసకాఁడు చూ, వంచకుఁడు. 1

దబ్బఱకత్తియ. ద్వ వి: దబ్బఱలాడునది. దబ్బ ఱి చూ, స్త్రీ. (రూ-డబ్బఱకత్తె)

దబ్బఱకాఁడు దే. విణ 1 కల్లరి. చూ, బొం కులాఁడు; 2 మోసకాఁడు. చూ, వంచ కుఁడు. 1

దబ్బఱి దే. విణ. (దబ్బఱ + ఇ) 1 చూ, ద బ్బఱకాఁడు. 1; 2· చూ, దబ్బఱకాఁడు.2; 3. చూ, దబ్బఱకత్తియ.

దబ్బవాఁడు. ద్వ వి. మేదరవాఁడు: చూ, వేణులావకుఁడు [వేలు. 2.

దబ్బవ్రేలు. ద్వ. వి. పవిత్రపువ్రేలు. చూ,

దబ్బాటు. దే. క్రి. విణ· చూ, రూ-డబ్బాటు.

దబ్బిచిప్ప. దే. వి కొబ్బరి, తాటి లోనగువాని కుండ్లను బ్రద్దలుచేసెడి పనిముట్టు.

దబ్బిలి. దే. వి: చూ, ధూర్త. 1—2.

దబ్బు. దే. వి. 1. వచనము. సా. 1, ఆ. 71: చూ, శబ్దము. 3; వై. వి. 2 =దంభ (దేశ్య మని శ. ర.) బొంకు: చూ, వితథము; దే. వి. 3. చూ, రూ-దబ్బడము; 4. వేయుచుట లోనగువాని యందగు ధ్వన్యనుకరణము,

దిబ్బు: చూ, హూహూ; స. క్రి. 5. అను: చూ, వచించే.

దబ్బుడు. దే వి. మోఁత. చూ, దబ్బడము.

దబ్బున. దే. దర్. క్రి. విశ. శీఘ్రముగా: చూ, వేగము. 3.

దబ్బుర. దే. వి: చూ, రూ-డబ్బుర.

దబ్బువెట్టు. దే. స. క్రి. కప్పు: చూ, మూయు.

దభ్రము. సం. విశ. 1.=దబ్బర. మోసము: చూ, వంచన; 2. సన్ననినూలుపోఁగు: చూ, పోఁగు. 1.

దమథము. సం. వి. అ. పుం. 1. క్లేశము నోర్చుతనము, (బ్రహ్మచర్యాది క్లేశమును సహించేట): దమము, శాంతి; 2. దండనము: చూ, శిక్ష. 2.

దమనము. సం. వి. అ న. 1. అణఁచేట. దమము; పుం. 2 =దవనము రూ-దవనము (అని కొందఱు): చూ, రుచి. (వాసనమొక్క); అం. 3 అస్త్రములలో నొకటి: చూ, అస్త్రములు. (చూ, బాణము. 1 ); వా. 4 వ్యవహారమున — యజ్ఞాదిక్రతువులకు చేయు ధర్మము "దానదమన విక్రయాద్యధికారములు"

దమనుఁడు. సం వి అ. పుం. 1. ఒకముని: చూ, ముని 1; 2. శూరుఁడు: చూ, పరాక్రముఁడు 2; విశ. 3. అణఁచేవాఁడు. దమి.

దమము. సం. వి. అ. పుం. 1. దండోపాయము చూ, దండము 36; 2. చూ, దమథము 1; 3 బ్రహ్మచర్యాదిక్లేశములనోర్చుట శాంతి. (ఇంద్రియనిగ్రహము); 4: చూ, దమనము 1; 5.=దమ్మ. అడుసు. (నీరుపెట్టి దున్నినచేలం అనియు): చూ, బురద; అం. 6. మానసిక పూజాకుసుమములు 16 లో నొకటి: చూ, మానసిక పూజాకుసుమములు.

దమయంతి. శా. నలునిభార్య (తనయందము చేతనితరులనుదమింపఁజేయునది. చూ, భార్య-

దమి. సం. విశ. (న్.ఈ.న్): చూ, దమనుఁడు.3.

దమించే. సం. స. క్రి. అణఁగఁద్రొక్కు: చూ, పిసుకు. 3. (రూ-దమియించే అనియు)

దమితుఁడు. సం. విశ. అణపఁబడినవాఁడు. (ఆచార్యాదులచేత శిక్షింపఁబడిన శిష్యుఁడు.): దాంతుఁడు. [ధుః చూ, వహ్ని. 1.

దమునసుఁడు. సం. వి. స్. పుం. అగ్నిహోత్రుఁ

దమ్మఁడు వై. విశ.=ధార్మిక. కపటములేనివాఁడు. హరిశ్చ. 4, అ 101. చూ, నిష్కపటి. 2.

దమ్మము. వై. వి 1.=ధర్మమ్: చూ, పుణ్యము 1; దే. వి. 2. నాలుగుకాసుల నాణెము: చూ, తారకు. (1)

దమ్మిడి. దే.వి. 1. పైస, అణాలో పండ్రెండవవంతు, అయిదుకాసుల నాణెము: చూ, రువ్వ. 1; 2 రెండుకాసుల నాణెము: చూ, రువ్వ. 2.

దమ్మ. వై. వి. 1.=దమః. అడుసు: చూ, బురద, 2. నీరుకట్టి దున్నినదుక్కి (చూ, బురద)

దమ్ముకొను. ద్వ. అ. క్రి అడుసగు, పంకిలమగు.

దమ్ముపలక. వా. వి. అడపట్టె - రూ- అడ్డపట్టె. [వృషభము. 1.

దమ్యము. సం. వి. అ. పుం. వత్సతరము. చూ;

దయ. సం. వి. ఆ. స్త్రీ. 1: అనుకంప-రూ-అనుకంపము, అనుక్రోశము, అర్తనము. అహోబత, ఊ, ఓ, కరుణ, కాపేయము, కారుణ్యము, కృప, ఘంబు, ఘస్, ఘృణ, జనని, జాగుప్స, ణ, తా, ప్రేమ-రూ-ప్రేమము. (తె. ప).—అక్కటిక-రూ- అక్కటికము, అక్కసము, ఉబలాటము, ఒగచేదము, కనికరము, జాలి, నిబ్బరము (చూ, ప్రేమము); పా. 2. దీనికి ఉపమానములు. విష్ణుమూర్తి, బుద్ధుఁడు; అం. 3. రోగయు

మాంగములలో నొకటి: చూ, రోగయమాంగములు, (చూ, అంగము.8.)

దయచేయు. వి. అ. క్రి. 1. కరుణించే . పాండు. 5, ఆ. 154: చూ, రూ-దయసేయు; స. క్రి. 2. అచ్చే, అచ్చేకొను, ఇచ్చే, ఇడు, ఒసఁగు, ఒసవు నిర్వ. 3, ఆ. 81· చూ, పెట్టు. 8; వా. 3. కూర్చుండు; 4. రండు, రా; 5 పొంకు,పో

దయసేయు. వి. అ. క్రి: చూ, రూ-దయచేయు (కరుణించుటకు.—కనికరించే, దయచేయు దయసేయు, నిబ్బరికించే (పం. వ)· కరుణించే ) [నము.

దయాధర్మవిచ్చేనము. జా దయతోఁగూడిన దా

దయాపరము. సం. విణ: చూ, కరుణాపరము.

దయాపరుఁడు సం. విణ దయాళువు· చూ, నురతుఁడు [శుక్రులు.

దయావతి. అం. శుక్రులు 22లో నొకటి· చూ,

దయాళువు. సం. విణ ఉ·చూ, దయాపరుఁడు

దయిత. సం. వి. అ. స్త్రీ 1. ప్రియురాలు· చూ, స్త్రీ; 2. ఆఁడుది. చూ, స్త్రీ

దయితము. సం. విణ కోరఁబడినది: చూ, వాంఛ.

దయితుఁడు. సం. వి. అ. పుం 1. ప్రాణనాథుఁడు: చూ, ప్రియుఁడు; విణ. 2. ఇష్టుఁడు: చూ, స్నేహితుఁడు. 1.

దయివాఱు. దే. అ క్రి. రూ- దైవాఱు. 1.అతిశయించే చూ,ముమ్మరించే, 2: చూ, పారలిపాఱు.

దయ్యపుకంటికిఁ జేలపుగింజ పెద్దది. లో. ఉదా. "అక్కటకటా ! దయ్యంబునీకంటికిం జేలపుగింజయుం బెద్దదయ్యనే." (శృంగార నైషధము)

దయ్యము. వై. వి. 1=దైవమ్. పిశాచము. రాఘు. 3, ఆ. 28: చూ, భూతము; 2.=దైవమ్. దేవుఁడు. రాఘు. 3, ఆ. 28: చూ, వేలుపు; 3. విధి· చూ, బ్రహ్మ. 1. (అనికొందఱు.) (ఇదివిచార్యము)

దయ్యు. దే. అ. క్రి. 1. రూ-డయ్యు. బలహీనమగు: చూ, వలియు; 2. కృశించే: చూ, శోషించే ( దర తెలిసికొనుట)

దర. వై వి.=ధర: చూ, వెల 1 (కొనఁదలఁచి

దరఖాస్తు వా. వి. విన్నపము " వారంటుదరఖాస్తు, నీటిదగఖాస్తు, వరీక్షదరఖాస్తు" మొ.

దరణము. వై. వి.=ధరణము. ఎనిమిది డబ్బుల నాణెము. (దేశ్యమని శ. ర)

దరదము. సం. వి. అ. న. రూ-దారదము. ఇంగిలీకము: చూ, హింగుళము.

దరము. సం వి. అ. పుం, న. 1. భయము: చూ, వెఱపు; 2 శంఖము: చూ, సంకు; 3. గొయ్యి, గుంట: చూ,రంధ్రము 1; అవ్య. 4. ఇంచుక "దరహాసము" · చూ, స్వల్పము. [హాస్యము. 1.

దరహాసము. సం. వి అ. పుం చిఱునవ్వు.చూ,

దరి. సం. వి ఈ స్త్రీ. 1. గుహ. కృత్రిమమైన (మనుజులుత్రవ్విన) గృహాకారమైన పర్వతబిలము: చూ, రంధ్రము. 1. (చూ, పర్వతము); వై. వి. (1)= తీరమ్. గట్టు. పాండు. 4, ఆ. 40. చూ, రోధస్సు;(2)= తీరమ్. దగ్గఱ. సా. 3, ఆ. 232: చూ, సమీపము. 1; (3) పేర: చూ, సీమ. 1.

దరికొను. దే. అ. క్రి 1 ఎరియు, కాలు (అనికొందఱు): చూ, మండు 1; పేర్చి. 2. దరికొలుపు. [కుఁడు.

దరిజే. వా. వి. కుట్రపువాఁడు: చూ, సూచి

దరితుఁడు. సం. విణ. భయపడినవాఁడు: చూ, వెఱపరి. [నము.

దరిద్రము. సం. వి. అ. న. లేమి: చూ, బీదతన

దరిద్రుఁడు. సం. విణ: చూ, బీదవాఁడు.

దరిచేసి. దే. వి. దైన్యముగలవాఁడు. దీనుఁడు. కై. 5, ఆ. 198: చూ, ప్రాయిడి.

దరిమిలా. వా. క్రి. విణ తరువాత "దరిమిలా యీనాము" "దరిమిలాసంగతులు"

దరితరాఫ్తు. వా. వి. రూ-దర్యాప్తు. విచారణ

దరిసించే. వై. స. క్రి 1.= దర్శ. చూచే: చూ, వీక్షించే, 2 కానుకగాఇచ్చే చూ, పెట్టు 8; వా. 3 (కోపాదులచేత) ఉచితముగాఇచ్చే. "నీకేమి ? నేనువానికిదరిసించే కొనెదను"

దరిసెనము. వై. వి =దర్శనమ్. రూ-దర్సెనము చేఁరిసెనము, చేకానుక' చూ, లంచేము.

దరుజో. దే వి. 1 గోడలకు పూయు సున్నపు గచ్చే చూ, లేపనము. 2; 2. సున్నము తాళ్ళతో కలుపుట [సత్యము 1

దరుమము వై వి =ధర్మమ్ న్యాయము చూ,

దరువు వై. వి 1. గీతివిశేషము; 2 =ధ్రువ. (సూళాది సప్తతాళములలో నొకటి) చూ, సూడకములు, వా. వి. 3. శరీరమందలి కండరాదుల బలము. "పీఁడుమునుపటివలె లేఁడు. ఒడలంతయు దరువుతీసినది", 4. కొట్టుట "పాఠమురానందున పంతులు పిల్లవానినొక్క దరువుతీసినాఁడు"

దరువుచేయు వై అ క్రి చూ, తాళగించే.

దరేఖానా. వా. అవ్య. 1 దిక్కులేని, 2 అంతులేని, 3 లెక్కలేని.

దరోబస్తు. వా వి. సర్వము.

దరేజ. వా. వి' చూ, రూ- గరిడీ.

దర్దుర. సం వి. ఆ. స్త్రీ. దుర్గ: చూ, పార్వతి. 1.

దర్దురము సం. వి. అ. పుం 1. కప్ప: చూ, మండూకము. 1; 2 మబ్బు: చూ, మేఘము. 1.

దర్పకుఁడు. సం. వి. అ పుం. దుర్గతినిబొందువాఁడు: చూ, మన్మథుఁడు.

దర్పణము. సం. వి. అ. పుం. 1. అద్దము: చూ, ముకురము; అం. 2. జన్యతాళములలో నొకటి: చూ, జన్యతాళములు.

దర్పము. సం. వి. అ. పుం. 1. గర్వము: చూ, హంకారము; 2. కస్తూరి: చూ, మృగమదము, అం. 3 చూ, అశ్వావ్యాదియుపరిజ్ఞానము; 4. అస్త్రములలో నొకటి:చూ, అస్త్రములు [రించే

దర్పించు సం అ క్రి. గర్వించే చూ, హంక

దర్బారు. వా వి 1. కచ్చేరి, కొలువుకూటము: చూ, సభ 2; 2. దర్బారు అను రాగము: చూ, స్వరము 2

దర్భ సం వి అ. పుం 1 =దబ్బ. కుశము, పవిత్రము, కుశము' చూ, తృణము. 1; అం 2 అర్ఘ్యములు ఎనిమిదింటిలో నొకటి: చూ, అర్ఘ్యములు.

దర్భముద్రిక సం. వి ఆ స్త్రీ. దబ్బయుంగరము పాండు 3, ఆ 50. చూ, భూషణము 2.

దర్భలు. అం కుశము, కాశము, యవము, దూర్వము,విశ్వామిత్రము, ఉసీరము, కుందురము, గోధూమము, వ్రీహి, ముంజము (10)

దర్యాప్తు. వా వి' చూ, రూ-దరియాప్తు.

దర్వి సం. వి. ఈ. స్త్రీ 1. మిక్కిలిచిన్నగరిఁటె, మిళ్ళి, ఖజపము చూ, పాత్రము.6; తద్వి.— గరిఁటెకు, చిల్లుల గరిఁటెకు, కట్టిగరిఁటెకు—: చూ, పాత్రము 6; 2. పాముపడగ చూ, సర్పము.

దర్వీకరము. సం. వి. అ. పుం. పాము: చూ, సర్పము.

దర్వీపాకరసన్యాయము. పా. గరిఁటె నవాస్త వస్తువులలోను మెలఁగుచున్నను ఆవస్తువుల రుచి దానికిఁదెలియదనురీతి.

దర్శకుఁడు. సం. వి అ. పుం చూచేవాఁడు, ద్వారపాలకుఁడు: చూ, ప్రేక్షణికుఁడు; విణ. 2. చూపెడువాఁడు: దర్శయిత; 3. నేర్పరి: చూ, సమర్థుఁడు.

దర్శనము. సం. వి. అ న. 1. చూపు· చూ, వీక్షణము; 2. కన్ను· చూ, లోచనము, 3 అద్దము: చూ, ముకురము; 4. తెలివి· చూ, బుద్ధి; 5. కల: చూ, స్వప్నము· 6. శాస్త్రము: చూ, శాస్త్రములు, 7 ధర్మము· చూ, పుణ్యము. 1; 8.=దరిసెనము, కానుక. చూ, లంచేము, అం. 9. దశావస్థలలో నొకటి చూ, దశావస్థలు; 10 ద్వాదశావస్థలలో నొకటి· చూ, ద్వాదశావస్థలు.

దర్శపూర్ణమాసేష్టి. అం చూ, హవిర్యజ్ఞములు

దర్శని సం. వి ఈ. స్త్రీ చూ, రూ-దర్శిని.

దర్శనీయము సం. విణ చూడఁదగినది చూ, వీక్ష్యము 2.

దర్శము సం. వి అ. పుం 1. అమావాస్య చూ, సూర్యేందుసంగమము (చూ, తిథులు), 2 అమావాస్యనాఁడు చేయఁదగినయిష్టి చూ, యజ్ఞము, 3. చూపు; చూ, వీక్షణము; అం. 4 స—మ—హీనతానములు 7 లో నొకటి చూ, స—మ—హీనతానములు (చూ, సర్వతానములు)

దర్శయిత. సం. విణ. (ఋ. ఈ. ఋ) చూపువాఁడు; దర్శకుఁడు. [చూ, హిమాంశువు

దర్శవిపత్తు సం వి. ద్ పుం చేందమాను

దర్శించే సం. స క్రి =దరిసించే చూచే చూ, వీక్షించే [క్షితము

దర్శితము. సం విణ చూపఁబడినది: చూ, వీ

దర్శిని. సం. వి. ఈ. స్త్రీ. 1 ఉపరథ్య చూ, మార్గము. 1; వా. 2. చూపెడు ఒకానొక యంత్రము "దూరదర్శిని"

దర్సెనము. వై. వి.= చూ, రూ-దరిసెనము

దలపము. సం. వి. అ పుం. ముఖత్రాణము చూ, వారవారణము.(చూ, తనుత్రాణము)

దలారి. దలాలి. వా. వి. తరకరి.

దళిమము. వై వి. 1 =తలిమ: చూ, రూ-దడిబము; దే. విణ 2. సన్నము· చూ, సూక్ష్మము. 4.

దల్లు వై వి =జల చూ, రూ-జేల్లు.

దవ. దే వి. 1. చెఱకుకొన చూ, తలవాడి; 2 ధూళి అం, భా ద్వి 220· చూ, రేణువు. 1.

దవంత్రి దే. వి. అగడిత· చూ, పరిఖ.

దవగము వా వి ఎండావు. చూ, సొరుగాను.

దవడ. వై. వి = చూ, రూ-దవుడ

దవనము వై. వి =దమనః వాసనగల మూలిక * చూ, గుచి.

దవము సం వి అ పుం రూ-దావము. 1 కార్చిచ్చు చూ, వహ్ని 1; 2 అడవి: చూ, విపినము

దవసము వై. వి =ధాన్యమ్ కొలచే, పసు పరకము (దేశ్యమని ఆ. ర) చూ, సేస 1.

దవాగ్ని. సం. వి. ఇ పుం ఎరగలి చూ, వహ్ని 1

దవారిబ్రాహ్మణులు పా నేపాళదేశపు బ్రాహ్మణులలో నొక తెగవారు చూ, బ్రాహ్మణులు.

దవిష్ఠము సం. విణ మిక్కిలిదవ్వైనది· చూ, సుదూరము (చూ, విప్రకృష్టము)

దవీయము సం విణ =దవ్వు (స్. ఈ స్)
— వై —

దవు. వై. విణ=దవీయము చూ, రూ-దవ్వు.

దవుడ వై వి =ధాడా తాలువు (రూ-దవడ-దాసువ-దౌడ) బుగ్గలోపలిభాగము. (దేశ్యమని. శ. ర) చూ, పెలవి.

దవుడనకాలుపట్టుకొను దే అ. క్రి· చూ, పణతలపడు అం, భా ల్య 104.

దవుడు. వై వి.=రూ-దౌడు ధౌరితకమ్. అశ్వగతి చూ, పాయము, 2.=ధావనమ్· చూ, పరుగు. 2; 3. దండయాత్రి చూ, యుద్ధము.

దవురు. దే. వి. రూ-దౌరు. కాంతి చూ, వెలుతురు 1 [ము. 2

దవురుగల్లి వా. వి మెడనగ చూ, భూషణ

దవ్వ. దే. వి. తామరనడిమి మెత్తనిభాగము చూ, ఏకద్విబీజదళ వృక్షములు

దవ్వు నై. విణ.=దవీయము. (మా-దవ్వు దౌ-కౌవు) భార అను 2, ఆ 163 చూ, మా-దవ్వు

దశ సం వి ఆ స్త్రీ 1 =దేశ కాలకృత మైనస్థితి "శుక్రమహాదశ మహారాజయోగమును ఇచ్చును" చూ, పాటు (అవస్థ) 2 దీపపువత్తి చూ, వత్తి 2, ఐ 3 ఒద్దె చూ, వత్తె. [వాఁడు చూ, రావణుఁడు

దశకంఠుఁడు సం. వి. అ. పుం. పదికంఠములు

దశకము. . ౦ స ఈరేను చూ, పది

దశకుమారచరిత్రము అం ఈగ్రంథమునుదండి వ్రాసెను చూ, కావ్యనాటకములు

దశకోటి అం చూ, సంఖ్యాభేదములు

దశక్షారములు అం మునగ, ముల్లంగిదుంపలు, మోదుగ, చింత, చిత్రమూలము, అల్లము, వేప, గుమ్మడు, ఉత్తరేణి, వాఁకుడు. (ప్లీహ అనాహగుల్మఉదర రోగములు హరించును)

దశదానములు. అం చూ, దానములు

దశనము. సం. వి. అ న. 1 కవచము చూ, వారవాణము. పుం. 2 దంతము (దీనిచేతవనితలయధరమును గొఱుకుదురు:) చూ, పల్లు. 2, 3. శిఖరము: చూ, నుడి 3

దశనవాసస్సు సం. వి. స. న. పలువలువ చూ, పెదవి

దశబలములు. అం. బుద్ధి, క్షాంతి, వీర్యము, ధ్యానము, జ్ఞానము, కృప, శీలము, బలము, దానము, ఉపేక్ష.

దశబలుఁడు. సం. వి. అ. పుం:చూ, బుద్ధుడు 1.

దశభూమీశుఁడు. సం. వి. అ. పుం. చూ, దశార్హుఁడు

దశమము అం. లగ్నకాలకర్తవ్యములు 12 లో నొకటి (రాజ్యము, ఆజ్ఞ, కర్మ, కీర్తి, ఉద్యోగము, మానము, జీవనము, వాణిజ్యము, కృషి, నిధి, యజ్ఞము, ఊరువు, జానువు, దత్తపుత్రుఁడు, (ప్రభుసమ్మానము, రాజాజ్ఞ): చూ, లగ్నకాల కర్తవ్యములు

దశమాంశ అం. షోడశవర్గములో నొకటి (లగ్నమును పది సమభాగములు చేయుటకే దశమాంశయని పేరు. దశమాంశ కనుఁగొనవలసిన గ్రహమేరాసి యందెన్నవభాగమునందున్నదో తెలుసుకొనవలెను గ్రహమోజరాశియందున్న యెడల నారాసి మొదలుగను, యుగ్మరాశియందున్నయెడల నారాసికి 9 వరాసి మొదలుగను బయినఁజెప్పిన రీతిని గ్రహమెన్నవభాగమందున్నదని కనుఁగొనఁబడెనో యన్నవరాసి దశమాంశయనఁబడును ఆరాశ్యధిపతియే దశమాంశాధిపతి యగును) చూ, షోడశవర్గ

దశమి సం వి ఈ స్త్రీ. 1 పక్షమునందు పదియవతిథి. "విజయదశమి" చూ, తిథి. (చూ, తిథులు), విణ. స 2. మిక్కిలివృద్ధుఁడు చూ,వృద్ధుఁడు 1; విణ 3 పదియవది.

దశమిస్థుఁడు. సం. విణ. 1. నష్టవీర్యుఁడు; 2. ముదుసలి: చూ, వృద్ధుఁడు. 1.

దశము. అం చూ, సంఖ్యాభేదములు.

దశరంధ్రములు. అం (2 ముక్కు, 2 కన్ను, 2 చెవి, 2 మూత్ర-మలద్వార, వాక్కు, బ్రహ్మరంధ్రములు; స్త్రీలకు స్తనరంధ్రములు 2, గర్భమార్గమునందొకటి అధికముగ గలవు)

దశరథుఁడు. సం. వి. అ. పుం. సూర్యవంశపురాజు (పలుదిక్కులను రథములుగలవాఁడు): చూ, రాజు. 1.

దశరూపకములలక్షణములు. అం 1 నాటకము, 2 ప్రకరణము, 3 భాణము, 4 ప్రహసనము, 5 డిమము, 6 వ్యాయోగము, 7 సమవాకారము, 8 అంకము, 9 వీధి, 10 ఈహామృగము, (10) (వీనిలక్షణము లాయాపదముల కడ వివరింపఁబడియె). చూ, రూపకములు.

దశరూపస్మృత్తు సం వి. ప్. పుం విష్ణుఁడు. చూ, విష్ణువు 1

దశరూపము అం. ఈగ్రంథమును ధనంజయుఁడు వ్రాసెను. చూ, కావ్యనాటకములు.

దశలక్ష. అం. చూ, సంఖ్యాభేదములు

దశలు అం. 1 బాల్య, యౌవన, కౌమారములు మఱియు వార్ధక్యము చూ, అవస్థలు, 2 రవి, చంద్రి, అంగారక, బుధ, బృహస్పతి, శు, శని, రా, కేతు దశలు (9)

దశవిధకావ్యగుణములు అం. శ్లేషాది చూ, కావ్యగుణములు.

దశవిధగమకములు అం ఆరోహణము, అవరోహణము, ఢాలు, స్ఫురితము, కంపితము, ఆహతము, ప్రత్యాహతము, త్రిప్రుళ్చము, ఆందోళము, మూర్ఛన (10) (చూ, 15 గమకములు.)

దశవిధధాతువులు అం' చూ, ధాతువులు.

దశవిధనాడులు. అం' చూ, నాడులు.

దశవిధనాదములు. అం: చూ, నాదములు.

దశవిధనియమములు. అం. చూ, నియమములు.

దశవిధప్రళయములు. అం చూ, ప్రళయములు

దశవిధప్రాశపురి. అం. చూ, పురులు.

దశవిధబ్రాహ్మణులు. అం. "దేవో మునిర్ద్విజో రాజా వైశ్యశూద్రి బిడాలకః। పశుమ్లేచ్ఛశ్చఛండాలో దశవిప్రాః ప్రకీర్తితాః॥ (ద్రావిడ గౌడాది భేదములచే వలరుచుండు బ్రాహ్మణ శాఖలవారియందుగలగుణధర్మాదులననుసరించి దేవ, ముని, ద్విజ, క్షత్రియ, వైశ్య, శూద్ర, బిడాలక, పశు, మ్లేచ్ఛ, ఛండాలురను భేదముగలవారగుచుండిరని స్మృతికర్తలు నిర్ణయించిరి చూ, బ్రాహ్మణులు.

దశవిధమన్మథావస్థలు. అం. చూ, దశావస్థలు

దశవిధశాస్త్రలక్షణములు అం చూ, శాస్త్రలక్షణములు

దశవిధసద్గుణములు అం చూ, సద్గుణములు.

దశశీర్షము అం' చూ, శస్త్రములు.

దశసహస్రము అం. చూ, సంఖ్యాభేదములు.

దశాంగధూపము అం తేనె, మంచిగంధపుగల ముస్తలు, మంచినెయ్యి, గంధకము, మహిషాక్షిగుగ్గిలము, అగరుచెక్క, జాతిపువ్వు, సరళదేవదారుబంక, శిలారసపుజిగురు, ఆవాలు (10) వీనిని చూర్ణించి ధూపమువేసిన పసిపిల్లల వ్యాధులును, భూతబాధలును హరించును)

దశాంశమానము. పా ఒకానొక మానము

దశాక్షి. సం. వి. న్. పుం. దిగ్నే చూ, స్నేహాశము [చూ, శస్త్రములు.

దశాక్షము అం. శస్త్రములు 47 లో నొకటి

దశానామేకాదశన్యాయము పా. ఏదియో కొంతమట్టుకు ఖర్చుచేయవలసి వచ్చినపుడు ఇంకొకకొంచెము సహింపవలెను. పదిలో పదునొకండు అనురీతి. [పరిమాణాదులు.

దశాప్రమాణములు. పా చూ, గ్రహముల దశా

దశార్హుఁడు. సం వి. అ. పుం చూ, బుద్ధుఁడు.1.

దశాలి సం. వి. ఈ స్త్రీ కంచెకోట చూ, ప్రాచీనము. 1.

దశావతారములు. అం చూ, అవతారములు

దశావతారుఁడు. సం. వి. అ. పుం విష్ణుఁడు. చూ, విష్ణువు 1.

దశావస్థలు. అం. చక్షుప్రీతి(చూచుట), మనస్సంగము (తలఁచుట), సంకల్పము (కోరిక), జాగరము, కార్శ్యము (అరుచి), అగతి (చిక్కుట), అలజ్జ (సిగ్గువిడుచుట), ఉన్మా

దము (అఱచేట), మూర్ఛ, మరణోద్యమము (చేష్టేట) (10)· చూ, అవస్థలు. (చూ, కామము 8)

దశాహము సం వి అ పుం మృతి పొందినవానికిఁ బదియవనాఁడుఁ జేయు శ్రాద్ధము చూ, శ్రాద్ధము [ఇంద్రియములు

దశేంద్రియములు అం దేహేంద్రి — చూ,

దశోపనిషత్తులు. అం చూ, ఉపనిషత్తులు (చూ, తైత్తిరీయ బ్రాహ్మణము)

దష్టము సం విశే. కఱవఁబడినది [ములు

దసరా ప్రై వి —దశరాత్రి దేవీనవరాత్రి

దసిలీ దే వి 1 ఒకరకముపట్టు కళా 2, ఆ 15 చూ, మొగ్గపట్టు (చూ, పట్టు 17), 2 వదలు, పరిత్యాగము చూ, విమోచనము

దసుకంచె దే వి గుర్రపుదౌడులకు కెట్టలను గూర్చువాఁడు. [బాణము 1

దసెన దే వి ఒకానొక ఆయుధము చూ,

దస్కతు వా. వి. చూ, సంతకము

దస్తరము వా వి చూ, రూ-దస్త్రము

దస్తా. వా. వి 1 ఇరువదినాలుగు కాగితములు (తావులు) చూ, పుటపత్రము, 2 ఇరువది నాలుగు బాణములకట్ట చూ, బాణము. 1

దస్తావేజు వా వి వ్రాతపూర్వకమైన సాధనము: చూ, పత్రము.

దస్తు వా వి. 1 పోగుచేసినసొమ్ము: చూ, కర్తము 1, 2 వసూలయిన సొమ్ము· చూ, విత్తము. 1, 3 ధనము చూ, విత్తము 1.

దస్తూరీ వా. వి 1 చేవ్రాత· చూ, వ్రాలు; 2. ఇతరులవ్రాఁత. చూ, వ్రాలు; 3 చేవ్రాలు చూ, సంతకము.

దస్యుఁడు సం వి అ పుం 1 పగతుఁడు చూ, శత్రువు 1, 2 దొంగ చూ, ముచ్చు. 1

దస్రులు. అం. అశ్వినీదేవతలు (రోగములను తొలఁగింపఁజేయువారు) చూ, అశ్వులు.

దస్త్రము. వా. వి: చూ, రూ-దస్తరము.

దహనము. సం. వి అ న. 1. కాల్చుట· ఓషము; పుం. 2 చిత్రమూలము * చూ, వహ్ని సంజ్ఞికము, 3 లేడి* చూ, భల్లాతకి.

దహనసంస్కారము పా చూ, అగ్నిసంస్కారము

దహనుఁడు సం. వి. అ పుం. 1 అగ్ని చూ, వహ్ని 1, విశే 2 దుష్టుఁడు చూ, వ్యాఘ్రుఁడు 2 [లుఁగు 5

దహించే సం స. క్రి కాల్చు: చూ, కా

దళకొను దే అ క్రి రూ-దళముకొను, దళగించే, అధికమగు చూ, హెచ్చు 3

దళగించే దే. అ క్రి —ప్రై—

దళనము సం వి అ న 1. ఖండించుట చూ, హతి, 2. చీల్చుట, భేదించుట చూ, విదారణము 1

దళము. సం వి అ. న 1 ఆకు చూ, పర్ణము 1, 2 దండు-దళా దండు చూ, సేన. (తెనుఁగు అని కొందఱు); 3 చూ, పాటిదళము; 4 భాగ్యము, అదృష్టము: చూ, సంపత్తి; దే. వి (1) ఆధిక్యము చూ, హెచ్చు 2, విశే. (2) అధికము. స్వా 5, ఆ. 51: చూ, హెచ్చు. 1; (3) తఱచే, ఒత్తడము. చూ, మొత్తము; (4) దట్టము· చూ, సాంద్రము. 2

దళముకొను దే. అ. క్రి. 1. చూ, రూ-దళకొను; ప్రే. 2. దళముకొలుపు.

దళవరి దే. వి (దళము + వరి) 1. ఒకరకము వడ్లు: చూ, ధాన్యము, ప్రై. వి. 2 =దళవాహి. సేనాధిపతి· చూ, సైనికుఁడు.

దళవాయి ప్రై. వి 1.=దళవాహి. (రూ-దళ్వాయి-దళవరి)· చూ, సైనికుఁడు; 2. రూ-దళ్వాయి. సుంకరిసహాయుఁడైన యుద్యోగస్థుఁడు.

**దళవాహి.** సం. వి ఇ. పుం.=దళవాయి–దళపతి చూ, సైనికుఁడు. [జాతి.

**దళసంచే** దే. వి (దళము + సంచే) దళము

**దళసరి** స్వ. వి. (దళము + సరి) 1 ఘనత చూ, సాంద్రము. 2; విశే. 2 తలచే చూ, దళము (3), 4 మందము, జోగు చూ, విలంబనము 1; వా 5 మాటము, (పాడవు వెడల్పు ఎత్తు అను మూఁడింటిలో గొలతి) "ఆ కమ్మి ఆకుగున్న ఒక్క కలదు", 6. చిక్కన. "ఆకాగితము దళసరి"

**దళసూచి** సం వి ఈ. స్త్రీ ముల్లు చూ, సితాగ్రము, [విశేచని*

**దళస్నుహి.** సం వి ఈ స్త్రీ· చూ, సుఖ

**దళించే** సం. స క్రి 1 ఖండించే చూ, సెలగు; 2 నిర్భేదించే చూ, భేదించే

**దళితము** సం విశే 1 భేదింపఁబడినది. (ఖండింపఁబడినది (అనియు) చూ, విచ్ఛిన్నము. 3, 2 వికసించినది చూ, హసితము 1

**దళుఁపు** దే. వి. భయము· చూ, వెఱపు.

**దళ్వాయి** వై. వి =దళవాహి: చూ, రూ–దళవాయి

# దా

**దా.** దే. విశే. 1. రూ–డా· చూ, సవ్యము. 1; వా. అవ్య. 2. రా, రమ్ము (ఉత్తరసర్కారులలోవాడుక)

**దాంతి.** సం. వి. ఈ. స్త్రీ· చూ, రూ–దమము. 3.

**దాంతుఁడు.** సం. విశే. రూ–దమితుఁడు. 1. గురు శిక్షితుఁడు: చూ, శిష్యుఁడు; 2. అడపఁబడినవాఁడు; 3. తపఃక్లేశము నోర్చువాఁడు.

**దాంపత్యము.** సం. వి. అ. న. ఆలుమగలభావము.

**దాంభికుఁడు.** సం. విశే.=దాంబికుఁడు: చూ, ప్రాతిహారకుఁడు.

**దాఁక** దే దక్రి: చూ, రూ–దనుక.

**దాఁకొను.** దే. అ క్రి. (దాఁగు + కొను)· చూ, మఱుఁగుపడు.

**దాఁగనముగ్గిచ్చేలు** దే వి బ చూ, రూ–డాఁగనముగ్గిచ్చేలు చూ, సజ్జె).

**దాఁగరి** దే వి. పరిసేవకము· చూ, స్యోనము

**దాఁగినవాఁడు.** దే. విశే: చూ, డ 11

**దాఁగిలిమూఁతలు.** దే. వి. బ: చూ, రూ–డాఁగనముగ్గిచ్చేలు.

**దాఁగిలిముగ్గిచ్చేలు** దే. వి. బ —పై—

**దాఁగు** దే అ క్రి చూ, రూ–డాఁగు.

**దాఁగుకొను** దే అ క్రి —పై—

**దాఁగురించే** దే. స. క్రి 1 గాఁచే చూ, మఱుఁగు, 2. చూ, వంచించే

**దాఁగురింత** దే వి దాఁగురించుట

**దాఁగురింతలు** దే. వి బ· చూ, రూ–డాఁగనముగ్గిచ్చేలు.

**దాఁగురుమూఁతలు** దే వి బ —పై—

**దాఁచియుంచే** వా అ క్రి: ఇల్లడయిడు.

**దాఁచే** దే. క్రి చూ, రూ–దాఁగురించే హరిశ్చ. 3, ఆ 20.

**దాఁచేట** వా. వి దాఁపఱికము, దాఁపుడు, దాఁపురము, బందు. (సం. వ).—ఉపగూహనము, గుప్తి, గూహనము, గోపనము. (చూ, బందు)

**దాఁటడుగుపరువడి** అం. చూ, విసరులు.

**దాఁటడుగుమొన.** అం 1.—పై.—; 2. మొనలు 12 లో నొకటి· చూ, మొనలు.

**దాఁటరి.** దే. వి. కప్ప చూ, మండూకము. 1,

**దాఁటించేవాఁడు.** వా. విశే: చూ, ఉత్తారకుఁడు

**దాఁటు** వై. వి. 1. వర్గము· చూ, సమూహము; ద్వ. వి. 2. ప్లుతగతిభేదము: చూ, హయము; దే. వి. 3. లంఘనము: చూ, లంఘు; వై. వి. 4.=ధాటీ. దండయాత్ర:

చూ, యుద్ధము, 5.=ఘాటీ దండు: చూ, సేన 1, వా. 6 తప్పించుకొనిపోవుట; అ క్రి. 7 చూ, లంఘించు; స క్రి 8 చూ, తరించు, 9 అంగవించు, అడుగు పోఁటు, అతిక్రమించు, అవఘళించు, ఒత్తరించు, కడచు, గుపించు, జేవదాఁటు, తప్పు, తలఁగు, తలఁకడచు, తుటారించు, మీఱు, మేర మీఱు, వాలు (సం. ప) — అంతరించు, అతిక్రమించు, ఉల్లంఘించు, క్రమించు (చూ, వాలు 12)

దాఁటుకట్టు. గ్వ. అ క్రి. గుంపుగూడు చూ, సంతనకట్టు 1.

దాఁటుకొను దే అ. క్రి చూ, లంఘించు

దాఁటుట వా వి చూ, లంఘు

దాఁటుడువల దే వి ఒకానొకవల. చూ, వల.1.

దాఁటుపరువడి అం చూ, పరుపల్లు.

దాఁటులు. వా వి బ. పేరెములు చూ, లంఘు.

దాఁపన దే. వి దాఁచేట.

దాఁపరము దే వి రూ-దాపరము. దొంగిలించేట చూ, ముచ్చిలి

దాఁపరించు దే స. క్రి 1. దొంగిలించు చూ, ముచ్చిలించు, వా. 2 తగులుకొను, పంబడించు (వీఁడు నాకు దాఁపరించినాఁడు)

దాఁపరీఁడు దే. వి. (దాఁపరము+ఈఁడు) దొంగ: చూ, ముచ్చు. 1.

దాఁపటీకము దే వి. (దాఁపన+టీకము) చూ, దాఁచేట.

దాఁపు దే క్రి చూ, రూ-దాఁచు.

దాఁపుడు దే వి చూ, దాఁచేట.

దాఁపురము. దే. వి 1.—పై— కళా. 6, ఆ 255; 2 దాఁచినసొమ్ము సా. 2, ఆ. 185. చూ, విత్తము. 1.

దాక. వై వి. 1.=ద్రాక్ష*: చూ, స్వాదుఫల; దే. వి 2. భోగిణి: చూ, పాత్రము. 6; 3 వెడల్పునోరుగలఅటిక: చూ, పాత్రము.6.

దాకలి దే. వి. (దాయి+కలు): చూ, రూ-డాకలి.

దాకల్లు. దే వి (దాపు+కల్లు) 1.—పై—; 2 బండికంటి కడకమ్మి కమ్మి (సం. ప) నేమి [చూ, సమీపించు

దాకొను దే. అ. క్రి (దాఁపు+కొను):

దాక్షాయణి సం వి. ఈ స్త్రీ. 1 గౌరి: చూ, పార్వతి. 1; 2. రోహిణీనక్షత్రము: చూ, నక్షత్రము 1; 3 అశ్విన్యాదినక్షత్రములు. చూ, నక్షత్రము 1; 4 నేల: చూ, భూమి. 1

దాక్షాయ్యము. సం. వి అ పుం. గ్రద్ద, బోరువ చూ, హరివాహనుఁడు (సంపాతి తమ్ముఁడు.—అరుణాత్మజుఁడు, జటాయువు, జరాయువు (చూ, హరివాహనుఁడు)

దాక్షిణాత్య. అం 1 చూ, పంచమజభాషలు. (చూ, భాష. 1); 2 చూ, భిన్నషడ్జకజభాషలు. (చూ, భాష. 1)

దాక్షిణేయుఁడు. సం. విశ. చూ, రూ-దక్షిణ్యుఁడు. [టము.

దాక్షిణ్యము. సం. వి. అ వ: చూ, మొగమాటము.

దాక్షిణ్యుఁడు. సం. విశ: చూ, రూ-దక్షిణ్యుఁడు.

దాగలి దే వి: చూ, రూ-డాకలి.

దాచిని. వా. వి: చూ, రూ-దాల్చిని.

దాజపండాబ్రాహ్మణులు. పా సామవేదులు. చండప్రచండులను నామాంతరముసయితముకలదు వీరు గోభిల, ద్రాహ్యాయణ సూత్రములకుఁజెందినవారు. కొంతతీపుడు కృష్ణయజుర్వేదము నవలంబించుచున్నారు చూ, ఉత్కలులు (చూ, బ్రాహ్మణులు)

దాటాయి. వై. వి: చూ, బాలక్రీడ

ధాడి. వై. వి. 1.=ధాటీ. దండయాత్ర: చూ, యుద్ధము; 2.=ధాటీ. దండు: చూ, సేన. 1; 3 గడ్డము: చూ, శ్మశ్రువు.

దాడింబ. నై. వి.=దాడిమః (రూ-దాడిమ్మ-దాడిమ్మ-దానిమ్మ-దాళింబ - దాళిమ్మ)* చూ, రక్తబీజము. [లక్ష్మి 2,ఆ 60

దాడికాఁడు నై వి చూ, వేగులవాఁడు

దాడిచేయు. నై. అ క్రి చూ, దండెత్తు

దాడినిమ్మ నై. వి = చూ, రూ.దాడింబ

దాడిమపుష్పకము. సం. వి అ పుం. రోహి, రోహితకము* చూ, ములుమోదుగు

దాడిమము సం వి. అ పుం. 1 =దాడింబ* చూ, దాడింబ; 2 ఏలకి* చూ, పత్రిల

దాడిమి సం వి ఇ పుం= చూ,దాడింబ*.

దాడిమ్మ. నై వి.=దాడిమ.—పై —

దాడియాడు ద్వ. స క్రి మార్కొను. చూ, పరిఘటించు

దాఢ. సం. వి. ఆ స్త్రీ =1.దౌడ కోఱపల్లు చూ,పల్లు 1; 2. గుంపు చూ, సమూహము

దాణ నై. వి.=ఖాదన. ఎద్దుగుఱ్ఱములులోనగు వాని యొకరకముతిండి. కాణము, ఖాణము. (సం ప )—ఖాదనము

దాణము దే వి. శుల్కము చూ, సుంకము 1.

దాణుధోఁడ. అం. విసరులు 15 లో నొకటి చూ, విసరులు. [చూ, వదాన్యుఁడు

దాత. సం. విణ (ఋ ఈ ఋ.)ఇచ్చువాఁడు,

దాతము సం. విణ. దితము, నఱకఁబడినది చూ, వృక్ణము. [చూ, పట్టెడ. 6.

దాతికత్తి. దే. వి. (దాయి + కత్తి) దాదుంగ

దాత్యూహము. సం వి. అ పుం. 1: కర్కరాంకము, కాలకంఠకము-రూ-కాలకంఠము, కాకమద్గువు, జలరంకము, జలరంజి (తె. ప).—కూఁకటిగుడ్డంగి- రూ-కూకురుగుండఁగి-కూకురుగుండె; 2: చూ, వానకోయిల. [పవిత్రము.

దాత్రము సం. వి. అ. న. కొడవలి: చూ,

దాదాఁపు. దే. వి. (దాఁపు + దాఁపు) మిక్కిలి సమీపము: చూ, సమీపము. 1.

దాది నై. వి.=ధాత్రి రూ-దాదిలి (సం. వ.) అంకపాళి,ఉపమాత,ధాత్రి (చూ, మాత.1 )

దాదిలి. నై. వి =—పై— [దాతికత్తి.

దాదుంగ. దే వి (దాయి + దుంగ): చూ,

దానపంచకము అం. సంప్రాప్తము,ఉత్సర్గము, సంప్రాప్తధనోత్సర్గము, స్వయంగ్రాహము, అతి మోక్షము (5) [చేయు 2.

దానమిచ్చు మి. స క్రి. ఇచ్చు చూ, దయ

దానము సం వి అ న 1. ఈవి చూ, వితరణము; 2 ఏనుఁగుకపోలమునీరు: చూ, మదములు (చూ, హస్తి); 3 పాలనము చూ, రక్షణము; 4 ఛేదనము: చూ, వర్ధనము 2; 5 శుద్ధి చూ, శోధనము 1, అం 6 చతురుపాయములలో నొకటి (ఇది ఐదువిధములు.— తనకుఁగల ధనమంతయు నిచ్చుట, ఎక్కడనేని ధనముతీసుకొన్నచో దానికిఁ దానను‌కూలుఁడై యుండుట, అపూర్వవస్తువులనిచ్చుట, ఒకని ధనముఁబుచ్చుకొనఁబ్రవర్తింపఁజేయుట, అప్పు తీర్చుట) చూ, ఉపాయములు; 7 ఉపాయములు 7 లో నొకటి: చూ, ఉపాయములు, 8 నాయకుఁడు నాయికయొక్క కోపమునుపోఁగొట్టునపుడు ఉపయోగించెడు ఉపాయములు 6 లో నొకటి చూ, ఉపాయములు; 9 చూ, రాజ ముఖ్యగుణములు; 10. ధనగతి త్రయమునం దొకటి. చూ, ధనగతిత్రయము (చూ, త్రయము); పా. 11. దీనికి ఉపమానములు.—బలి, కర్ణుఁడు, దధీచి, శిబి, మేఘము, కల్పవృక్షము, కామధేనువు, చింతామణి. [నొకటి: చూ, నియమములు

దానముచేయుట. అం నియమములు 10 లో

దానములు. అం. 1. దశదానములు.— గోదానము, భూదానము, తిలదానము, హిరణ్యదానము, ఆజ్యదానము, వస్త్రదానము,

ధాన్యదానము, గుడదానము, రౌప్యదానము, లవణదానము, 2 షోడశమహాదానములు.—గోదానము, భూదానము, తిలదానము, హిరణ్యదానము, రత్నదానము, విద్యాదానము, కన్యాదానము, దాసీదానము, శయ్యాదానము, గృహదానము, అగ్రహారదానము, రథదానము, గజదానము, అశ్వదానము, ఛాగదానము, మహిషిదానము; మరియొకవిధము.—తులాపురుషము, హిరణ్యగర్భము, బ్రహ్మాండము, స్వర్ణము, పంచలాంగలము, స్వర్ణధేనువు, భూగోళము, కనకపర్వతము, కామధేనువు, కల్పవృక్షము, రజితపర్వతము, సహస్రధేనువు, సాలంకృత హేమవృషభము, సాలంకృత లక్ష్మీప్రతిమ, సాలంకృత సప్తాచలము, సప్తసముద్రము, గజము, సర్గచ్ఛాయ. (18)3. చూ, దానము 6, 8, 9, 10)

దానవారి సం. వి ఇ పుం దేవుఁడు చూ, వేలుపు. |చూ, రాక్షసుఁడు. 1

దానవుఁడు. సం. వి అ పుం. రక్కసుఁడు

దానవులు. అం కశ్యపునకు దనువునందుగల్గిన సంతతి. వీరునూఱుమంది ద్విమూర్ధుఁడు, శంకుకర్ణుఁడు, హయశిరుఁడు, అయోముఖుఁడు, శంబరుఁడు, కపిలుఁడు, వామనుఁడు, మారీచి, మఘవంతుఁడు, ఇల్వలుఁడు, సృమరుఁడు, వికోభనుఁడు, కేతువు, కేతువీర్యుఁడు, శతహ్రదుఁడు, మహాబలుఁడను తారకుఁడు, వైశ్వానరుఁడు, పులోముఁడు, విద్రావణమహాశిరుఁడు, స్వర్భానువు, వృషపర్వుఁడు, విప్రచిత్తి ఇత్యాది. స్వర్భానువునకుఁ బ్రభయు, పులోమునకు శచియు, హయశిరునకుపదానవియు, వృషపర్వునకు శర్మిష్ఠయుఁ బుత్రికలు. పులోమ, కాలకలు వైశ్వానరునకుఁ బుత్రిక లై మారీచునకు భార్య లైరి. పులోమయందుఁ గల్గినవారు పౌలోములు (60000) కాలకయందలి సంతానము కాలకేయులు (1400) హిరణ్యపుర నివాసులు శతహ్రదునకు మూషకుఁడు, హుండుఁడు కల్గిరి సుందునివలనఁ దాటకి యందు మారీచుఁడు పుట్టెను. సంహ్రాదునకు గొప్ప దపః ఫలముగు నివాతకవచులనఁ బడు మూడుకోట్లమంది పుట్టిరి. వీరు మణిమతీపుర నివాసులు (విద్యార్థికల్పతరువు)

దానశౌండుఁడు సం విశే. మిక్కిలియీవికాఁడు చూ, వదాన్యుఁడు

దానహీనుఁడగురాజు అం అపరికాశములు 9 లో నొకటి చూ, అపరికాశములు.

దానింబ. వై వి =దాడిమః* చూ, రూ-దాడింబ (దీని వేరు చెక్క కషాయము సేవించిన పేగులలోనుండెడు పొడుగైనపాములు పడిపోవును లేఁతకాయ అతి సారాదులకు మంచిది )

దానిమ్మ వై వి =—పై—

దాపనము. సం. వి. అ. న దండుగగొనుట

దాపరము. దే. వి చూ, రూ-డాపురము

దాపరించు దే. అ క్రి చూ, సిద్ధించు

దాపల. దే. వి. రూ-డాపల చూ, సవ్యము 1.

దాపలించు దే అ క్రి రూ-డాపలించు. 1. చుట్టినచ్చె. భాగ. శల్య. 2, ఆ 267: చూ, వలగొను; 2. చుట్టుకొను· చూ, వేష్టించు

దాపించు దే. అ క్రి చూ, సమీపించు.

దాపితుఁడు. సం విశే. రూ-దాయితుఁడు: చూ, సాధితుఁడు.

దాపు. దే. వి. 1 భయము: చూ, వెఱపు; 2. దగ్గఱ. చూ, సమీపము. 1; స. క్రి. 3. చెక్కు: చూ, వాఱు. 1.

దాపురము దే. అ. క్రి. చూ, సిద్ధించు.

దాపురము. దే వి: చూ, రూ-డాపురము.

దావ్యము. సం. విణ. దంతుగఁగొనఁదగినది.

దాబ. వా. వి. ఒకానొకపిట్ట చూ, పక్షి.

దామని. సం వి. ఈ. (స్త్రీ) =దామెన చూ, సూత్రము. 1

దామము. సం. వి. న్. పుం, న. 1. తలుగు చూ, సూత్రము. 1; 2. హారము: చూ, భూషణము. 2

దామర. దే. వి. 1. ఉరితాడు. వసు. 4, ఆ 132 చూ, సూత్రము. 1; 2. చూ, రూ-దామెర.

దామెన వై వి.=దామనీ. పెక్కు తలుగులుగల నిడివితాడు చూ, సూత్రము 1

దామెర. దే. వి. రూ-పలుదామెర. మండలాకారకుష్ఠవ్యాధి చూ, మండలము 3.

దామోదరాయనమః. అం. శమదమాది షట్కసంపత్తివలనసంస్కరింపఁబడిన శుద్ధమనస్సుచేఁ బొందఁదగిన వస్తువుకొఱకు నమస్కారము చూ, ఓమ్.

దామోదరుఁడు. సం. వి. అ. పుం. వెన్నుఁడు. (తులసిమాలిక యుదరమందు గలవాఁడు): చూ, విష్ణువు. 1

దాయ. వై వి.=దాయాదః. 1. సగోత్రుఁడు: చూ, సంగధుఁడు. 2. పగతుఁడు: చూ, శత్రువు.

దాయఁగట్టు. దే. స. క్రి: చూ, ఉట్టుకట్టు.

దాయము. సం. వి. అ. పుం. 1. పంచుకొనఁదగిన తండ్రిసొత్తు. చూ, విత్తము. 1; 2. ఈవి: చూ, వితరణము; 3. అరణము: చూ, హరణము; 4. కట్నము: చూ, లంచేము; 5 ఉల్లకుట్టుమాట: చూ, శబ్దము. 2; దే వి. (1) ఆపద: చూ, విపత్తు, (2) పాచికలు గవ్వలు మొదలైనవాని యందలి పంతెము: చూ, వ్యవహారము. 4; (3) గవ్వలాట: చూ, వ్యవహారము. 4.

దాయాదుఁడు. సం. వి అ. పుం.=దాయ. 1. జ్ఞాతి చూ, సగంధుఁడు; 2. కొడుకు: చూ, పుత్రుఁడు. 1

దాయి. సం. విణ. (న్. ఈ న్) 1. ఇచ్చేవాఁడు: చూ, వదాన్యుఁడు; దే. వి. (1) చూ, దాకలి; వై వి (2) =ధాత్రి చూ, రూ-దాది;వా. క్రి. (3) దాఁచే.

దాయు. దే. అ. క్రి చూ, రూ-డాయు.

దార సం. వి అ. పుం. బ. 1. అగ్నిసాక్షిగా వివాహమాడిన పెండ్లాము: చూ, భార్య; వై. వి.=ధారా. (1) త్యాగము చూ, వితరణము; (2) కత్తియంచు. చూ, వాదర; (3) చూ, నీటిచాలు. పా. 4, ఆ. 16, దే. వి. (4) క్రమము: చూ, విధము. 1

దారకర్మ. సం వి. న్. న చూ, వివాహము.

దారకుఁడు. సం. వి. అ. పుం 1. బాలకుఁడు: చూ, శిశువు, 2. కృష్ణునిసారథి. చూ, సారథి; విణ. 3 చీల్చువాఁడు: చూ, విదారకుఁడు. [వెల. 1.

దారణ. వై. వి.=ధారణ క్రియము చూ,

దారణము. సం. వి. అ. న. చీల్చుట. చూ, రూ-విదారణము.

దారదము. సం. వి. అ. పుం. 1. స్థావర, విషభేదము: చూ, హాలాహలము; 2. పాదరసము చూ, సూతము; 3. ఇంగువ: చూ, హింగువు; 4 కడలి. చూ, సముద్రము; 5. రూ-దరదము: చూ, హింగుళము.

దారపదము. పా: చూ, ఆరూఢము.

దారబంధము వై వి.=ద్వారబంధః. రూ-దోరము. దువారము: చూ, వాకిలి.

దారము. దే. వి. 1 చౌర్యము చూ, కుచ్చిళ్ళ; 2. నూలితాడు: చూ, సూత్రము.1.

దారముగట్టుట. జా. నాదివాదసిన వానింగూర్చి నీవేదారముఁగట్టితివాయనుట (నీవేపుపైకట్టి

తివాయచుట (పుస్తె=దారముతోఁగూడినది, మంగళసూత్రము; స్వాధీనము చేసికొనుట, మంగళసూత్రముగట్టుట. "ఏవారును మనము దారముగట్టితిమని మీఁదిచూపు చూపరాదు" (భర్మజరాజనీయము)
దారి దే. వి. 1. త్రోవ. చేయుప చూ, మార్గము 1, 2. ధార. రూ-దారిక త్రియంచే చూ, వాదా, 3 =వారి ధరించేవాఁడు; 4 రూ-దారి చూ, సూత్రధారుఁడు, వా 5 గతి, దిక్కు "నాకేమిదారి."
దారించే సం స క్రి. చీల్చు చూ, విదారించే
దారితము సం విశ విదారితము, చీల్పఁబడినది: చూ, విచ్ఛిన్నము 3
దారిదారి వా విశ చూ, దారి 4 [యుగ్మిచ్చే 1
దారిదొంగ. వా వి ఎడతోత్రవకాఁచరి చూ,
దారిద్ర్యము సం వి అ న చూ, బీదతనము
దారిపన్ను. వా వి చూ, సిస్తు 1.
దారితేమి వా. వి అధ్వానము, అమార్గము, నిర్జనత్వము. [పురుగు
దారుకీటము సం. వి అ పుం ఘుణము చూ,
దారుణము. సం. వి. అ. పుం 1 భయానకరసము. చూ, రసములు; విశ 2. భయంకరము చూ, రసములు, వా 3 చెప్పనలవికానిది, 4 ఊహింప తరముకానిది, 5 వ్రాయనలవికానిది.
దారున దే క్రి. క్రి విశ. తటాలున. కళా. 3, ఆ. 67: చూ, వేగము. 3
దారుపురుషన్యాయము. పా కట్టెమొద్దునుజూచి మనుష్యుఁడని భ్రమపడినరీతి.
దారువు సం వి. ఉ.న. 1. కొయ్య: చూ, వంటచెఱకు; 2 దేవదారువు*: చూ, సురాకృదారువు, 3. ఇత్తడి: చూ, లోహము. 1.
దారుహరిద్ర. సం. వి. ఆ. (స్త్రీ): చూ, మ్రానిపసుపు. [డువు 1
దారుహస్తకము. సం. వి అ. పుం: చూ, తెఁ

దారేషణము. అం ఇషణక్రియమందొకటి చూ, ఇషణము. (చూ, క్రియము)
దారోగా వా. వి పై యధికారి [ర్త్రి 1
దార్ఢ్యము. సం వి అ న దిటవు చూ,
దార్వాఘాతము సం వి అ పుం. వడ్లంగిపిట్ట. చూ, శతపత్రికము 4
దార్వి సం వి ఈ. (స్త్రీ) 1 చూ, మ్రానిపసుపు*; 2 చూ, బెండ *; 3. అడవికంద* చూ, సూరణము
దార్వీక. సం. వి. ఆ. (స్త్రీ) 1 చూ, బెండ*; 2. మ్రానిపసుపున పండిన అంజన విశేషము చూ, రసాంజనము.
దాలి దే. వి పాలుకాఁచుటలోనగువానికి పేర్చిన పడకలపొగ్రు (గుంట) "పాలదాలి"
దాలిగుంట. దే వి పాలుమొదలగునవికాఁచు గుంట, తంపి చూ, రంధ్రము. 1 "కుక్క దాలిగుంటసామ్యము"
దాల్చిని. వా. వి రూ-దాచిని సుగంధద్రవ్యములలో నొకటి: చూ, రాజావ్రగము.
దావంతము దే. వి దుఃఖము చూ, శోకము
దావము సం. వి. అ. పుం 1. అడవి చూ, విపినము; 2. కాఱుచిచ్చు: చూ, వహ్ని.1.
దావరడంగి. దే. వి. చూ, రూ- డావరడంగి.
దావరము. దే. వి: చూ, రూ-దాఁపరము.
దావరి. దే. విశ. రూ-దావరీఁడు. వీరుఁడు. చూ, శూరుఁడు
దావరీఁడు. దే. విశ. (దావరి + ఈఁడు)-పై-
దావా. దే. వి. 1. చౌర్యము: చూ, ముచ్చిలి; వా. వి. 2. వ్యాజ్యము.
దావికము. సం. విశ. రూ-దేవిక. దేవికయను. నది: చూ, నది [చూ, తృణము. 1.
దాశపురము. సం వి. అ. న. కయివడిముస్తె*:
దాశార్హుఁడు. సం. వి. అ. పుం. వెన్నుఁడు: చూ, విష్ణువు. 1.

దాశేరకము. సం. వి. అ. పుం. ఒకానొక దేశము. చూ, దేశము

దాసనము దే వి జప* చూ, హయజీవన మారకము. (దోహదశాస్త్రరీత్యా—అశోకము, కల్లు, రేఁగుపండ్లు, మాంసము మొదట చేసిన విశేషముగా ఫలించును). చూ, దోహద శాస్త్రము. [దాశపురము*.

దాసపూరము సం. వి. అ. న: చూ, రూ-

దాసరయ్య వై. వి తాఁబేలు· చూ, వృత్తము.4

దాసరి. వై. వి.=దాస, దాసేర. రూ-దాహారి విష్ణుసేవకుఁడైన శూద్రుఁడు చూ, సాతాని

దాసరికొయ్య. ద్వ. వి. ఒకానొక చేఁప చూ, మత్స్యము. 1.

దాసరిగాఁడు. ద్వ. వి: చూ, దాసరయ్య.

దాసరిపాము. ద్వ. వి. ఒకానొకపాము: చూ, సర్పము.

దాసి. సం. వి. ఈ. స్త్రీ. 1. పనిచేయుట కేర్పాటైనదాసి, వెలకుఁగొన్న పనికత్తె, ఉంపుడుకత్తె (అనియు): చూ, పరిచారిక; 2. కాకిదొండ*: చూ, రక్తఫల; 3. నల్ల గోరంట*: చూ, మహాసహా; 4. పిన్నవర గోఁగు*: చూ, పీలువు; అం. 5. మహాదానములు 16 లో నొకటి: చూ, దానములు (చూ, మహాదానములు.2.); 6. మహాదానములు 16 లో నొకటి· చూ, దానములు (చూ, మహాదానములు2.); 7 ఐశ్వర్యములు 8 లో నొకటి: చూ, ఐశ్వర్యములు; 8. శృంగార నాయికలు 8 కి సహాయులుగనుండెడు ఎనమండ్రిలో నొకతె: చూ, నాయికలు.

దాసుఁడు. సం. వి. అ. పుం. 1. వెలకుఁగొన్న పనివాఁడు: చూ, సేవకుఁడు; 2 అడుగు పుట్టువు: చూ, శూద్రుఁడు; 3. జ్ఞాని· చూ, విద్వాంసుఁడు; 4. రూ-దాశుఁడు. చేఁపలఁ బట్టుజాలరి: చూ, వలకాఁడు. (ఈయర్థమున నిది శకారోపధముఅగు)

దాసేయి. సం. వి. ఈ. స్త్రీ. శంతనుని పెండ్లాము; చూ, భార్య

దాసేయుఁడు సం వి అ పుం. 1 పనివాఁడు. రూ-దాసేరుఁడు, వ్యవహర్త· చూ, సమర్థుఁడు; విణ 2. రూ-దాసేరుఁడు. దాసికిఁబుట్టినకొడుకు చూ, పుత్రుఁడు 1.

దాసేరుఁడు సం వి అ పుం విణ —పై—.

దాస్యము. సం. వి. అ న 1 సేవనము కొలుచేః చూ, సేవ; అం 2 భక్తిలక్షణములలో నొకటి చూ, భక్తిలక్షణములు

దాహకుఁడు. సం విణ కాల్చువాఁడు

దాహము సం. వి అ పుం 1 కాలుట ఓషము; 2.=దగ దప్పి చూ, పిపాస

దాహారి. వై. వి =దాస చూ, దాసరి.

దాళవా వా. వి చూ, దాసువా.

దాళా దే. వి. 1. పడియొక్కు యుద్ధప తక్షనలు రూ-దాళవా-దాసువా-దాళ్వా; వై. వి. 2 నెయ్యి నూనె మొదలగునవి తీయు పాత్రములనుగాని అవియుంచియున్న పాత్రములనుగాని సరియొత్తుతూలను దడకట్టనుంచి తూఁచుట: డడ, దాళవా-రూ-దాసువా-దాళ్వా.

దాళాలు. అం. బ: చూ, మల్లశాస్త్రము.

దాళి. సం. వి. ఈ. స్త్రీ. పెసగలులోనగువాని పప్పు. [దాడింబ.

దాళింబ. వై. వి.=దాడిమః*: చూ, రూ-

దాళిమ్మ. వై. వి =—పై—

దాళీశుఁడు. దే. వి. కార్యకర్త. వ్యవహర్త: చూ, సమర్థుఁడు.

దాసు దే. వి. వర్ణలేశము. "పసుపుగాసు"

దాసున. వై. వి.=తాలు: చూ, పెలవి.

దాసువా. దే. వి. రూ-దాళవా. దాళ్వా. శర ట్పృతువు మొదలుకొని నీరాసరించు పండెడు

పల్లపుపంట. చూ, పిక్కారు, వా. 2. చూ, రూ-దాళా. 1; 3. చూ, రూ-దాళా 2

గాళ్వా. దే వి —పై.—

## ది

ది ^ అప సంబంధమును తెలుపునది " నాది, నీది, వానిది, వీనిది " మొ దీనికిబహువచనమున వి "నావి, నీవి, వానివి, వీనివి " మొ

దింకలు అం బ చూ, మల్లశాస్త్రము.

గించే దే క్రి చూ, రూ-డించే

దింకెన దే వి. రూ-గింకెన * చూ, విష్ణుకాంత [రూ-దిండీడ.

దింపప. దే వి అడ్డముగానమర్చిన దారువు

దండీప దే వి —పై — [కట్టినవాఁడు

దిండీఁడు. దే విణ (దిండు + ఈఁడు) కాసె

దిండు. దే వి రూ-దిండు. 1. నిడుపాటిగుండ్రపు తలగడ చూ, లోడు; 2 నిడుపాటి గుండ్రపుతలగడ వలె చెక్కఁబడిన మ్రాను చూ, పాపటము; 3. మెఱుఁగుబిళ్లలో నగునవి యంటించెడు తాళ్లపనివాని సానతిరుగుడు కొయ్య; 4. దట్టి చూ, వస్త్రము; 5. అడపట్టె-అడ్డపట్టె, అడ్డమాను.

దిండిం దే వి. మృదంగరవము రూ-దిమిదిమి-దిముకు చూ, స్వరము. 2.

దింపు దే. వి చూ, రూ-డింపు

దింపులుపోవు దే. అ. క్రి. చూ, వ్రేలాడు.

దికామొగము. వై. విణ. రూ-దిక్కుమొగము: చూ, భయద్రుతుఁడు.

దిక్కుమొగము. వై. విణ —పై —విజ. 3, ఆ. 153 [అ. 87.

దిక్కామొగము. వై. విణ.—పై —పా. 5,

దిక్కు. సం వి శ. స్త్రీ. 1 =దిస్స-దెస. రూ-దిశ-దిశ చూ, హరిత్తు; 2. చేరుగడ: చూ, శరణము. వై వి. (1)=దిక్కు (చూ, దిక్కు.1) చూ, హరిత్తు; (2) ఆశ్రయము చూ, ప్రాపు. 2; వా (3) గతి, దారి. " నీవేనాకుదిక్కు "

దిక్కుమాలినతనము వా వి ఏక్కటి, ఎగ్గతము, ఒంటరిపాటు, ఒంటి, ఒంటిపాటు, ఒంటికంటిపోయినను (సం ప) — అసహాయత, అసహాయము, ఏకాంతము, ఏకము, ఏకలము.

దిక్కులు అం 1. తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరము(4),2.తూర్పు, ఆగ్నేయము, దక్షిణము, నైరృతి, పశ్చిమము, వాయవ్యము, ఉత్తరము, ఈశాన్యము (8)

దిక్చక్రము పా భూమ్యాకాశములు కలిసినట్లు కనుపించుగీఁత (హారైజన్)

దిక్చారిణి. సం వి. ఈ. స్త్రీ.=దిచ్చేరి చూ, అంకులాఁడి [పాలుఁడు.

దిక్పాలకుఁడు. సం వి అ. పుం చూ, ఆశా

దిక్పాలకులు. అం. చూ, దిగధిపతులు.

దిక్పాలపట్టణములు. అం. అమరావతి, తేజోవతి, సంయమన, కృష్ణాంగన, శ్రద్ధావతి, గంధవతి, అలక, యశోవతి (8)

దిక్పాలభార్యలు. అం. (దిక్పాలురభార్యలు) శచీదేవి, స్వాహాదేవి, శ్యామలాదేవి, దీర్ఘాదేవి, కాళికాదేవి, అంజనాదేవి, చిత్రరేఖ, పార్వతీదేవి. (8)

దిక్పాలవాహనములు. అం. ఐరావతము, తగరు, మహిషము, నరుఁడు, మొసలి, లేడి, గుఱ్ఱము, వృషభము. (8)

దిక్పాలాయుధములు. అం. వజ్రము, శక్తి, దండము, కుంతము, పాశము, ధ్వజము,ఖడ్గము, త్రిశూలము. (8)

దిక్స్వస్తికము. అం. కరణములు 108 లో నొకటి: చూ, కరణములు.

దిగ. దే. అవ. దిగువశబ్దమునకు వృత్తియందు ఆదేశముగా వచ్చినరూపము. (వృత్తియందు ఇది అర్థవిశేషముల నిచ్చుచున్నది. " దిగఁబోఁత. దిగఁగోఁజో ")

దిగంతము. సం వి అ న. దిక్కులకొన, కకిశోలుకము చూ, హరిత్తు.

దిగంతరము. సం. వి అ న. దిక్కులనడిమిచోటు, కీశము: చూ, హరిత్తు

దిగంబరాంశము అం: చూ, షష్ట్యంశములు

దిగంబరుఁడు. సం. వి. అ. పుం 1 దిసమొలవాఁడు: చూ, శివుఁడు; 2 చూ, భైరవుఁడు, విణ 3· అవాససుఁడు, ఋషి, కాకరూపుఁడు-రూ-కాకలూకుఁడు, కీశుఁడు, గోరంకువు, నగ్నుఁడు. (తె. ప).—అంగమొలవాఁడు, దిసమొలవాఁడు-రూ-దిస్సమొలవాఁడు, బట్టఁగట్టనివాఁడు, ఓత్తరి-ఓత్తరి. (చూ, ఓత్తరి.)

దిగఁగోఁజో. దే. వి కుట్టూపిరి.

దిగఁదీయు. దే. స. క్రి. 1 దృష్టిదోషము మొదలైన వానికి ఉప్పుమిర్చిలోనగువాని చుట్టివేయు: చూ, సురాళించే, వా. 2. క్రిందకులాగు.

దిగఁదుడుచే. దే. స. క్రి.—పై.—

దిగఁదుడుపు. దే. వి: చూ, సురాళము.

దిగఁద్రావు. దే. అ. క్రి. 1: చూ, దిగు. 4,స. క్రి. 2. విడుచే. భార. అర. 7, ఆ. 480: చూ, విసర్జించే. 4.

దిగఁజోఱు. వా. అ. క్రి: చూ, చిలుకు. 11.

దిగఁబోఁత. దే. వి. దిగువకు వ్యాపించేట.

దిగఁబడు. ద్వ. అ క్రి.రూ-డిగఁబడు.1: చూ, దిగు. 4. స్వా. 4, ఆ. 20; 2. అడఁగు-ల క్ష్మీ. 5, ఆ. 52: చూ, మ్రిక్కు. 4; 3.. జోఱు. భార. కర్ణ. 3, ఆ. 66: చూ, నర్లు. 2.

దిగదిగ. జే. వి. వచ్చుట, పోవుట, విసరుట, మెఱయుట లోనగువాని యందగు ననుకరణము (శ. ?.)· చూ, హూహూ

దిగధిపతులు అంఁఇంద్రుఁడు,అగ్ని, యముఁడు, నైరృతి, వరుణుఁడు, వాయువు, కుబేరుఁడు, ఈశానుఁడు. (8) [విసర్జించే.

దిగనాడు దే స. క్రి రూ-దిగ్గనాడు చూ,

దిగవిడుచే దే. స. క్రి —పై —

దిగసన. జే. ప్రి. క్రి విణ దిగువగా.

దిగు దే అ. క్రి. రూ·-దివు. 1. మీఁదనుండి క్రిందకువచ్చే, 2. ప్రయాణమైపోవునపుడు దారిలోవిడుచే, 3 దిగుమతియగు; 4. రూ-దివు, ఎగఁగు-రూ-ఎఱఁగు, డిగఁద్రావు-రూ-డిగ్గఁద్రావు-దిగఁద్రావు-దిగ్గఁద్రావు-డిగఁబడు-రూ-దిగఁబడు, డిగు-రూ-డిగ్గు-దిగ్గు (సం ప) —అవతరించే, అవతరిల్లు.

దిగుచే దే. షే్రి. చూ, రూ-డించే

దిగుట. వా. వి. (సం ప) — అవతారము, అవరోహణము, అవరోహము

దిగుడు. జే విణ. రూ-దిగ్గుడు-దిగువాయి. 1. ఆనతము: చూ, భుగ్నము 1; 2. న్యూనము. చూ, వెలితి. [వాటు.

దిగుదల. ద్వ. వి. (దిగుడు + తల)· చూ, దిగు

దిగుమతి దే. వి. (ఓడలోనున్న సరకును రేవునందు) దించేట [(అనియు)·చూ,వెఱపు.

దిగులు. దే. వి. బ. గుండెయదరు, భయము

దిగులుపడు. ద్వ. అ. క్రి: దిగులొందు.

దిగులుపాటు ద్వ. వి: దిగులుపడుట

దిగులొందు. ద్వ. అ. క్రి: దిగులుపడు.

దిగువ. దే. అవ్య. 1: చూ, క్రింద; దే. వి. 2: చూ, దిగువాటు; విణ. 3. క్రిందైనది.

దిగువాటు. ద్వ. వి. (పా. 1, ఆ. 124): అడుగు-రూ-అడ్గు, డిగువ-రూ-దిగువ, దిగుదల, పాదు. (సం. ప)— అధోభాగము, తలము.

దిగువాయి. దే విణ. చూ, రూ-దిగుడు

దిగువాలు దే. అ. క్రి (దిగుడు + పాలు) 1 మీఁదినుండి క్రిందికిపడు; 2 చూ, స్రవించే ప్రా. 3, ఆ. 9.

దిగ్గదాత్రిపు. దే. అ క్రి: చూ, దిగు 4

దిగ్గజభార్యలు. అం. అభ్రము, కపిల, పింగళ, అనుపమ, తామ్రకర్ణి, శుభ్రదంతి, అంగన, అంజనావతి. (8)

దిగ్గజములు అం. ఐరావతము, పుండరీకము, వామనము, కుముదము, అంజనము, పుష్పదంతము, సార్వభౌమము, సుప్రతీకము (8) చూ, హస్తి. [గము. 3

దిగ్గన దే ప్రి. క్రి. విణ తటాలున. చూ, వే

దిగ్గనాడు. దే. స క్రి. చూ, రూ-దిగనాడు.

దిగ్గియ వై. వి.=దీర్ఘికా: చూ, రూ-డిగియ

దిగ్గు చూ, రూ-డిగ్గు.

దిగ్గుడు. దే విణ: చూ, రూ-దిగుడు

దిగ్గున దే. ప్రి. క్రి. విణ. చూ, రూ-దిగ్గన.

దిగ్గురను. దే అ క్రి. (దిగ్గు + అను) భయముచే వ్రాఁదయును దిగ్గురను (సంధియందువర్ణాధిక్యము) [చూ, సస్యము.

దిగ్గోలు దే. వి. కోయుపైరువకు ముందుపైరు:

దిగ్ధము సం. వి. అ. పుం. 1. లిప్తకము, విసము పూసినబాణము: చూ, బాణము 1; విణ. 2 పూయఁబడినది: చూ, లిప్తము.

దిగ్బంధము. సం. వి. అ పుం. 1 మంత్రముచేత కట్టెడు దిక్కులకట్టు: చూ, మంత్రము. 1, 2. చూ, పాలెపురుగు.

దిగ్బలము. అం. షడ్బలములలో నొకటి (బుధగురులు తూర్పుదిక్కున లగ్నగతులై బలవంతులగుదురు. రవికుజులు దక్షిణదిక్కున లగ్నమునకు దశమస్థానగతులై బలవంతులగుదురు. శనిపశ్చిమదిక్కున లగ్నమునకు సప్తమమందుండి బలవంతుఁడగు. చంద్రశుక్రులు ఉత్తరదిక్కున లగ్నమునకుఁ జతుర్థమందున్నవారై బలవంతులగుదురు. ఏగ్రహము లెక్కడ దిగ్బలవంతులని చెప్పఁబడెనో తత్సప్తమస్థానమందు దిగ్బలశూన్యులగుదురు. పైనఁజెప్పఁబడిన స్థానములుగాక ఇతరచోట్లనున్న రౌడల త్రైరాశికమువలన దిగ్బలసాధనము చేయవలయును) చూ, షడ్బలములు.

దిగ్భ్రమము సం వి. అ. పుం 1 =దిఙ్మో. దిక్కులతబ్బిబ్బు చూ, మాఱిత్తు; వా. 2. భ్రమముఁగొందుట, త్రిప్పు. చూ, విహారము 1.

దిచ్చేరి వై. వి =దిక్చారిణీ: చూ, అంకులాఁడి.

దిచ్చెమొగము. ద్వ. విణ. అదృశ్యము: చూ, కంచెమించు.

దిట. వై. వి =దృఢ రూ-దిట్ట. దార్ఢ్యము. భాగ 8 స్కం. 633; చూ, శక్తి 1.

దిటము వై. వి.=దృఢ (రూ-దిటవు-దిట్ట-దిట్టము) 1 ధైర్యము చూ, స్థైర్యము; 2. దృఢము: చూ, స్థిరము; దే విణ. 3. పెచ్చు: చూ, హెచ్చు. 2. [దేశ్యమని శ ర.)

దిటవరి. వై. వి.=దృఢ చూ, రూ-దిట్టఁడు.

దిటవు. వై. వి. 1 =దృఢ. దార్ఢ్యము: చూ, శక్తి 1; విణ. 2 =దృఢ: దృఢము: చూ, స్థైర్యము.

దిట్ట. వై. వి. 1.=దృఢ: చూ, రూ-దిట; విణ. 2: చూ, సమర్థుఁడు. అచ్చ. సుం, కాం. 167; 3.=దృఢః: చూ, రూ-దిట్టఁడు; 4. దార్ఢ్యముకలవాఁడు; 5. దృఢము: చూ, స్థిరము.

దిట్టఁడు. వై. విణ =ధృష్టః. భార. భీష్మ. 1, ఆ. 65: ఉటంకి-రూ-ఉటంకు, ఉక్కు, ఉక్కుతునియ, ఉరియ-రూ-ఉటియ, గడుసరి, గద్దరికాఁడు, గాలకుఁడు, గుండా, తుటారికాఁడు, దంట, దట్టుఁడు, దిటవరి-దిట్ట-రూ-దిట్టఁడు-దిట్టరి, పెంకి, రణపెంకి,

(సం. ప) —అతిధృతి, అదీనుఁడు, ఏకాగ్రుఁడు, ధీరుఁడు, ధృష్టుఁడు, ధైర్యశాలి (చూ, హంవీరుఁడు. 2)

దిట్టము. వై. వి. 1. నిర్ణయము చూ, సత్యము 1; 2 =ప్రతిమ-ప్రతిష్ఠ: చూ, రూ-పట

దిట్టరి. వై విశ.=దృఢ చూ, దిట్టఁడు

దిడ్డి. దే. వి 1. గవనిలోనగువానిప్రక్క చిన్న తలుపు వాకిలి: చూ, వాకిలి (చూ, సదనము 1), 2 చిన్నవాకిలి చూ, వాకిలి (చూ, సదనము. 1) [దిడ్డి 2

దిడ్డిగంతి. వా. వి. పెరటిగుమ్మము చూ,

దిడ్డివాకిలి. వా వి —పై— [వృక్ణము

దితము. సం.విశ నఱకఁబడినది దాతము చూ,

దితి. సం వి. ఇ. స్త్రీ. 1. అసురులతల్లి: చూ, మాత. 1, 2 నఱకుడు చూ, హతి

దితిసుతుఁడు సం. వి. అ పుం దైత్యుఁడు చూ, రాక్షసుఁడు. 1

దిద్దు దే. స. క్రి. 1. ఒండించు. కళా 2, అ 34: చూ, శిక్షించు, 2. చూ, సవరించు. కళా. 3, అ. 174; వా 3. బొట్టుదిద్దు, 4. అక్షరములుదిద్దు

దిద్దుగడ. దే. వి. (రూ-దిద్దుడు-దిద్దుపాటు-దిద్దుబడి)

దిద్దుడు. దే. వి.—పై—

దిద్దుపాటు. దే. వి.—పై —

దిద్దుబడి. దే. వి.—పై.— (వాంఛ.

దిదృక్ష. సం. వి. అ. స్త్రీ. చూడనిచ్చ: చూ,

దిదృక్షువు. సం. విశ. ఉ. చూడనిచ్చగలవాఁడు: చూ, వాంఛితుఁడు.

దిధక్ష. సం. వి. అ. స్త్రీ. కాలువనిచ్చ: చూ, వాంఛ. (చూ,వాంఛితుఁడు.

దిధక్షువు. సం. విశ.ఉ. కాలువనిచ్చగలవాఁడు:

దిధిషువు. సం. వి. ఊ. స్త్రీ. 1. మాఱుమనువుది: చూ, భార్య; ఉ. పుం. 2. మాఱుమనువుదాని మగఁడు: చూ, భర్త. 1.

దినకరుఁడు. సం. వి. అ. పుం.చూ, సూర్యుఁడు.

దినగోల. వా. వి: చూ, దినబత్తెము

దినదినము. వా. సం. వి. ప్రతిదినము చూ, వాసరము

దినప్రణి. సం వి. ఇ పుం చూ, దినకరుఁడు.

దినబత్తెము. వా. మి వి (దినము + బత్తెము) ప్రతిదినమునను ఇచ్చెడుబత్తెము. వారిశ్చ 4, అ. 13 చూ, పాదము (1). [అతుది.

దినభవము సం వి అ న. నాఁటిది చూ,

దినభాగములు అం రౌద్రము, శ్వేతము, మైత్రము, శారభటము, సావిత్రము, విజయము, గాంధర్వము, కుతపము, రౌహిణేయము, విరించము, సోమము, నిరృతి, మహేంద్రము, వరుణము, భటము. (15)

దినమణి సం. వి. ఇ. పుం: చూ, దినకరుఁడు.

దినము. సం. వి అ. న 1. పగలు (12 గంటల కాలము): చూ, వాసరము; వా 2. పగలురాత్రికలసినకాలము(24గం కాలము) చూ,వాసరము; 3. ఇంగ్లీషు నెలలోనితారీఖు చూ, రోజు; 4. సౌరమాసమందలి ఒకదినము, తిథి: చూ, వాసరము; వా. 5. తద్దినము. "నేఁడుమాతండ్రిగారిదినము"

దినవెచ్చము. వా. మి. వి. (దినము + వెచ్చము) ప్రతిదినమును జరిగెడు వ్యయము. పాండు.3, అ. 18: చూ, వెచ్చము. 2.

దినసరి. దే. వి. ఒకరకమువరి చూ, సస్యము.

దినసరులు. దే.వి. ఒకరకమువడ్లు:చూ,ధాన్యము.

దినుసు దే. వి. రూ-దినుస్సు. 1. సామ్యము: చూ, సమానము. 2; 2. వస్తువు: చూ, సరకు. 2

దినాంగములు. అం తిథి, వారము, నక్షత్రము, యోగము, కరణము (5): చూ, పంచాంగములు. [లము.

దినాంతము. సం. వి. అ. పుం: చూ, సాయంకాలము.

దినారి.వై.వి.=దీనారము.వరహా.చూ,లోహము.1.

దినుసు. దే. వి చూ, రూ-దినసు. 1—2; 3. రీతి చూ, విధము 1

దినుస్సు. దే వి. రూ-దినుసు. 1 వస్తువు. కళా 6, ఆ 83 చూ, సరకు 2, 2 రీతి చూ, విధము 1. [కాం. 332.

దిన్న. దే వి చూ, రూ-జిన్న* అచ్చే యు,

దిబదిబ. వా వి. నడమట కొట్టుట లోనగు వానియందగు ధ్వన్యనుకరణము: చూ, హహాహా.

దిఁబక్కున. వా. దరి: చూ, దిబ్బున.

దిబ్బ. వై. వి.=ద్వీప. 1· చూ, తిన్నె. 2; 2. మెరకనేల. చూ, భూమి 1; 3.=ద్వీప కుప్ప· చూ, రాశి. 1.

దిబ్బడము దే. వి: చూ, రూ-దబ్బడము. 1

దిబ్బు. వా వి. రూ-దిమ్ము. చూ, దబ్బు. 4.

దిబ్బున వా. దరి: చూ, దబాలున. ]శము.

దిబ్బెము వై. వి.= దీపము చూ, స్నేహా

దిబ్బెమెత్తుట. జా. దీపములోఁబ్రిమాణముచే యుట “దిబ్బెమెత్తఁగవచ్చు నబ్బురంబగు కల్మిమేరమీటినరీతి మెలఁగఁ డనుచే” (పాండురంగమాహాత్మ్యము )

దిమాకు. వా. వి. 1. గర్వము: చూ, హంకా కారము; 2. బలిమి: చూ, శక్తి. 1; 3 ధైర్యము: చూ, స్థైర్యము (ధిమాకుఅనియు)

దిమిదిమి. దే. వి. 1 చూ, రూ-దిందిం; 2. మద్దెలమోఁత యందగు ధ్వన్యనుకరణము· చూ, హహాహా.

దిమిస. వా. వి: రూ-దిమ్మిస-దిమ్మెస, గట్టన. (సం ప).—ఘట్టన.

దిముకు. దే వి: చూ, దిమిదిమి.

దిమ్మ. వై వి. 1. వర్గము. చూ, సమూహము; 2.=ద్వీప. కుప్ప దిబ్బ. అచ్చ. బాల, కాం 121: చూ, రాశి. 1; వా. 3 =దిగ్భ్రమ. దిగ్భ్రమనొందుట, భ్రమము: చూ, వివా రము. 1.

దిమ్మరి. వై. విశ.=ధూర్త్త. (దిమ్మ+అరి) రూ-డిమ్మరి 1. భ్రమకలవాఁడు· రూ-దిమ్మరీఁడు; 2. భ్రమకలది· చూ, స్త్రీ; 3. మత్తుకలవాఁడు. రూ-దిమ్మరీఁడు చూ, సోమరి, 4. మత్తుకలది చూ, స్త్రీ.

దిమ్మరీఁడు వై. విశ =ధూర్త (దిమ్మరి+ఈఁడు.) 1: చూ, రూ-దిమ్మరి. 1. శశాం. 1, ఆ. 108, 2 చూ, రూ-దిమ్మరి. 3

దిమ్మిస. దే వి చూ, రూ-దిమిస.

దిమ్ము. దే వి 1. గుంపు చూ, సమూహము; వై. వి. 2 చూ, దిమ్మ. 3. సా. 2, ఆ. 99; 3. మత్తు చూ, మదము. 1; వా. వి. 4: చూ, రూ-దిబ్బు.

దిమ్ముపట్టు ద్వ అ. క్రి (దిమ్ము + పట్టు) 1 భ్రమగొను: చూ, పరిభ్రమించు, 2. మత్తు కొను: చూ, మబ్బుగొను.

దిమ్ముపడు. ద్వ అ క్రి· చూ, పరిభ్రమించు.

దిమ్మె. దే. వి. 1. తామరదుద్దు చూ, మిద్దె. 2. (చూ, పద్మము. 1 ); 2. చిన్నచిన్న రాళ్ల గుట్ట· చూ, పర్వతము; 3. కొయ్యబిరడ: చూ, బిగడ.

దిమ్మెస దే వి. 1· చూ, రూ-దిమిస; 2. కాపెవాని ఒకానొక కొఱముట్టు.

దిరదిర. దే. వి తిరుగుట యందగు ననుకరణము: చూ, హహాహా.

దిరసన. వై వి =శిరీషః. (రూ-దిరిసనము-దిరిసెనము-దిరిసెము-గిరిసెము)*. చూ, శ్యామవర్ణ.

దిరిసనము. వై. వి.=—వై.—.

దిరిసెనము. వై. వి.=—వై.—

దిరిసెము. వై. వి =—వై.—

దిద్దిర. దే. వి: చూ, రూ-దిగదిర. భార. ఆది· 4, ఆ 88.

దిలాసా. వా. వి. ధైర్యము.

దిలీపుఁడు. సం. వి. అ. పుం: చూ, రాజు, 1.

దివటి. వై. వి.=దీపయష్టికా. కాగడా: చూ, రూ-దివిటి

దివటీ వై వి.=—వై.—

దివము. సం. వి అ.న.=దివి 1 చూ, స్వర్గము, 2 ఆకాశము చూ, వ్యోమము; 3 చూ, దినము 1-2-3-4

దివసము. సం. వి అ. పుం, న చూ, రూ-దినము 1-2-3-4 [వేల్పుఱేఁడు

దివస్పతి సం. వి ఇ పుం ఇంద్రుఁడు చూ,

దివాంధన్యాయము. పా అందఱికి నిష్టమగుపగలు గుడ్లగూబకు అనిష్టముగా నుండుననురీతి

దివాంధము సం వి అ పుం గుడ్లగూబ చూ, పకినంపుఁబులుఁగు [చూ, సూర్యుఁడు

దివాకరుఁడు. సం. వి. అ పుం. పగటివేలుపు

దివాకీర్తి సం వి. ఇ పుం 1 చూ, మంగలి 2 మాలవాఁడు. చూ, మాల. 1

దివాణము. వై వి=దేవాయనమ్. 1. దర్బారు. చూ, సభ. 2; 2 కచ్చేరి. పాండు. 1, అ. 109 చూ, సభ 2.

దివాతపచంద్రన్యాయము. పా. పగటిచంద్రుని వలెఁ గాంతిహీనుఁడై యుండెననురీతి.

దివాను. వా వి. పెగ్గడ చూ, మంత్రి 1.

దివాభీతము. సం వి అ.పుం. 1 గుడ్లగూబ చూ, పకినంపుఁబులుఁగు; 2. కలువలకొలను. చూ, సరస్సు. 1

దివాభీతుఁడు. సం. వి. అ. పుం. 1. దొంగ: చూ, ముచ్చు. 1; వా. 2. వనికిమాలినవాఁడు చూ, నిష్ప్రయోజకుఁడు.

దివాలా. వా. వి. వ్యవహారముచెడి కలుగునష్టము. "దివాలాకోరు."

దివావైజయికము. అం. అశ్వశాస్త్రమునందలి చిత్రవర్ణములు 30 లో నొకటి: చూ, చిత్రవర్ణములు.

దివి. సం. వి. ఈ. స్త్రీ. 1. ఆకాశము: చూ, వ్యోమము; 2=దివ్. రూ-దివము చూ, స్వర్గము (వైకృతమని కొందఱు); 3 కొండనాలుక చూ, గొంతుక (చూ, రసన); ఇ పుం 4 చూ, పాలపిట్ట, వా వి. 5 చూ, దినము. 3. (ఆం 20-4-1937 సంగ్రా)

దివిజుఁడు. సం వి అ పుం చూ, వేలుపు.

దివిటి వై. వి.=దీపయష్టికా కరదీపము రూ-దివటి- దివటీ- దివిటీ - దివ్వటి - దివ్వటె -దివ్విటి- దివ్వటీ-దివ్వెటి- దీవటి- దీవటి-దీవిటి, దివియ-రూ-దివ్వియ-దివె-దివ్వె; తద్వి — అగ్గిబెండి, ఇంగిలాయి, ఇంగాయి-ఇలాయి, కరదివియ-కరదివ్వె-కరదివె, కాగడ-కాగడా, కాలుదివియ, కోలదివియ-కోలదివ్వె, చేదివియ, చేవెలుఁగు, జిగిసేమంతులు, జోంజము-జోంజోము, దివియకోల-దివ్వెకోల-దివ్వెకోల, నడదివియ, నిచ్చెనపంజే-నిచ్చెనపంజో, పగలొత్తులు, పెనుపంజే, మసాలు, మోంబత్తులు, తద్వి -(సం. వ)— ఆకాశదీపము, కరదీపము, తిమోనుత్తు, దీపయష్టిక. (చూ, స్నేహాశము).

దివిటీ. వై వి=—వై —సాంబ. తిర్య. 26.

దివిదారికొమ్ము ద్వ. వి చూ, ఒడ్డగ

దివియ. వై. వి.=దీప. (రూ-దివ్వియ-దీవియ-దివె-దివ్వె-దివ్య-దీవె-దివ్వెము) 1 దీపిక. దీపము. సా 3, ఆ. 27: చూ, స్నేహాశము, 2. చూ, రూ-దివిటి.

దివియకంబము. వై. వి=దీపస్తంభః. దీపపుసెమ్మె (రూ-దివెకంబము-దివ్వియకంబము-దివ్వెకంబము-దీవియకంబము). చూ, సెమ్మె.

దివియకోల. ద్వ. వి చూ, రూ-దివిటి

దివిషదుఁడు. సం. వి. ద్. పుం (రూ-దివిషత్తు-ద్యుషత్తు-ద్యుషదుఁడు): చూ, వేలుపు.

దివు. దే అ. క్రి చూ, రూ-దిగు. రాను. 2. ఆ. 88.

దివె. వై. వి.=దీప: చూ, రూ-దివియ. 1-2.

మురచ్చెడి, ఉదా.—సెలుశబ్దమునకు.— సెచ్చెలి, సెత్తమ్మి, సెత్తతి, సెత్తామర, సెత్తావి, సెమ్మది, సెవ్వగ, సెవ్వడిసెం, సెతీశబ్దమునకు.— సెన్నడ, సెన్నడుము, సెన్నుదురు, సెనొ్నసలు, సెమ్మొయి, సెమ్మెను, సెమ్మొగము, సెమ్మోము సెం. సెన్నడ, సెన్నడము, సెమ్మెను ఇత్యాదిస్థలములయందు సెతీశబ్దపూర్వకమై అర్థము పొసఁగి యుండునట్లు సెలుశబ్దపూర్వకమై పొసఁగియుండదని రెుఱుంగవలయును. కొన్నిరెుడల తత్సమపదము లగుచున్నప్పుడును ద్విత్వమునొందఁబడుచున్నది. " నీవు సెమ్మన మున" భార. అర. 4, ఆ. 377.

సెంజలి. దే. వి. మనోవ్యథ: చూ, శోకము.

సెక్కర. దే.వి.ఒకానొక చెట్టు:చూ,వృక్షము.

సెక్కను. దే. అ. క్రి. (రూ-సెట్టుకొను-సెలకొను-సెలవుకొను) 1. పొదుకొను. భార. ఉద్యో. 1, ఆ. 287: చూ,స్థిరపడు;2:చూ, మట్టుపడు; పే్రి. 3.(రూ-సెక్కలుపు-సెక్కలుపు) భార.విరా. 1, ఆ. 321.

సెక్కులు. దే. వి. సెక్కనుట.

సెగడి. దే. వి. 1.దుష్టమృగములు బెదరుటకును, వేలికాఁడుచేకొనుటకును వేసెడుమంట: చూ, వహ్ని. 1; 2: చూ, భూతము.

సెగడు. దే. వి. రూ-సెవడు. 1. అగడు: చూ, మత్స్యము. 1; 2: చూ, తంతునాగము; అ. క్రి. 3. బయలుసెడలు. భార. విరా. 1, ఆ. 148; 4: చూ, వర్ధిల్లు.

సెగపు. దే. వి. 1: చూ, హంకారము; 2. మండిపడుట: రూ-ఎగపు-ఎగసిపాటు, గోరింపు.

సెగయు. దే. అ. క్రి. రూ-సెవయు-ఎగయు. 1. ఎగురు: చూ, లఘించు; 2. సైకిలవు. భార. విరా. 1, ఆ. 162: చూ, రేఁగు.

సెగయుదెంచు. దే. అ. క్రి.—పై.—భార. ఆది. 5, ఆ. 173.

సెగపు. దే. వి: చూ, సందీపనము.

సెగులు. దే. వి. (రూ-సెవులు-నొగులు-నోవి-నొవ్వ-నొవ్వ-నోవు) 1. నొప్పి: చూ, క్రిమము. 1; 2. దుఃఖము: చూ, శోకము; 3. దుఃఖరూపమైనవిచారము: చూ, క్రిమము. 1 (శోకము.)

సెగ్గడము. సై. వి. 1.=నిఘుట్టన: చూ, సమ్మర్ద ము; 2 =నికట: చూ, సాంద్రము.

సెగ్గు. దే. అ. క్రి: చూ, రవణించు.

సెగ్గురు. దే. వి. గుండె యదరుట యందగు ధ్వన్యనుకరణము: చూ, హాహా.

సెచ్చె. దే. వి. మిక్కిలి సన్నమైనమాకలసమూహము: చూ, కంబుకము.

సెచ్చెలి. దే. వి. 1: చూ, స్నేహితుఁడు; 2. సఖురాలు: చూ, స్త్రీ.

సెటిక. దే. వి. రూ-సెట్టిక. వ్రేళ్లకొళ్ళ చేప్పుడు; చూ, చిటిక.

సెటుకకట్లు. దే. వి: చూ, బాలక్రీడ.

సెటికురు. దే. వి. సెటికవిఱుఁగుట యందగు ధ్వన్యనుకరణము. కై. 8, ఆ. 17: చూ, హాహా.

సెట్టన. దే. అవ్య. క్రి. విశ. అనివార్యముగ. భాగ. అని. 5, ఆ. 58: చూ, భృశము. (రూ-సెట్టనము.)

సెట్టనము. దే. అవ్య.—పై—

సెట్టపంట. దే. అవ్య. క్రి. విశ.నిష్కారణముగ.

సెట్టము. వా. వి. సెమలియాఁకలచేఁ జేసిన దారము. (రూ-సెట్టియము-సెట్టెము): చూ, సూత్రము. 1.

సెట్టిక. దే. వి: చూ, రూ-సెటిక.

సెట్టికపీల. సై. వి. 1.=సైష్టికశీల. సదాచార సంపన్నమగు స్వభావముగలవాఁడు. కై. 6, ఆ. 190: చూ, సైష్టికుఁడు; విశ. 2.=సైష్టికశీలా, సదాచార సంపన్నమగు స్వభావముగల యాఁడుది: చూ, స్త్రీ.

నెట్టితము. దే. వి.(రూ - నెట్టెము - నెట్టము) 1: చూ, రూ-నెట్టము; 2. చేట్టకుడుపు: చూ, మట్టు. 3; 3. గుండుపాక: చూ, పాక. 2

నెట్టు. దే. వి. 1. చోటు: చూ, స్థానము. 1; 2. ఉపద్రవము: చూ, శోకము; 3: చూ, యత్నము; 4. రూ-నట్టు. ఉద్యరానులుండెడుచోటు: చూ, భూమి. 1; 5: చూ, బాలక్రీడ; స. క్రి. 6. పూనిత్రోయు. భాగ. 3, స్కం. 12.

నెట్టుకొను. దే. అ. క్రి. 1: చూ, యత్నించు; 2: చూ, స్థిరపడు; 3: చూ, ముమ్మరించు. శశాం. 3, ఆ. 4; స. క్రి. 4: చూ, ఒలాత్కరించు; వా. 5. అడ్డుకొను.

నెట్టుడుగాయ. వా. వి: చూ, నెట్టు. 5.

నెట్టె. దే. వి. పోలిక. చూ, సమానము. 2.

నెట్టెము. దే. వి. ద్వీపము (అవరి): చూ, లంక. 1.

నెత్తకమ్మ. దే. వి. (నెత్తము + కమ్మ) పాచికలపందెము. శశా. 6, ఆ. 118: చూ, వ్యవహారము. 4.

నెత్తపుపలక. ద్వ. వి. (నెత్తము + పలక) రూ-నెత్తపలక: చూ, శారిఫలము. (వాడుక) (నెత్తపలము అని కొందఱు.)

నెత్తపలక. ద్వ. వి.—పై.—(వాడుక)

నెత్తము. దే. వి. 1. జెప్ప, స్నువు. స్వా. 4, ఆ. 78: చూ, పర్యేశము; 2.=నృత్త. పందెము: చూ, వ్యవహారము. 4; 3.=నృత్త. పాచికలాట. జై. 3, ఆ. 42: చూ, వ్యవహారము. 4.

నెత్తమ్మికొలనికాఁపు. ద్వ. వి. గాలి. వేం, ఆం. 13: చూ, వాయువు.

నెత్తమ్మిదిమ్ముల నిడుకమండు. ద్వ. వి: చూ, హిమాంశువు. వేం, ఆం. 11.

నెత్తరి. వా. వి. జూదరి. ఆం, పదా. వర. 58: చూ, పందెకాఁడు.

నెత్తలులు. దే. వి. బ. (నెఱి + తలలు) 1. పెద్దయలలు: చూ, వీచి. 1; 2. రూ-ముత్తరలు. ఆం, భా. ద్వి. 187: చూ, వలి. 1.

నెత్తి. దే. వి. తల. జై. 8, ఆ. 98: చూ, శిరము. 1. (తలపైభాగమనికొందఱు).

నెత్తికాయ. వా.వి.—పై.—"నీనెత్తికాయ"

నెత్తురు. దే. వి. రూ-నెత్రు: చూ, రక్తము.

నెత్తురుఁబొద్దు. ద్వ. వి: చూ, సందెజాము. స్వా. 4, ఆ. 60.

నెత్తురుకందు. ద్వ. వి. రూ-నెత్రుకందు. పాండు. 3, ఆ 156: చూ, శిశువు.

నెత్తురుగడ్డ. వా. వి: చూ, వ్రణము. 1.

నెత్తురుద్రావుఁడు దే. వి: చూ, రాక్షసుఁడు. 1. అచ్చ. యు, కాం. 60. [సర్పము.

నెత్తురుపెనుపాడ. వా. వి. ముట్టుఁబాము: చూ,

నెత్తురుపాడ. దే. వి.—పై.—

నెత్తురుబంక. దే. వి. మలముతో నెత్తురును బంకయును పడురోగము: చూ, రోగము. 1.

నెత్తురువాఱు. దే. అ. క్రి: చూ, పల్లటిల్లు.

నెత్రు. దే. వి: చూ, రూ-నెత్తురు.

నెత్రుకందు. ద్వ. వి: చూ, రూ-నెత్తురుకందు.

నెవడు. దే. వి: చూ, మూలగ. భార. ద్రో. 2, ఆ. 312.

నెవరు. దే. వి. 1. ప్రేమము: చూ, స్నేహము; 2. కృతజ్ఞత: చూ, శుభము. 1.

నెన్నడుము. వా. వి: చూ, మధ్యము. 1. పాంబ. మాన. 15. [ఆం. 37.

నెన్నుదురు. వా. వి: చూ, లలాటము. వేం,

నెన్నుదుట్లమ వ్రాయుందు పేదు. వా. వి: చూ, బ్రహ్మ. 1. ఆం. పదా. సుర. 17.

నెన్నొసలు. వా. వి: చూ, నెన్నుదురు.

నెపము. వై. వి. (రూ-నెపము-నేపము) 1.=నిభః. మిష, కపటము: చూ, వ్యాజము. 1; 2: చూ, పిగ్గు. ఆం, భా. ప్ర. 38; 3. కారణము. భార. ఆది. 8, ఆ. 112: చూ, హేతువు. 1; 4. తప్పు. భార. అర. 5, ఆ. 318: చూ, సొంటు. పా. 5. లేనిదిమీఁద వేాపుట.

నెప్పరము. దే వి. రూ-నెప్పళము. పా. 4, ఆ. 66: చూ, వేగము. 3.

నెప్పరి. దే. విశ. 1. ఉపాయశాలి: చూ, సమర్థుఁడు; 2 ఉపాయశాలిని: చూ, స్త్రీ.

నెప్పరించే. దే. స. క్రి: చూ, దుడుకుపడుచే.

నెప్పళము. దే. వి: చూ, రూ-నెప్పరము.

నెప్పు. దే. వి. 1. చోటు: చూ, స్థానము. 1; 2: చూ, స్థైర్యము; 3. చూ, వెరవు; 4: చూ, విధము.1; విశ.5: చూ, నిలువరము.1

నెప్పుకొను. దే. అ. క్రి. చూ, స్థిరపడు. స్వా. 4, ఆ. 34.

నెమకు. దే. స. క్రి: చూ, వెదకు. పా. 2, ఆ. 33.

నెమకుట. వా. వి: చూ, వెదకుడు.

నెమకుడు. వా. వి.—వై.—

నెమరు. దే. వి. 1: చూ, రోమంథము; 2. నెరసు: చూ, రేణువు. 1. [వేయు.

నెమరుచే. దే. అ. క్రి. రూ-నెమర్చు. నెమరు

నెమలి. దే. వి. 1. (రూ-నెమ్మి-నమలి-నమ్మి, నెమిలి-నెమ్మలి-నెవిలి) చూ, మయూరము; 2. రూ-నెమలు*;: చూ, పూతికరజము; అం. 3 (నెమలిపలుకు) చూ, కూజితములు.

నెమలికన్ను. వా. వి: చూ, అర్ధచంద్రము. 5.

నెమలియడుగు. దే. వి. రూ-నెమిలియడుగు. 1: చూ, పూతికరజము*; బ. 2. కుచనఖక్షతములు: చూ, స్ఫుటత. (చూ, నఖక్షతము).

నెమలు. వా. వి: చూ, రూ-నెమలి. 2. *

నెమిలి. దే. వి; చూ, రూ-నెమలి. 1. శై. 4, ఆ. 73.

నెమిలిపడ్లు. దే. వి. బ. శాలిధాన్యము: చూ, ధాన్యము. [రము. 2.

నెమిలిసొరము. వా. వి. షడ్జస్వరము: చూ, స్వ

నెమురు. వా. వి. 1. తైలలేపనము, 2. (బియ్యములోనగునవి) నెమురుట; 3. తడవుట.

నెమ్మది. వా. వి. 1: చూ, మదిమది. ఆం, భా. ద్వి. 181; 2: చూ, శాంతము. 1; 3 కుదిరిక: చూ, పాదు. 3; 4. ఆరోగ్యము

నెమ్మయి. వా. వి చూ, శరీరము. వేం, ఆం. 36.

నెమ్మలిపరుఁజే. వా. వి: చూ, నెమ్మిలిపరుఁజే.

నెమ్మి. దే. వి. 1. చూ, సంతోషము, 2: చూ, శుభము. 1. అచ్చ. సుం, కాం. 86, 3.=స్నేహః: చూ, స్నేహము. 1. భార. అర. 1, ఆ. 63; 4. రూ-నెమ్మది: చూ, శాంతము. 1. భార. అర. 2, ఆ. 338; 5 రూ-నెమ్మది: చూ, మదిమది; 6=నేమి. తినాసము *: చూ, వంజులము. 2; 7: చూ, రూ- నెమలి. 1; 8=నేమి బండికంటికడకమ్మి రథనేమి: చూ, శకటము. 1.

నెమ్మిక. దే. వి: చూ, రూ-నెమ్మి. 3,

నెమ్మిజొట్టు. ద్వ వి: చూ, సిక. 1.

నెమ్మిరవుతు. గ్వ. వి. శిఖివాహనుఁడు: చూ, స్కందుఁడు. (ఇట్లు నెమ్మి తేుఁడు)

నెమ్మిలి. దే. వి. చూ, రూ-నెమలి.

నెమ్మిలిపరుఁజు దే. వి. కత్తిపిడి: చూ, పిడి.2.

నెమ్ము. దే. వి. 1. తడి: చూ, స్తేమము; 2. ఎముక.చూ, శల్యము. 1;బ 3 పలకలు-తలుపులచెక్కలు లోనగునవి ఒకదానికొకటి చేర్చి యంటవేయలోపలఁజొప్పించెడు మేకులు;బ. 4 బండిచక్రములరంధ్రములయందు జొప్పించెడు ఇనుపగొట్టములు, వై. వి. 5.=నేమి: చూ, రూ- నెమ్మి 8.

నెమ్మకొను. దే. అ. క్రి. చూ, పడనుకొను.

నెమ్మేను వా వి చూ, నెమ్మయి వేం, అం 38

నెయి వై వి. (రూ-నెయ్యి-నే-నేయి)= స్నేహ. 1 ఘృతము చూ, హవిస్సు; 2 తైలము చూ, స్నేహము. 2

నెయ్యపుటలుక. ద్వ వి ప్రణయ కోపము చూ, కోపము.

నెయ్యపుకాఁడు ద్వ వి చూ, మన్మగాఁడు

నెయ్యమాడు ద్వ అ క్రి చూ, స్నేహించే

నెయ్యమి. వై వి రూ-నెయ్యము=స్నేహ: 1 చూ, స్నేహము, 2 చూ, సౌందర్యము

నెయ్యము వై వి =(రూ-నేయము-నెయ్యమి-నెమ్మి-నెమ్మిక)=స్నేహ — పై — (సౌందర్యమునకు —భార ఆది. 7, ఆ 172)

నెయ్యుఁడు. ద్వ విణ 1 చూ, స్నేహితుఁడు, 2 స్త్రీ చూ, స్త్రీ.

నెయ్యి వై వి 1 = చూ, రూ-నెయి, వా స. క్రి. 2. (బట్టలు) నేయు (అప్రి)

నెయ్యుఁడు వై విణ = చూ, స్నేహితుఁడు. భాగ సభా 1, ఆ 77

నెయ్యురాలు ద్వ విణ (నెయ్యము + అలు) చూ, నెయ్యుఁడు 2

నెఱ దే విణ వృత్తియందు నెఱవు శబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము రూ-నెఱ-నెఱా-నేఱా.

నెరడు. దే విణ. 1 గొగ్గి చూ, రత్నము. 1; 2 సమముకానిది చూ, విషమము

నెరవు. దే వి. 1 రూ-నెగవు చూ, వ్యాపనము; 2 చూ, వలితము. 1; విణ. 3 అధికము: చూ, హెచ్చు. 1; క్రి. 4. నెరయుచే. జేయు; 5. చూ, నించే, 6. నెఱవేర్చు. లక్ష్మి. 2, ఆ. 76; 7. పఱపు, 8. వ్యాపింపఁజేయు; 9: చూ, దువ్వు. 5

నెరయిక. దే. వి. నెరయుట.

నెరయు. దే అ. క్రి. రూ-నెఱయు. 1: చూ, వ్యాపించే. లక్ష్మి. 3, ఆ. 41; 2 చూ, మెండుకొను. భార ఆది 3, ఆ. 157; 3 చూ, సిద్ధించే.

నెరయొంటరి. వా వి. తుమ్మెద వేం, అం 98 చూ, భ్రమరము [చూ, సగనెండ.

నెరవంజి దే. వి (రూ-నెగవు-నెగనెంప *)·

నెరవు. దే. వి 1 రూ-నెఱవు ఘూర్తి చూ, సంపూర్ణత; 2 రూ-నెరపు చేట్టుట చూ, వ్యాపనము, 3 రూ-నెఱవు, దారి చూ, మార్గము 1, 4. చూ, రూ-నెరవంజి *; విణ 5 రూ-నెఱవు పూరణము చూ, సంపూర్ణము; 6 అధికము చూ, హెచ్చు 1, 7 యుక్తము చూ, యోగ్యము 2, 8 విశాలము చూ, విస్తారము 1; 9 చూ, వ్యాపకము, 10 చూ, వ్యాప్తము వై 5, ఆ. 161.

నెరనెండ దే వి చూ, రూ-నెగవంజి *

నెరసరి. వా. వి 1 రూ-నెఱసరి చూ, సింహము, 2 పూర్ణోసమానము చూ, ఉపమ.

నెరసు దే. వి. 1. కళంకము చూ, లక్షణము. 1; 2 దోషము చూ, వృజినము 1; 3 రూ-నెరుసు ఉ, రా 1, ఆ. 98. చూ, రేణువు 1; 4. తప్పు. అని. 1, ఆ. 12: చూ, సొంటు; 5. గవుండ్లవాఁడు కత్తులునూరెడు పాడి: చూ, రేణువు. 1.

నెరి దే. వి. రూ-నెఱి. పాండు, 1, ఆ. 117: చూ, వేల్లితము. 2.

నెరుము. దే. స. క్రి. రాచే: చూ, రుద్దు. 1.

నెఱ. దే. విణ. 1. రూ-నెఱా-నేఱా. వృత్తియందు నెఱవు శబ్దమునకు మీఁది వర్ణము లోపింపఁగా మిగిలినరూపము. "నెఱగాణ-నెఱజాణ" మొ; అచ్చ. యు, కాం. 420; వి. 2. కేశము. అం, భా. ద్వి. 145: చూ, వెండ్రుక. 1.

నెఱఁకు. దే. వి. రూ-నెఱను. జీవస్థానము, మర్మము (అనియు). భార. విరా. 3, ఆ 161 చూ, మర్మము. 1.

నెఱక. దే. వి చూ, నెఱ 2.

నెఱకాఁడు. గే. విణ. (నెఱవు + కాఁడు) చూ, ప్రాజ్ఞుఁడు.

నెఱను గే వి: చూ, రూ-నెఱఁకు భార విరా 3, ఆ 161, ఉ, హరి 5, ఆ 98

నెఱపు దే వి, విణ, పేరి చూ, రూ-నెరపు (వ్యాపింపఁజేయుటను.—గళాం 3, ఆ 102 )

నెఱమీాటు మొన. అం: చూ, మొనలు

నెఱయు దే. అ క్రి చూ, రూ-నెరయు

నెఱవాది దే వి. చూ, సమర్థుఁడు. [చూ, విద్య 1

నెఱవిద్దె ద్వ వి. హస్తలాఘవముగల జాలవిద్య

నెఱవు దే వి· చూ, రూ-నెగవు. (అధిక ము —అచ్చ యు, కాం. 33; యుక్తము —స్వా 4, ఆ 27, విశాలము.—ఉ, హరి 4, ఆ 272.)

నెఱవేఱు దే అ. క్రి· చూ, సిద్ధించు.

నెఱవేఱుచు దే స. క్రి చూ, సిద్ధిఁబొందించు

నెఱవేఱుట. దే. వి చూ, సమాప్తి. 1.

నెఱసరి. ద్వ. విణ 1:చూ, శూరుఁడు; 2 చూ, రూ-నెరసరి. 1

నెఱా దే. విణ· చూ, రూ-నెఱ. 1.

నెఱి దే. వి 1 కచ్ఛభేదము· చూ, పింజె. 4; 2. క్రమము చూ, విధము. 1 భార. ద్రో. 2, ఆ. 182; 3. న్యాయము. భార. ఉద్యో 3, ఆ. 283: చూ, సత్యము. 1; 4. పరాక్రమము. భార. ఆది. 4, ఆ. 201: చూ, శౌర్యము. 1; 5 రూ-నెరి. వక్రిత. చూ, వేల్లితము. 2; 6· చూ, సౌందర్యము. కళా. 4, ఆ. 103; 7: చూ, ఐక్యము. 1. స్వా. 4, ఆ. 58; 8. పక్షియీఁకల చిక్కు. భార. ఉద్యో. 2, ఆ. 112; 9:చూ, నెఱిక. 1; 10. ఆచారము: చూ, వర్తనము 1; 11:చూ, నెరవు 1; 12. ప్రజ్ఞ· చూ, బుద్ధి; ౫. 13. కేశము· చూ, వెండ్రుక 1; 14. చుట్టువెండ్రుకలు చూ, వెండ్రుక. 1; విణ 15 వక్రము చూ, వేల్లితము 2

నెఱిక గే వి. 1 స్త్రీపురుషుల చూ, వలి. 2, 2 పైఁటపాపడ నై .6 ఆ 22 చూ, వస్త్రము [డ్రుక. 1.

నెఱికుఱులు. దే. వి. ౫ అలకలు: చూ, నెం

నెఱిపడు ద్వ అ క్రి· చూ, సిద్ధించు

నెఱియ గే. వి (రూ-నెఱె-నెఱ్ఱియ-నెఱ్ఱె) 1 చీలిక చూ, శకలము. 4, 2 నేల పగులు చూ, బీఁట

నెఱె దే వి —పై —

నెఱ్ఱియ దే. వి —పై —

నెఱ్ఱె దే వి —పై —

నెల దే. వి 1 చూ, హిమాంశువు, 2 చూ, పున్నమ, 3 చూ, మాసము. 1 (౫ నెల్లు అని యయాతిచరిత్రము), 4 గోటు పాండు 1, ఆ. 153 చూ, స్థానము 1, 5 కర్పూరము కళా. 7, ఆ. 60 చూ, శిరము; 6. ఆఁడుదానితలనగి చూ, భూషణము 2 [స్త్రీ

నెలఁత దే వి. ఆఁడుది. రూ-నెలఁగుక చూ,

నెలఁతుక. దే వి —పై—

నెలకట్టు. గే వి కట్టడపునేల భార విరా. 4, ఆ 26 చూ, భూమి 1.

నెలకువ దే వి చోటు. నిర్వ. 2, ఆ 11 చూ, స్థానము. 1.

నెలకూన ద్వ వి 1. బాలచంద్రుఁడు: చూ, హిమాంశువు; 2. నెలవంక: చూ, నక్షత్రము.

నెలకొను. దే. అ. క్రి. రూ-నెలవుకొను 1. నిలుకడయగు: చూ, స్థిరపడు, 2. నిలుచొందు: చూ, మట్టుపడు.

నెలగ. దే. వి. ధనము: చూ, విత్తము. 1.
నెలచేూలి. దే. వి. బుధుఁడు: చూ, రాహువు 2.
నెలచెలియలు. దే. వి: చూ, లక్ష్మి 1.
నెలసేవ్వనము. ద్వ. వి: చూ, నిండుజేవ్వనము. అం, భా. ద్వి. 118.
నెలకోడు. వా. వి: చూ, సూర్యుఁడు. సాంబ. దేవ. 9. [శేఖరుఁడు: చూ, శివుఁడు
నెలతాలువు. దే. వి రూ-నెలతాల్పు. చంద్ర
నెలతునియ. వా వి. చంద్రకళ: చూ, శశికళ.
నెలతాౢ్రవడము. దే. వి: చూ, వెన్నెలపులుఁగు.
నెలవారిపింగిణి వా. వి: చూ, పర్వతము.
నెలపంది. వా. వి. ముండ్లపంది. చూ, సూకరము.
నెలపట్టి దే వి: చూ, నెలచూలి.
నెలపట్టు దే వి. చంద్రగ్రహణము· చూ, గ్రహణము. 1.
నెలపాలు. దే వి: చూ, నెలతునియ.
నెలపు వా వి. పరిమాత్ర భాగధేయము: చూ, రూ-నెలవు.(శు. పా) [తా్రవడము
నెలపులుఁగు దే. వి. రూ-నెలపుల్గు చూ, నెల
నెలమేపరి. దే వి. 1. విధుంతుదుఁడు: చూ, రాహువు 1; 2 శని: చూ, రాహువు. 2
నెలయల్లుఁడు. వా. వి: చూ, మన్మథుఁడు.
నెలఱా. దే. వి. రూ-నెలఱాయి. చంద్రికాంత పుశిల: చూ, రాయి.
నెలఱాయి. దే. వి. —పై.—
నెలలు. అం. మాసములు: చూ, మాసము. 1
నెలవంక. ద్వ. వి: చూ, నెలకూన. (నక్షత్రత ము.—పసు 1, అ. 75) [బాణము. 1.
నెలవంకకోల ద్వ. వి. అర్ధచంద్రబాణము:చూ,
నెలవత్తి ద్వ. వి 1 పచ్చకప్పురపుపలుకు. శశా. 7, అ 60 చూ, సిరము, 2 పోఁక*: చూ, స్రింసి

నెలవరి. దే. విణ. రూ-నెళవరి 1. పరిచయము కలవాఁడు; 2: చూ, మర్మజ్ఞుఁడు సా. 3, అ. 289. [రము. 2-
నెలవారము. మి. వి. సోమవారము: చూ, వా
నెలవీసము. దే. వి: చూ, నెలతునియ.
నెలవు. దే. వి. 1. ఇల్లు: చూ, సదనము. 1; 2. చోటు: చూ, స్థానము. 1; 3 వాసస్థానము: చూ, సదనము. 1; 4. పరిచయము: చూ, సంస్తవము.
నెలవుకొను. దే అ. క్రి: చూ, రూ-నెలకొను.
నెలవెలుఁగు. దే. వి: చూ, వెన్నెల.
నెల్లి దే. వి. 1: చూ, శ్రీపర్ణము. 1*; 2. ఉసిరిక *: చూ, శ్రీఫలి. 1.
నెల్లిబద్ద వా. వి. మేూఁకుకట్టుబద్ద (విశాఖపట్ట ణ పా్రంతమున వాడుక).
నెవడు. వా. వి: చూ, రూ-నెగడు. (బయలు మెఱయుటకు —పంచ. వేం 4, అ. 159).
నెవము. సై. వి =నిభ. మిష' చూ, రూ-నెప ము. (కారణమునకు.—సై. 8, అ. 47.)
నెవయు. దే అ. క్రి: చూ, రూ-నెగయు (ఎగురుటకు.—భార. సభా. 1, అ. 254)
నెవిలి. దే వి చూ, రూ-నెమలి. (అప్ర.)
నెవులు. దే. వి. చూ, రూ-నెగులు.
నెవ్వ. దే. వి 1. దారిద్ర్యము: చూ, సీదరము. 1; 2· చూ, విపత్తు; 3 చూ, వఱపు.
నెవ్వగ. వా. వి. రూ-నెవ్వము. అధిక విచార ము· చూ, శోకము.
నెవ్వడి. వా వి అతిశీఘ్రము.చూ, వేగము.3.
నెవ్వము. వా. వి: చూ, రూ-నెవ్వగ.
నెళవరి. దే. విణ: చూ, రూ-నెలవరి.
నెళవు. దే. వి 1. రూ-నెలవు. పరిచయము: చూ, సంస్తవము, 2. చూ, మర్మము. 1.
నెళివు. వా. వి. —పై—
నెళినెళి. దే. వి. విఱుగుటయందగు ధ్వన్యను కరణము: చూ, హూహూ.

# నే

నే. దే. స. 1. నాశబ్దప్రథమైక వచనమునకు సరళస్థిరవర్ణములు పరములగునో దు్రతము లోపించిన రూపము. "నేగెలిచితిని" మొ; వై. వి. 2: చూ, రూ-నెయి. 1; 3: చూ, రూ-నెయి. 2

నేఁజెల్ల దే. అవ్య. (నేను + చెల్లె) బతార్థకము· చూ, సంతాపము.

నేఁడు. దే. వి. చూ, ఈదినము.

నేఁత. వై వి. 1 =వ్యూతి. నేయుట· చూ, వ్యూతి; బ. 2. సన్నబాఁగచోఁపులు: చూ, వస్త్రము (దేశ్యమని శ. ర.) [లెవాఁడు

నేఁతకాఁడు. దే. వి. రూ-నేఁతరి: చూ, సా

నేఁతపలక. దే. వి. నేఁతకాఁడు నేయునపుడు పడుగుపేకలను ఉగ్గించేపట్టెపలక.

నేఁతపురుగు. ద్వ. వి: చూ, సాలెపురుగు.

నేఁతరి. దే. వి. చూ, రూ-నేఁతకాఁడు.

నేజ. దే. వి. (రూ-నేజా-నేజము) 1. చిల్ల కోల. శకాం. 5, అ. 25. చూ, సర్వల; 2. కుంతము: చూ, బాణము. 1.

నేజము. దే. వి. —పై—

నేజా. దే. వి. —పై—

నేటించే. దే. అ. క్రి. దృఢపడు: నేటుకొను, పదిలపడు, పనుగొను.

నేటు. దే. వి. 1. నిశ్చయము: చూ, సత్యము. 1; 2. నిజము: చూ, సత్యము. 1; 3. దృఢము. అచ్చ. యు, కాం. 128: చూ, స్థైర్యము; 4. శ్రేషము: చూ, శ్రైష్ఠ్యము.

నేటుకొను. దే. అ. క్రి: చూ, నేటించే.

నేటుసేయు. ద్వ. అ. క్రి నిశ్చయపఱచే: చూ, తేటతెలవఱ్చు.

నేత. సం. విశే. (బు. ఈ. బు.) 1. ఏలిక: చూ, స్వామి. 1; అం. 2. నేతయనఁగాఁ గథానాయకుఁడు [(నాయకునకుమహాభాగ్య (పరిపాలన) ఔదార్య (దాతృత్వ) తేజస్వి తా (పరాక్రమ) వైదగ్ధ్య (నేర్పు) పాండిత్య (విద్యావివేకము) ప్రముఖసుగుణములుండవలయును. ఈగుణములన్నియు పూర్తిగాఁ గలవాఁ డుత్తముఁడు. కొన్నిటి కలవాఁడు మధ్యముఁడు చాల తక్కువగల వాఁడధముఁడు. సర్వగస సాధారణులయిన నాయకులు నల్వురు (చూ, నాయకులు), శృంగారనాయకులు నల్వురు (చూ, నాయకులు), ఉపనాయకులు నల్వురు. (చూ, నాయకులు )]

నేతి. సం. అవ్య: చూ, ఉపద్వ.

నేతిచోలు. వా. వి. ఆజ్యధాగ: చూ,హవిస్సు1.

నేతిబీర (ఱ). ద్వ. వి. ఘృతకోశాతకి *: చూ, బీఱ. 2.

నేతిబీరకాయవాటము.జా.లోపలసారము లేనిది.

నేతిసంద్రము. ద్వ వి. సర్పిస్సముద్రము· చూ, సముద్రము.

నేత్రకూటావర్తి అం. చూ, అశుభావర్తములు.

నేత్రపర్వము. జా కనులపండువు."నేత్రంబుల కపూర్వపర్వంబులొనర్చె. "(నీతిచంద్రిక-విగ్రహము); "కన్నులపండువై ధగధగం" (కవికర్ణరసాయనము )

నేత్రము. సం. వి. అ. న. 1. కన్ను: చూ, లోచనము; 2. తిరితాడు: చూ, సూత్రము. 1; 3. ఏఱు: చూ, స్వర్ణది (నది); 4. వెలిపట్టుచీర· చూ, వస్త్రము; 5. తేరు: చూ, శకటము. 1, 6. చెట్టువేరు: చూ, వేరు. 1.

నేత్రములు. పా.కండ్లు. 1. వీనికిఉపమానములు. —తామరరేకులు, లేడికన్నులు, తుమ్మెద, కలువ, చేఁపలు; అం. 2. పురుషలక్షణాంగములలో నొకటి. (రక్తరేఖలైన ధనవంతుఁ

డగు. వ్యాఘ్రాక్షుండైన నత్యంత కోపనుండగు. కుక్కుటాక్షుఁడు సదాదుఃఖియగు మృగాక్షుఁడైన శుభలాభనుఁడగు. బిడాలాక్షుఁడైనను హంసాక్షుఁడైనను నరాధముఁడగు. మయూరాక్షుఁడును నకులాక్షుఁడునైన మధ్యముఁడగు. నేత్రాంతము తెల్లనైన లక్ష్మీయుక్తుఁడగు మధుపింగళ వర్ణమైన నైశ్వర్యము దీర్ఘాయువునగు ఏకాక్షుఁడైన కాణుఁడగు మిడిగ్రుడ్లుగలిగిన నైష్ఠికుఁడగు తడికన్నులైన దుఃఖితుఁగు గుంటకన్నులైన పాపాత్ముఁడగు కామములున్న దమ్మరిఁడగు.) చూ, లక్షణాంగములు, 2 స్త్రీలక్షణాంగములలో నొకటి (ఎడి కన్నులనౌనున్న రాజభార్యయగు నీలాలమై వసుభపతియగు పింగవర్ణములైన కన్నులు లేనిదియును దుష్టలురాలును విధవయును నగు. కాటుకపట్టనైనున్న భాగ్యవంతురాలగు ఎఱ్ఱనైన వెండ్రుకలుండిన దరిద్రురాలగు మచ్చయున్న నశుభప్రదము. గుండ్రముగనున్న రాక్షసీసమమై దుశ్చారిణియగు గూబకన్నులైనను పిల్లికన్నులైనను ఎననుండుగురు మగలనునురు కదలుచున్న చూపు గలిగిన జారిణియగు.) చూ, స్త్రీలక్షణాంగములు [రోదనము. 2

నేత్రాంబువు సం. వి. ఉ. న కన్నీరు చూ,

నేత్రామృతము అం' చూ, అంజనములు

నేతృఁడు సం.విణ.ఒడయఁడు:చూ,స్వామి 1.

నేదిష్ఠము సం. విణ. రూ- నేదీయాంసము మిక్కిలి దగ్గఱ చూ, సమీపము. 1.

నేదీయాంసము. సం. విణ —పై—

నేను. దే స రూ-ఏను (సం ప).—అహమ్

నేపథ్యము సం వి అ వ రూ- నైపథ్యము 1. వస్త్రాద్యలంకారము చూ, భూషణము. 2; 2. వటినిలుచేచోటు' చూ, రంగము. 3.

నేపాళదేశపుబ్రాహ్మణులు, వారి జాతులయొక్క నామములు. అం పార్బత్య, అధికారి, అర్జల, ఆచార్య, ఉక్నియాల, కండరియ, కప్యాల, కోయిక్యాల, కోయినాల-కోయిరాల, ఖనాల, ఖాండ్యాల, గర్నియాల, గురాగాయి, గైతౌల, ఘిమిరియా, చంపాగాయి, చపలాగాయి, పిడి, దంజాలరి, పవారి, ధూంగియాల, నేపాలియా, పండిత, పనేరు, రిజాల, రిస్యాల, లకాయి,లంసాల, లహోని, వాస్తగాయి, పత్యాల, సిద్ధియాల' చూ, బ్రాహ్మణులు (నేపాళదేశము పర్వతములతో నిండియుండుటచే నిందు వసించే బ్రాహ్మణులు పార్వత్యాదినామములు కలవారై గోత్రాంతర్భేదులను చూపిరి గోత్రములో నగుచుండగు గౌరా, ఘోటియాలనెడితక్క నుపాధ్యాయులచే నీల్లి తెప్పించి యుపయోగించే కొందరు వీరిలో ఋగ్వేదులు, యజుర్వేదులు, మాధ్యందినులు,సామవేదులు, అథర్వణవేదులును కూడ కలరు వీరు శాక్తేయ మతమునకుఁజెందిన వ్యాపాసనాపరులై యొక తెగవారును, తంత్రోపాసకులై యొక తెగవారునైయున్నారు. వీరిలో పార్బత్యాది బ్రాహ్మణులు బ్రాహ్మణులకును క్షత్రియులకును పురోహితులై యున్నారు కొందఱు ఇతరజాతులవారికి పురోహితులై యున్నారు నేపాళదేశపు బ్రాహ్మణ తెగవారందఱును గొఱ్ఱెలను మేఁకలను పక్షిజాతులను భక్షించెదరు. ఆదేశపుప్రభువు క్షత్రియుఁడగుటచే బ్రాహ్మణాదిజాతులవారు కులాచారములు చెడకుండ కాపాడుచుందురు.)

నేపాళము. సం. వి. అ. పుం. 1. నేపాళదేశము: చూ, దేశము; 2. ఒకరకము చెఱకు*.చూ, రసాలము. 3; వై. వి. (1) నేపాళముశ. నేపాళిక. (ఇదిద్వివిధము.—పెద్దనేపాళము,సీమనేపాళము.)(శుద్ధి.—గింజలలోనిపప్పును పేడనీళ్లలో రెండుజాములుఉడికించినశుద్ధి.)

నేపాళవేము. సం. వి. అ. పుం అశ్వతిక్తము, తృణనింబము. *

నేపాళిక సం.వి.ఆ. స్త్రీ: చూ, నేపాళము(1)*

నేబు. గే. వి. 1. పండెండుకాసుల నాణెము, వా. బ. 2 డబ్బులు(కానులు) "నేబులసంచి"

నేమంబుఁగన్న మస్నివితల్లి ప్ర్వ వి దేపగంగ వేం, అం. 17 చూ, నది. [చూ, ప్రసి.

నేమకము వై. వి =నియమము రూ- నేమము

నేమము సం. వి అ పుం 1 కాలము చూ, సమయము 1, 2. పేంక' చూ, మేఁమ 1, 3 ఖండము చూ, శకలము. 4, 4 చూ, పాకారము, 5. కపటము చూ, వ్యాజము 1; వై వి (1)' చూ, రూ- నేమకము కళా 6, అ 94; (2)' చూ, పరితము

నేమి సం వి ఇ పుం. 1 =నెమ్మి-నెమ్మి బండి కంటికడకమ్మి చూ, శకటము. 1, 2 తిని శము*. చూ, వంజులము 2, ఇ. స్త్రీ 3.తిరిక. నూతియందునీరెత్తుటకు సమీపమున నుంచినరాట్నము, ఏతము మొదలైనదారుయంత్రము; వా. వి (1)' చూ, సామర్థ్యము 1

నేమించే వై స క్రి =నియమః చూ, సెలవిచ్చు.

నేము. దే స. క్రి 1. ధాన్యము చేటలోఁబోసి కొనియిటునటుఁదిప్పు; 2. రూ- ఏము- మేము నాశబ్దపథమా బహువచనమునకు రూపాంతరము

నేయము. వై. వి. (రూ- నెయ్యము- నెయ్యమి) 1.=.చూ, స్నేహము. రస. 3, గుచ్ఛము; 2.న్యాయము. "నేయముగాదు" క్షేత్రియ: చూ, సత్యము. 1.

నేయార్థము. అం. సంధిదోషములలో నొకటి. (తనకె సంకేతమైనది): చూ, కావ్యదోషములు, సంధిదోషములు.

నేయి. వై. వి. చూ, రూ- నెయ్యి.

నేయు. వై. స. క్రి. 1. నేఁత నేయు: అనువయించే; 2: చూ, అల్లు; వా. వి. 3. జేబ్బుతో మంచేమువిూఁదపరుండు.

నేయూఁడు వై వి (రూ- నెయ్యరి- నెయ్యుఁడు) =స్నేహః చూ, స్నేహితుఁడు

నేరఁబోతు దే విణ చూ, వాగ్మి

నేరమి. దే. వి. 1. అజ్ఞానము భాగ. ఆర 5, అ. 311: చూ, మఱపు 2, 2 పాపము. అం, భా ద్వి 191, భాగ. సభా. 2, అ 224 చూ, వృజినము; 3 చూ, రూ- నేరము.

నేరము దే.వి తప్పు (రూ- నేరమి- నేపము- నెవము- నెపము- నెరసు) చూ, సొంటు

నేరాసి. దే వి జిగబాజీ (బట్ట). చూ, పత్త్రము.

నేరిమి దే. వి చూ, రూ- నేరుపు. 1.

నేరుచే దే అ. క్రి. రూ- నేర్చు. 1. ఓపు చూ, పర్యాప్తమగు, స. క్రి 2 చూ, వాడుకపడు

నేరుపరి దే. విణ.(రూ- నేర్పరి- నేరుపుకాఁడు- నేరుపులాఁడు- నేర్పుకాఁడు)' చూ, సమర్థుఁడు.

నేరుపు వై. వి =నైపుణ్య. రూ- నేర్పు (దేశ్యమని శ. ర) 1 చూ, సామర్థ్యము. 1; 2 చమత్కారము, విజ్ఞానము: చూ, సామర్థ్యము. 1. అం, భా. ప్రి. 103; 3. అజ్జ: చూ, సమర్థనము; పేరి. 4. నేఱువఁజేయు.

నేరుపుకాఁడు. దే. విణ: చూ, రూ- నేరుపరి.

నేరుపులాఁడి. దే. విణ. జాణ: చూ, స్త్రీ.

నేరుపులాఁడు. దే. విణ: చూ, రూ- నేరుపరి. అచ్చ. బాల, కాం. 7.

నేరటేటు. దే. వి. జంబు: చూ, నది

నేరెడు. దే. వి: చూ, రూ నేరేడు.

నేరేడల్లులు. వా. వి. బ: చూ, హాణిగలు.

నేరేడు. దే. వి. (రూ-నేరడు-నేరెడు-నేరేడు): చూ, సురభిపత్రి. (అతిమూత్రమును, మధుమూత్రమును తగ్గించేను. రక్తగ్రాహి కట్టును.)

నేరేడుదీవి. ద్వ.వి:చూ, తొలుదీవి.నై. 5,ఆ.76.

నేరేడుపండు. ద్వ. వి. జంబువు, జాంబవము.

నేర్చు: చూ, రూ-నేరుచే.

నేర్పరి. దే. విణ: చూ, రూ-నేరుపరి.

నేర్పు. వై. వి, పేరి: చూ, రూ-నేరుపు (దేశ్యమని శ. ర.)

నేర్పుకాఁడు. దే. విణ: చూ, రూ-నేరుపుకాఁడు.

నేర్పువాఁడు. దే. విణ: చూ, బోధకుఁడు.

నేజా. దే విణ: చూ, రూ-నెజ. 1.

నేల దే. వి. 1. పుడమి: చూ, భూమి. 1; 2.చోటు. ఉ, హరి. 2, ఆ 204 చూ, స్థానము. 1; 3. దేశము. భార. విరా. 4, ఆ. 221: చూ, సీమ. 1. (దేశము); వా 4.పంటపండుపొలము. " నాకునాలుగుపుట్ల నేలకలదు. " [రించే

నేలఁగలుపు. దే. అ. క్రి. చెంపు: చూ, సంహ

నేలఁబెట్టికాలరాచేట జా. మిక్కిలికష్టపెట్టుట. " నేలఁబెట్టి కాలరాచేసట్టియాచిన్నవాండ్రు. "(ధర్మజరాజమూయము.)

నేలకడిమి. ద్వ. వి. భూకదంబము *: చూ, హాలిప్రియము. [స్థాలి. 2

నేలకలిగొట్టు. దే. వి. భూపాటలి *: చూ,

నేలకుఁగోలకుఁదెచ్చుట. జా. మిక్కిలిబాధపెట్టుట. " నేలకుఁగోలకుఁదెచ్చుచేన్నవాఁడు " (కళాపూర్ణోదయము. 7, ఆ. 35)

నేలగుమ్మడి దే.వి.చూ, భూమికర్కారువు. *

నేలగుమ్మడు. ద్వ వి. విదారి *. (ఇది ద్వివిధము.— తెల్ల నేలగుమ్మడు, నల్ల నేలగుమ్మడు. ఇదియే తెల్ల నేలగుమ్మడు): చూ, భూమి కర్కారువు.

నేలగొలిమిడి. దే. వి. గోలోమి*: చూ, తెంగబీర.

నేలచేూలి. దే. వి. మన్నుకాసుపు: చూ, సీత.

నేలజెమ్మి. ద్వ.వి. పిన్నజెమ్మి*:చూ,శమీరము.

నేలతంగేడు. దే. వి: చూ, హేమపుష్పకము*.

నేలతమ్మి. ద్వ. వి. మెట్టదామర*: చూ, సహస్రపత్రము.

నేలతాడి. ద్వ. వి. రూ-నేలతాడు: చూ, శలింధ్రికము*.

నేలతాను. ద్వ. వి.—పై—

నేలతామర. ద్వ. వి: చూ, నేలటమ్మి*.

నేలతాలుపు. దే.వి. 1. చూ, పర్వతము; 2.కుక్రియుఁడు. అచ్చ యు,కాం. 21.చూ,రాజే.1.

నేలతొళసి ద్వ.వి. భూతులసి*. చూ,హరిప్రియ.

నేలనమలి. దే. వి. ఒకానొకపిట్ట: చూ, పక్షి.

నేలనేరేడు. దే. వి. భూమిజంబువు*: చూ, సురభిపత్రి.

నేఁపట్టి. దే. వి. 1. అంగారకుఁడు: చూ, రాహువు. 2; 2. నరకాసురుఁడు: చూ, మహీసుతుఁడు; 3: చూ, నేలచేూలి.

నేలపట్టిమిగనిబంటు. ద్వ. వి. 1. అనుమఁడను కోఁతి. ఆం, పదా. 5—21: చూ, వానరము; 2. కోఁతి: చూ, వానరము.

నేలపడక. వా. వి. 1. చచ్చినవానిపడుక: చూ, మృతశయ్య; 2. నేలపైపరుండుట .

నేలపల్లటీ. దే. వి. ఒకరకముపావురము: చూ, సురటీ.

నేలపొన్న.ద్వ.వి.కోలపొన్న*: చూ,పృశ్నిపర్ణి.

నేలపోఁక.ద్వ.వి. బోధాంబకము*: చూ,క్రంపి.

నేలబువి. ద్వ. వి: చూ, వల్మీకము.వేం,ఆం 88.

నేలమరె. ద్వ. వి. భూమిలోపలియిల్లు. (రూ-నేలమాలియ-నేలమాళె): చూ, సదనము 1.

నేలమాలియ. ద్వ. వి.—పై.—

నేలమాళె. ద్వ. వి.—పై —

నైయగ్రోధము. సం. వి. అ. న. మఱ్ఱిచెండు.

నైయాయికుఁడు. సం. వి. అ. పుం: చూ, న్యాయాధిపతి. [అం. 2: చూ, శస్త్రములు.

నైరాశ్యము. సం. వి. అ. న. 1: చూ, వలవమి;

నైరృతి· చూ, రూ-నిర్వృతి. 2. 4. [(హరిత్తు.)

నైర్వృతిమూల. మి. వి: చూ, రూ-నిర్వృతిమూల

నైర్వృతుఁడు· చూ, రూ-నిర్వృతి 2-4

నైర్ఘృణ్యము సం వి. అ. న. దయలేనితనము.

నైర్మల్యము సం వి అ. న. నిర్మలత్వము, గర గర: చూ, శుద్ధము. 3. [చూ, వర్ణము. 6

నైల్యము. సం. వి అ. న.=నల్ల. నల్లఁదనము

నైవేద్యము సం. వి. అ న. రూ-నివేదనము. 1. నివేదింపఁదగినవస్తువు (దేవుని కారగింపఁబడినది), చూ, సమర్పణము; అం. 2: చూ, ఉపచారము. 1; 3 చూ, ఉపచారము. 2

నైషధము. అం. (దీనిని శ్రీహర్షుఁడు వ్రాసెను) చూ, కావ్యనాటకములు.

నైషధుఁడు. సం. వి అ పుం. నిషధుఁడు, నలచక్రవర్తి· చూ, రాజే. 1.

నైషాది. అం చూ, శుద్ధజాతులు (అంశములు.)

నైష్కికుఁడు. సం. వి అ. పుం: చూ, రూపాధ్యక్షుఁడు.

నైష్ఠికుఁడు సం విణ = చూ, నైట్టికసీల. 1.

నైష్ఠుర్యము. సం వి. అ. న. నిష్ఠురత్వము

నైసర్గికబలము. అం. షడ్బలములందొకటి. (శ-కు-బు-గు-శు-చం-రవులుఉత్తరోత్తరక్రమమున బలవంతులగుదురు.) ౧ రవి పూర్ణబలవంతుఁడు 1; ౨. చం.=రవికంటె 1/7 బలముతక్కువగలవాఁడు అనఁగా 1/1—1/7=6/7, 3. శు=చంద్రునికంటె 1/7 బలముతక్కువగలవాఁడు అనఁగా 6/7—1/7=5/7; ౪.గు=శుక్రునికంటె1/7బలముతక్కువగలవాఁడు అనఁగా 5/7—1/7=4/7, ౫. బు=గురునికంటె 1/7 బలముతక్కువగలవాఁడు అనఁగా 4/7-1/7=3/7; ౬. కు=బుధునికన్న 1/7 బలముతక్కువగలవాఁడు అనఁగా 3/7-1/7=2/7; ౭. శ=కుజునికన్న 1/7బలముతక్కువగలవాఁడు అనఁగా 2/7-1/7=1/7. చూ, షడ్బలము.

నైసర్గికము. సం. విణ. చూ, నైజము. 2.

నైస్త్రింశికుఁడు. సం. విణ· చూ, అసిహేతి.

నైస్పృహ్యము. సం వి. అ. న. ఇచ్ఛలేనితనము: చూ, వలవమి:

## నొ

నొంచె దే. పే్రి. నొవ్వఁజేయు భార. కర్ణ 1, ఆ. 192: చూ, నొగులుచు. 1, 2

నొక్కము. దే. వి. పెద్దసదాప*. చూ, సదాప

నొక్కు. దే వి 1. రూ-నొక్కుడు. అదుముడు వలనఁగలిగిన పల్లము. చూ, రంధ్రము. 1; 2. ముడుత. స్వా. 3, ఆ. 23: చూ, వలి. 2, స క్రి. 3. పేనుచేదుపు: కుక్కు-క్రుక్కు, చేదుపు; 4. పంటనొక్కు: చూ, మాకొను; 5. అదుము· చూ, పీసుకు. 1.

నొక్కుడు. దే వి: చూ, రూ-నొక్కు. 1.

నొక్కులు. దే వి. బ. పళులు చూ, వళి. 1.

నొగ దే. వి. చూ, యుగంధరము

నొగచివర. దే. వి: చూ, పంగలగుంజె.

నొగులు. దే. వి. 1. వికలమగుట; 2: చూ,రూ-నెగులు; 3: చూ, శోకము; అ. క్రి. 4:చూ, వైకల్యమగు. ఉ హరి. 3, ఆ.80; 5: చూ, నొచ్చె. 1, 6: చూ, నొచ్చె. 2.

నొగులుచె. దే. పే్రి. రూ-నొగుల్చు-నొంచె 1. నొగులఁజేయు, ఎడలించె; 2. నొప్పించె. చూ, హింసించె

నొగుల్చు దే. పే్రి. —పై—

నొచ్చిళ్ళు. దే. వి. బ. చొంగ: చూ, లాల.
నొచ్చు. దే. అ. క్రి. 1:చూ, వేసారు; 2. దారిద్ర్యాదులచే పీడనొందు: నొగులు.
నొచ్చుకొను. దే. అ. క్రి: చూ, నుఱుక్కు. 1.
నొచ్చుకోలు. దే. వి: చూ, విపరీతసారము. 1.
నొట్ట. వా. వి: చూ, రూ-నొష్ట "నొట్టమెక్క"
నొడలదొంతి. దే. వి: చూ, సంశయము (అప్రి)
నొడి. దే. వి: చూ, రూ-నుడి
నొడికాఁడు. దే. విశ: చూ, నుడువరి.
నొడికారము. దే. వి: చూ, రూ-నుడికారము. (మాట చమత్కారమునకు.-కళా. 8, అ. 55; మాటకు.-ఆం, భా. ప్ర. 110.)
నొడికారి. దే. విశ. (నొడికారము+ఇ): చూ, రూ-నుడువరి. ఉ, హరి. 4, అ. 155.
నొడుగు. దే. వి, స. క్రి: చూ, రూ-నుడుగు
నొడుచు. దే. స. క్రి. తప్పులుపట్టు.
నొడుపు. దే. వి. తప్పులుపట్టుట.
నొడువు. దే. వి, స. క్రి· చూ, రూ-నుడుగు.
నొప్పి. దే. వి. 1. బాధ: చూ, శోకము; 2:చూ, విపత్తు. జై. 7, అ.117; 3: చూ, శ్రమము 1
నొప్పించు. దే ప్రే: చూ, హింసించు
నొప్పిగుంటి. వా. వి· చూ, వ్యాధితుఁడు.
నొప్పియెత్తు వా. స క్రి· చూ, ఎత్తు. 28.
నొలి. వా. వి: చూ, శోకము.
నొల్లు. దే. స క్రి. 1. బిడ్డలు నోటవేళ్ళిడుకొని చేపరించు; వా. 2. గ్రహించు,నొల్లుకొను
నొవులు. వా. వి: చూ, నొలి.
నొవ్వి దే. వి. రూ-నొవ్వు. 1. వేదన: చూ, శ్రమము. 1;2. తెవులు. పంచ. నా. 1, అ. 408: చూ, రోగము. 1; 3· చూ, శోకము.
నొవ్వు. దే. వి.—పై—
నొసటిరొమ్ముశ. దే. వి. అరి: చూ, శల్యము. 1.
నొసలు. వై.వి.=నిటల. రూ-నెన్నొసలు.(దేశ్యమని శ.ర) 1. నుదురు:చూ,లలాటము; అం. 2: చూ, కళలుండుస్థలములు.
నొసలుబత్తుఁడు నోరుతోడేలు. జా. "ననఘునొసలు బత్తుఁడును నోరు తోఁడేల, టన్న రీతి దోఁచుచున్న దిపుడు" (వైజయంతీమాసము)
నొష్ట. వా వి.నుదురు:చూ,రూ-నొట్ట.(లలాటము)

## నో

నోఁచు. దే. స. క్రి. నోము. పాండు 2, అ. 30· చూ, వ్రతమాచరించు.
నోఁత. దే. వి నోఁచుట.
నోటికితాళముపేయుట. జా. మాటాడకుండఁజేయుట. "ఈపాటికి నోటికితాళము వేయ వచ్చును. " (ధర్మజరాజసూయము)
నోటిబీగము. దే. వి. దేవతాప్రార్థనకై దౌడల యందుపట్టుకొనెడు చాకపు లోహపుకమ్మి.
నోటీసు. వా. వి ప్రకటన.
నోటు. వా. వి. 1 బదులుపుచ్చుకొని వ్రాసి యిచ్చెడు ప్రామిస్సరీనోటు; 2. రూపాయలుగా మార్చుకొనెడు బ్యాంకినోటు; 3. జ్ఞాపకార్థము వ్రాసియుంచుకొనెడు రుక్కా. [గుటక·
నోటెఁడు. వా. వి: గుక్కెఁడు-గ్రుక్కెఁడు,
నోము. దే వి. 1 చూ, వ్రతము; స. క్రి. 2 చూ,నోఁచు;3. పోఁగొట్టు చూ,భంగించు.
నోయు. దే అ. క్రి. నొచ్చు· చూ, వేసారు.
నోరు దే. వి: చూ, వదనము. 1.
నోరుమెంగ. దే. విశ: చూ, మూఁగ. కళా. 3, అ. 238.
నోరుమెదల్పుట జా. మాటలాడుట. "బ్రహ్మయు నోరుమెదల్పలేని" పాండు. 3, అ. 151. "మిన్నకచేనసంకనోరు మెదపక" కళా. 3, అ. 238.

నోరూరు. దే. అ. క్రి. 1. రుచిగలవస్తువులను తినుకోరికచే నోటనీరూరు; 2. చూ, వాంఛించు. పా. 3. ఆ. 51.

నోరెత్తు. దే. అ. క్రి. మాటాడయత్నించు చూ, ఏకు. 23.

నోరోడక. జా. మాటాడ సందేహింపక. "అచ్చేట నోరోడకాయన రచ్చలో" (శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచన నైషధము)

నోవరి. దే. విణ: చూ, కొప్పిగుంటి.

నోవి. దే. వి: చూ, రూ-నొవ్వి. [267.

నోవు దే వి — ప్రై. — భార. ఉద్యో. 3, ఆ

## నౌ

నౌ. సం వి. ఔ. స్త్రీ. 1. ఓడ. (పదార్థములను గట్టుచు బొందించేవది) చూ, హోడము; దే. వి. (1): చూ, రూ-నవు-నవ్వు

నౌక. సం. వి. ఆ స్త్రీ.=నావ: చూ, నౌ. 1;

నౌకాశకట న్యాయము. పా. ఓడలు బండ్లగును. బండ్లోడలగునను రీతి.

నౌకాఖ్యము. అం: చూ, ఉత్తానకరణబంధములు.

నౌకాదండము. సం. వి. అ. పుం. ఓడనడపుగడ చూ, పీలి 2.

నౌకు. దే. వి: చూ, రూ-నవుకు.

నౌదుకొట్టు దే.అ.క్రి: చూ, రూ-నవుదుకొట్టు.

నౌబతు. హి. వి. మహారాజుల కోటముందు వాయించెడు వాద్యము. "ఢంకా నౌబతులు"

నౌరు. దే. విణ: చూ, రూ-నవురు.

## న్య

న్యంకువు. సం. వి. ఉ. పుం. 1. ఇఱ్ఱి (తెలుపంచే గొనిపోవునది): చూ, హరిణము.1; 2. ముని: చూ, సన్యాసి.

న్యక్కారము. సం. వి. అ. పుం: చూ, అవహేళనము.

న్యక్కృతి. సం. వి. ఇ. స్త్రీ. = పై.

న్యక్షము. సం. విణ. 1. అధమము; చూ, హీనము. 1; 2 చూ, సర్వము.

న్యక్షుఁడు. సం. విణ: చూ, హీనుఁడు.

న్యగ్రోధము. సం. వి. అ. పుం. 1. మఱ్ఱి చూ, వటము 3; 2 చూ, శమి*, 3 శార: చూ, వ్యామము. [రావి, మేడి(5).

న్యగ్రోధాదిగణము. అం. మఱ్ఱి, మామిడి, జువ్వి,

న్యగ్రోధి. సం. వి: ఈ. స్త్రీ. చూ, భల్లాతకి*

న్యర్బుదము. సం. వి. అ. న. 1. పదియర్బుదముల సంఖ్య: చూ, సంఖ్య: 1; విణ. 2. పదియర్బుదముల సంఖ్యగలది: [ప్రాస్యాతకము. 2.

న్యస్తము. సం. విణ. ఉంచబడినది: చూ,

## న్యా

న్యాదము. సం. వి. అ. పుం. కుడుపు చూ, పాపాటు.

న్యాయము. సం. వి. అ. పుం =నాయము. 1. తగవు, న్యాయబుద్ధి: చూ, సత్యము. 1; 2. స్వధర్మత్యాగము వలన చలింపకుండుట: చూ, సత్యము. 1; అం. 3: చూ, తర్కము. 5; ఐ. 4: చూ, న్యాయములు.

న్యాయములు. అం. న్యాయములుగా పోలిక. (ఇవి సమయోచితములుగా గొన్నిచోట్ల బ్రయోగించినచోఁ గావ్యము శోభాయమానముగా నుండును.) ఉదా.—అంకురబీజన్యాయము. మొ. (గ్రంథవిస్తరభీతిచే న్యాయములన్నిటి నిచట నుదాహరింపలేదు.)

న్యాయశాస్త్రము. శా. న్యాయవిశేషగా దృష్టాంతము. దీనివలనఁ దెలియఁబడని గవయాదిపదార్థములను, తెలియఁబడిన గోవు మొదలగు పదార్థములతోడి పోలికచే వీటివంటివే గవయాది పదార్థములని చెప్పి తెలుపవచ్చును.

ము. 1; దే. వి. (1) పాలు. జై. 4, ఆ. 79.: చూ, స్తన్యము. [(రూ-పంకేరుహము.)

పంకరుహము. సం. వి. అ. న: చూ, పంకజము

పంకా. వా. వి. కఱ్ఱచెక్కకు గుడ్డనతికి త్రేలఁగట్టిలాగెడు రొమ్ముకానొక పెద్దవిసనఁగఱ్ఱ. "పంకాలాగుము." [బురద.

పంకి. నై. వి.=పంకము. య 5, ఆ. 12: చూ,

పంకించు. వై. అ. క్రి. 1.=కంపః: చూ, సలించు. జై. 3, ఆ. 40; దే. స. క్రి. 2 పట్టించు జై. 6, ఆ. 85; పాండు. 2, ఆ. 41. చూ, పూయు.

పంకిణి. వా. వి. పరిమళద్రవ్యములుంచెడు పాత్రిము: చూ, పాత్రిము. 6.

పంకిలమగు. మి అ. క్రి· చూ, అసలుకొను.

పంకిలము. సం. విశే. బురదగలది (దేశము): చూ, సీమ. 1.

పంకెన. దే. వి. తడి: చూ, స్తేమము.

పంకేజము. సం వి. అ. న. చూ, రూ-పంకజము. [పంకరుహము.

పంకేరుహము. సం. వి. అ న: చూ, రూ-

పంక్తి. సం వి. ఇ. స్త్రీ. 1.=బంతి: చూ, శ్రేణి. 1; 2=పది· చూ, పది; పా. 3. పదిప ఛందస్సునందుఁబుట్టినవృత్తము. భ-భ-స-గ 7: చూ, వృత్తము 1; 4 పంచమఛందస్సునందుఁబుట్టినవృత్తము. ఒకభగణము రెండు గురువులుగలది: చూ, వృత్తము. 1

పంక్తికంఠుఁడు. సం. వి. అ. పుం. (పంక్తికంధరుఁడు) 1. వరుసగాఁగంఠములు గలవాఁడు; 2. రావణుఁడు: చూ, రాక్షసుఁడు. 1

పంక్తికంధరుఁడు. సం. వి అ. పుం.—పై—

పంగ. వై. వి. 1. రూ-ప్రగ్గ, పలవకొమ్మ, పాయగొమ్మ. స్వా. 4, ఆ. 21: చూ, శాఖ; వా. 2. ఎడముగాచీఁపఁబడినరెండు కాళ్ళనడిమిభాగము. (అంగవంటిది.)

పంగటి. వై. విశే. ఎడముగలది.

పంగటించు. వై స. క్రి. ఎడముగాచాఁచు.

పంగటికాళ్లవాఁడు. ద్వ. వి: చూ, సంజ్ఞావు.

పంగటికాళ్లు. వా. వి. బ· చూ, ముడికాళ్ళు.

పంగనామము. ద్వ. వి. నడుమఎడముగలుగఁ పంగవలెతీర్చినతిరుమణి: చూ, బొట్టు. 1.

పంగము. వై. వి. దేవబ్రాహ్మణవృత్తులమీఁద దొరతనమువారు తీసెడు చతుర్థాంశమైన కప్పము: చూ, శిస్తు. 1.

పంగలగుంజె ద్వ. వి. 1: చూ, ఇలుకుమ్రాను; 2: కోడిపీఁట, నొగచివర. (సం. ప).—అనుకర్షణము-అనుకర్షము.

పంగిడి. దే వి. (రూ-పంగిడీ-పంగిణీ, పంగెన) ఓదము· చూ, వారి. 6.

పంగిడీ. దే. వి.—పై.—

పంగిడీయెత్తు. జా మోసపుటెత్తు.

పంగు దే. వి. 1· చూ, వెలుపు; వై. వి. 2.=భగః: చూ, భగము. 12.

పంగువు. సం. వి. ఉ. పుం. 1. శని· చూ, రాహువు 3; విశే. 2: చూ, కలి. 4.

పంగెన. దే. వి· చూ, రూ-పంగిడి.

పంగ్వంధన్యాయము. పా. ఒకఁడుగ్రుడ్డి. మఱియొకఁడుకుంటి. కుంటివానిని గ్రుడ్డివాఁడు మోచికొనిపోవుచుండెను కుంటివాఁడు మార్గము చెప్పుచుండెను. పరస్పరలాభమునకై పరస్పర సాహాయ్యము.

పంచకము. సం. వి. అ. న. 1. యుద్ధభూమి: చూ, భూమి. 1; న. 2. నాలుగుకోకటి: ఇంద్రియము; (తె ప.)—అయిదు-ఐదు, అరవది, ఏను, చేవ్వంచే-చావంచే-చావంచి; అం. 3. (అయిదు అంకములుగలవి) అంగములు, అగ్నులు (గార్హపత్యాది), అగ్నులు (పూర్వాగ్న్యాది), అమృతములు, అలంకారములు, అవయవములు (ప్రతిజ్ఞాది), అవస్థలు,

అశ్వాధారలు, ఆకాశములు, ఆరామములు, ఆసనములు, ఇంద్రియములు, ఇంద్రియవిషయములు, ఉత్తరవాదములు, ఉపచారములు, ఉపవాయువులు, కన్యకలు, కన్యాదానాంగములు, కర్మేంద్రియములు, కల్పవృక్షములు, కాలములు, కావ్యములు, కృతపాతులు, కోలములు, కోశములు, క్రియలు, క్షారములు, క్షేత్రములు, ఖండములు, గంగలు, గవ్యములు, గురుమూలములు, గౌడులు, జ్యోతిర్లింగములు, తంత్రములు, తన్మాత్రలు, తాళకళలు, తాళజాతులు, తిక్తకగణము, తృణములు, దినాంగములు, దేవతలు, ద్రావిడులు, నాటకసంధులు, పంచాతురి, పంచసూత్రములు, పర్వతములు, పాకయజ్ఞములు, పితలు, పుత్రులు, ప్రకరణములు, ప్రాణములు, బౌద్ధశాస్త్రస్కంధములు, భక్ష్యములు, భూతములు, మన్మథబాణములు, మహాపాతకములు, మహాయజ్ఞములు, మహావాద్యములు, మాతలు, మార్గములు, ముఖములు (శివునివి), ముద్రలు, యానములు, రంగులు, లఘుమూలము, లవణములు, లోహములు, వర్ణములు, విలుకాని స్థానములు, విష్ణ్వాయుధములు, శస్త్రలు, శిఖలు, శిల్పలు, శివాననములు, సంస్కారములు, సమాధులు, సామములు, సూత్రములు, సోమయజ్ఞములు, హవిర్యజ్ఞములు, హేత్వాభాసము ఇత్యాది(సందర్భానుసారముగ ఇందుగల శబ్దములకు "పంచ" అనునది మొదట చేర్చి యుచ్చరించవలెను.)

పంచకరహితము. పా తిథివారనక్షత్రలగ్నముల సంఖ్యను కలిపి 9 చే భాగింపఁగా 1-2-4-6-8 సంఖ్యలు మిగులకుండుట.

పంచకళ్యాణము అం: చూ, చిత్రవర్ణములు

పంచకోలములు. అం. శొంఠి, చవ్యము, మోడి, పిప్పళ్లు, చిత్రమూలము. (5)

పంచక్రియలు. అం. ఉక్తి, ఆదానము, గమనము, విసర్గము, ఆనందకము. (5) [గ్రా

పంచక్షేత్రములు. అం. శ్రీశైలము, కాశి, కేదారము, కాళహస్తి, పట్టిసము. (5)

పంచగవ్యము. అం. ఆవుపేడ, ఆవుపంచితము, ఆవుపాలు, ఆవుపెరుఁగు, ఆవునెయ్యి (5)

పంచగూఢము. సం వి. అ. పుం. తాఁ చేలు. చూ, వృత్తము. 4. (ఇట్లుపంచగుప్తము.)

పంచగౌడులు. అం. ఉత్కల, మైథుల, కనోజ, కాన్యకుబ్జ, సాగస్వతులు (5). (చూ, బ్రాహ్మణులు.)

పంచచామరము. పా. షోడశఛందోద్భవవృత్తము జ-ర-జ-ర-జ-గ. 10: చూ, వృత్తము. 1.

పంచజనుఁడు. సం. వి. అ. పుం: చూ, మనుష్యుఁడు. [బుద్ధుఁడు.

పంచజ్ఞానుఁడు. సం. వి. అ పుం: చూ,

పంచతంత్రము పా. (ఇదివిష్ణుశర్మకృతము): చూ, కావ్యనాటకములు. [రస, గంధములు(5)

పంచతన్మాత్రలు. అం. శబ్ద, స్పర్శ, రూప,

పంచతిక్తగణము. అం. మారేడుపిందెలు, పట్టివేరు, దనియాలు, శుంఠి, తుంగముస్తెలు (5)

పంచత్వము సం. వి అ. న 1· చూ, మరణము; 2. పంచభావము.

పంచదశ. సం. వి. ఆ స్త్రీ 1.=భద్ర. పదునైదు; 2. చూ, వృత్తము. 1.

పంచదశప్రకరణములు. అం. ప్రత్యక్తత్త్వ, పంచభూత, పంచకోశ, ద్వైత, మహావాక్యవివేకములు; చిత్ర, తృప్తి, కూటస్థ, ధ్యాన, నాటకదీపములు; బ్రహ్మసందమందు యోగానందము, బ్రహ్మానందమందు ఆత్మానందము, అద్వైతానందము, విద్యానందము, విషయానందము. (15)

పంచదశి. సం. వి. ఈ. స్త్రీ. 1. అమవస: చూ, సూర్యేందుసంగమము; 2: చూ, పున్నమ.

పంచసరము. సం. వి. అ. పుం =బన్నసరి: చూ, భూషణము. 2. [చూ, శర్కర. 1

పంచసారము. సం. వి. అ. పుం.=పంచేదార:

పంచస్వరయుక్తరాగము. అం. (ఔడవము): చూ, స్వరము. 2.

పంచాంగము. సం. వి. అ. న. 1.(తిథి, వారము, నక్షత్రము, కరణము, యోగములతెలిపెడి పాత్రము):చూ, అంగము. 8; పుం. 2. తాఁబేలు: చూ, కృత్తము. 4; 3. ఒకానొకగుఱ్ఱము:చూ, హయము; 4. చూ, హాణిగలు.

పంచాంగములు. అం. చూ, పంచాంగము. 1

పంచాంగుప్తీతము. సం. వి. అ. పుం: చూ, పంచభద్రము. [చూ, వ్యడంబకము.

పంచాంగులము. సం వి. అ. పుం. ఆముదము*:

పంచాక్షరీ మహామంత్రము. అం. న-మ-శి-వా-య(లేక)న-మ-శి-వ-య: చూ,మంత్రము.1

పంచాణుఁడు. సం. వి. అ. పుం.=పంచాణపువాఁడు. శిల్పి: చూ, స్వర్ణకారుఁడు.

పంచాదశ. అం. సంఖ్యాబద్ధమందొకటి: చూ, తిత్రికము. 7. [స్యము.

పంచాననము. సం. వి. అ. పుం: చూ, పంచా

పంచాననుఁడు. సం. వి. అ. పుం·చూ, శివుఁడు.

పంచామృతములు. అం. 1. చూ, తంత్రములు; 2· చూ, అమృతము. 8 (వీనిమిశ్రము)

పంచాయతి వా. వి· చూ, అయిదుగురికూటమి.

పంచార్చి. సం వి. స్. స్త్రీ. బుధుఁడు :చూ, రాహువు. 2. [స్వరము 2

పంచాలి. సం. వి. ఈ. స్త్రీ.=పంజేళము: చూ,

పంచావటము. సం. వి. అ. పుం. ఉరస్కటము, బాలురకట్టుబట్ట: చూ, వస్త్రము.

పంచావయవములు. అం. ప్రతిజ్ఞ, హేతువు, ఉదాహరణము, ఉపనయము,నిగమనము.(5)

పంచాస్యము సం. వి. అ. పుం. తెలనోటిమెక ము: చూ, సింహము



పంచాస్యుఁడు. సం. వి. అ. పుం: చూ, పంచముఖుఁడు.

పంచితము. దే. వి. అపుడుచ్చే:చూ,మూత్రము.

పంచితిలు. దే అ. క్రి. రూ-పంచితిల్లు గోత్రమూత్రము విడుచే

పంచియ. వై. వి. రూ-పంచె. కట్టుకొనుపెద్ద పంచె; కట్టుకొనుచిన్నపంచె; అంగవస్త్రము: చూ, వస్త్రము

పంచివేఁత. దే. వి. 1. ఒక్కొక్కనిపై పెరమించినచేంగా;వా 2.పంచిపెట్టుట [గాఁడు.

పంచేషువు. సం. వి. ఉ. పుం: చూ, మన్మ

పంచోత్తరవాదము. అం. సామాన్యనిరుక్తి, సవ్యభిచారము, సత్ప్రతిపక్షము, అసిద్ధము, బాధ (5)

పంచే. వై. వి.=పార్శ్వ-ప్రాంతః. రూ-పంచే పాక-పంచేపాళి-పంచోడి) ఇంటిప్రక్క ప్రదేశము, ఇంటిసక్క వంచి కట్టినకట్టడము (అనియు). ఉ పారి 4, అ. 270. చూ, సదనము. 1; 2. దగ్గఱ: చూ, సమీపము. 1; వా. 3· చూ, రూ-పంచియ; విణ. 4. అధికము· చూ, హెచ్చు. 1.

పంచేకము. దే వి. 1. గుఱ్ఱముయొక్క పశ్చాత్ప్రదేశము. సా 1, అ. 31·చూ, హయము; వై వి. 2· అయిదుతూములు, ఏఁదుము, ఏనుము. (20 కుంచములు)

పంచేకరపాటులు ద్వ. వి బ అత్యధిక దుఃఖములు. కాశీ 4, అ 18 చూ, శోకము.

పంచగౌడులు. అం. "సారస్వతాః కన్యకుబ్జా గౌడాఉత్కలమైథిలాః। గౌడాః పంచవిధాః ప్రోక్తావింధ్యాదుత్తరవాసినః" సారస్వతులు, కన్యాకుబ్జులు, గౌడులు, ఉత్కళులు, మైథిలులు: చూ, బ్రాహ్మణులు

పంచేదార. వై. వి.=పంచసారః: చూ, శర్కర. 1. [ఘుఁడు.

పంచేదారతింపి తేజికాతు ద్వ. వి: చూ, మన్మ

పంచద్రావిడులు. అం. "మహారాష్ట్రాన్ధ్రద్రవిడాః కర్ణాటాశ్చైవఘూర్జరాః । ద్రావిడాః పంచ ధాపోక్తా విన్ధ్యదక్షిణవాసినః" మహారాష్ట్రులు, ఆంధ్రులు, ద్రావిడులు, కర్ణాటకులు, ఘూర్జరులు: చూ, బ్రాహ్మణులు.

పంచేపాళ. ద్వ. వి: చూ, పంచె. 1

పంచేపాళి. ద్వ. వి —పై—

పంచేబంగాళము. వై. విణ. దూరము. కాశీ. 1, అ. 122: చూ, విప్రకృష్టము.

పంచేపట్టె. వై. వి. అయిదుపట్టెలు. (రుక్మాంగదచరిత్ర. 1, అ)

పంచేవన్నియ. వై. వి.=పంచవర్ణః రూ-పంచేవన్నె: చూ, వర్ణము. 6.

పంచేవన్నెచిలుకలు: వా. వి. బ: చూ, బాణసంచు

పంచోణంపువాఁడు వై. వి.=: చూ, పంచాననుఁడు. (రూ-పంచోణమువాఁడు-పంచోణపువాఁడు-పంచోణంబువాఁడు) (ద్వయమని కొందఱు.) [ము. 1.

పంచోణము. వై. వి.=పంచాననః చూ, శిల్ప

పంచోడి. ద్వ. వి: చూ, పంచె 1. [ఘూరతి.

పంచోరతి వై. వి.=పంచరాత్రికః చూ, అతి

పంచోరము. వై. వి. 1. అతిశయము: చూ, హెచ్చు. 2; 2: చూ, వ్యాపనము

పంచోరించు వై. అ. క్రి. 1· చూ, వ్యాపించు పాండు. 3, అ. 179; 2. అతిశయించు కాశీ. 6, అ. 125: చూ, సందడించు

పంచు జే. స. క్రి. రూ-పనుచు. 1. అజ్ఞాపించు. భార. ఆది. 1, అ 30: చూ, సెలవిచ్చు; 2. పుచ్చు: చూ, సెలవిచ్చు; 3: చూ, భాగించు, 4· చూ, పంపు. 11.

పంచె. వై. వి: చూ, రూ-పంచియ.

పంజరము. సం. వి. అ. న. 1.=పంజేరము. చూ, సదనము. 1; 2. గవ్వసె: చూ, వస్త్రము; పుం. 3: చూ, శరీరము; 4. శరీరముయొక్క యెముకలగూఁడు: చూ, కల్యము. 1.

పంజి. దే. వి: చూ, పంగము.

పంజిక. సం. వి. అ. స్త్రీ. 1: చూ, పింజవము;. వా. 2: చూ, పింజిక. [చూ, పాంజిక.

పంజియ. వై. వి.=భార్గి. రూ-పంజె.బాగంగి*:

పంజికరుఁడు. సం. వి. అ. పుం. కరణము: చూ, సంప్రతి.

పంజె. వై. వి. 1: చూ, రూ-పంజియ.*;- 2.దారిద్ర్యము: చూ, బీదరము.1;3.దరిద్రుఁడు: చూ, కాతుఁడు. 1.

పంజెతనము. వై. వి: చూ, పంజె. 2.

పంజే. వై. వి: చూ, అవిశ. రామా. 4, అ. 168.

పంజేన. దే. వి. నిగరమైనది. (అప్రి)

పంజేరము. వై. వి.=: చూ, పంజరము. 1.అచ్చ. అ, కాం. 90. [చూ, స్వరము. 2.

పంజేళము. వై. వి.=పంచాలి. కాశీ.6, అ. 265:

పంజోయి. దే. వి. అగ్గిబోడి. హంస. 3, అ.28: చూ, స్నేహము.

పంజో. దే వి. 1. దివటీ· చూ, స్నేహము; 2: చూ, పంజోయి; 3.విడవలిలోనగువానికట్ట. రామా. 5, అ. 41. చూ, విడవలి; 4. విడవలిలోనగువాని గంట: చూ, విడవలి.

పంజోలకమ్మలు. దే. వి. బ. రత్నములుచెక్కిన కమ్మలు. ఉ, రా. 3, అ. 81: చూ, భూషణము. 2.

పంట. దే. వి. 1. పండుట;2. కృషి: చూ, వ్యవసాయము; 3. చూ, ఫలము. 1;4. వరిపైరు: చూ, సస్యము. 1. [పంటరెడ్డి.: చూ, రెడ్డి.

పంటకాఁపు. దే వి. 1: చూ, వ్యవసాయి; 2.

పంటపొలము. వా. వి. 1. పండిననేల: చూ, భూమి. 1,2. పండెడునేల. చూ, భూమి. 1

-పంటరెడ్డి. దే. వి: చూ, పంటకాఁపు. 2.

-పంటవలఁతి. దే. వి. నేల: చూ, భూమి. 1. పా. 1, ఆ. 24. (ఇట్లు పంటచేలి, పంటపొలంతి.)

-పంటవలఁతితోఁదికోడలు. గే. వి: చూ, లక్ష్మి. అం. పదా. పుర. 14

-పంటసాల. ద్వ. వి. (ధాన్యాదులుపోసెడుగాదె, పాఁతఱ, పురి, కొట్టు, పాణక, బోరము లోనగు వానిస్థానము; మఱియు ధనాదికము దాఁచే కొనెడు బొక్కసములోనగువాని స్థానము): తద్వి.- గాదెకు.__కణఁజము, గరిసె-గరిసె, గరిసె, గాదె-గాద, గుమ్మి. (సం. వ.)__ కంతువు, కుశూలము-కుసూలము, కృదరము, కోష్ఠము, వ్రీహ్యాగారము; పాఁతఱకు.__ కణఁజము, దూబ, పాఁతఱ. (సం. వ) __ గుప్తి; పురికి.__కూటు, పురి; పాణకకు.- కుమి-కుమ్మి, కూటము, కొట్టె, గుమి, పాడక-పాణక, బొట్ట; (సం. వ).__అవలలము; బోరమునకు.__బోరము; వడ్లు ఉప్పు లోనగు రాసులుండెడుచోటునకు.__కొటారము_కొటారు-కొట్టరువు, గొదాము, పంటసాల; బొక్కసమునకు.__ ఉగ్రాణము, ఖజానా, పంటసాల, బండరము-బండారము-బండారు-బండరువు, బొక్కసము, ములుగు (సం. వ).__కోశము-కోషము, గంజము, భండారము, భాండాగారము, సాముగ్రిల కొట్టునకు.__ఉగ్రాణము, కొట్టడి, కొట్టము-కొట్టాము-కొట్టు-కొఠారు, గిడ్డంగి. (సం. వ).__కోశము-కోషము-కోష్ఠము, కోష్ఠాగారము. (మిగతవిశేషాదులకు చూ, "సదనము. 1.")

-పంటి. దే. వి: చూ, రూ_పవఁటి.

-పంటించే. దే. అ. క్రి. 1. జోగు చేయు. భాగ. 10, స్కం. పూ. 124: చూ, వివరించే; 2: చూ, సంభ్రమించే. [అర్బుదము.

-పంటిరేవులు. వా. వి: పుప్పి-పుప్పి.(సం.వ).-

పంటియ. దే. వి. రూ-పంటె-పరఁటె-పంటెకోల. పంటెకఱ్ఱ. పాలెవాఁడు నూకుచే త్రైడుసాధనము: చూ, మగ్గము. 1.

పంటె. దే. వి.__పై.__

పంటెకఱ్ఱ. దే. వి.__పై.__

పంటెకోల. దే. వి.__పై.__

పంట్రి. దే. వి. చిల్లులుగల అలుఁగులు మూఁడు నాలుగుగలకఱ్ఱ: పంట్రికోల, బల్లగోల.

పంట్రికోల. దే. వి.__పై.__స్వా. 4, ఆ. 54.

పంట్రించే. దే. స. క్రి. పంట్రితోఁజొడుచే.

పండ. సం. వి. అ. (స్త్రీ). యథార్థమెఱిఁగిన బుద్ధి: చూ, బుద్ధి.

పండగ. వా. వి: చూ, రూ-పండుగ.

పండాకు. వా. వి. రూ-పండుటాకు చూ, సాపుగాకు.

పండాబ్రాహ్మణులు. అం: చూ, ఉత్కళులు. (ఉత్కళదేశ దేవాలయములలో పూజారులగనుందురు. సామవేదులు, శుక్లయజుర్వేదులుగూడనున్నారు.): చూ, బ్రాహ్మణులు.

పండాలు. దే. వి బ (పండావారు) జగన్నాథ ప్రాంతవాసులు.

పండించే వా. స. క్రి. 1: చూ, పంచించే; 2. పండఁబాఱిన కాయలు కావువేయు; 3. శవమునుకాల్చు; 4. ఆటలో గెలుపును పొందించే [దలఁచుకొనువాఁడు.

పండితంమన్యుఁడు. పా తనను పండితునిగాఁ

పండితపుత్రుఁడు. పా. పండితునికొడుకు. (కుంఠియని వాడుక.)

పండితబ్రాహ్మణులు అం. 1: చూ, నేపాళదేశపు బ్రాహ్మణులు; 2: చూ, కపూరియె బ్రాహ్మణులు.

పండితరాయశతకము. అం. (పీవిని పండితరాయఁడువ్రాసెను)· చూ, కావ్యనాటకములు.

పండితుఁడు. సం. వి. అ. పుం.=పంతులు. 1: చూ, విద్వాంసుఁడు; 2. వ్యాపారి.

పండు. దే. వి. 1: చూ, ఫలము. 1; విణ. 2 పండినది; వా. 3. జయము; 4. గెలుపు; అ. క్రి. 5: చూ, ఫలించే; 6: చూ, శయనించే పంచ. వేం. 1, ఆ. 218. [డుఁడు.

పండుఁడు. సం. వి. అ. పుం.=పేడి: చూ, షం

పండుకొను. దే. అ. క్రి: చూ, శయనించే

పండుగ. దే. వి. (రూ-పండగ-పండుగు-పండువ-పండువు) 1: చూ, సంతోషము; 2. చూ, సంబరము; 3. సంక్రాంతిలోనగు పండుగ: చూ, సంబరము.

పండుగలు. అం సంవత్సరాదిపాడ్యమి, భానువిదియ, అక్షతృతీయ, నాగులచవితి, ఋషిపంచమి, సుబ్రహ్మణ్యషష్ఠి, రథసప్తమి, కృష్ణాష్టమి, శ్రీరామనవమి, విజయదశమి, భీష్మయేకాదశి, క్షీరాబ్ధిద్వాదశి, కనితిృయోదశి, అనంతపద్మనాభచతుర్దశి, వ్యాసపౌర్ణమి, దీపావళీ అమావాస్య, సంక్రాంతి ఇత్యాది.

పండుగు దే వి: చూ, రూ-పండుగ. (మూ.]

పండుచేఁప దే. వి. ఝషము చూ, మత్స్య

పండుటాకు. వా. వి: చూ, రూ_పండాకు

పండురతీబుడంట. ద్వ. వి చిలుక: చూ, శుకము. వేం. ఆం 99.

పండువ. దే. వి· చూ, రూ-పండుగ.

పండుపంటికాఁపురము. జా. సమస్తసంపదలతో నిండియున్న కాఁపురము.

పండువు. దే వి· చూ, రూ-పండుగ.

పండువెన్నెల. ద్వ వి. పూర్ణచంద్రిక· చూ, వెన్నెల. [పుంజో· చూ, పుంజో.

పండెట్టది. ద్వ. వి. ఒకరకము పందెపుకోడి

పండేరము. వై. వి.=గత్స్య: చూ, భత్స్యము సా 1, ఆ. 23.

పండ్రెండు. ద్వ. స. (పది+రెండు): చూ, ముచ్చొకము. [లము.

పండ్లపాఁచి. వా. వి. దంతమలము: చూ, కమ

పండ్లమ్రాఁకు. దే. వి. రూ-పండ్లమ్రాను 1. చేలయందుగల పైరులోని గాదముపోవునట్లుదున్నెడుసాధనము; 2: అవంధ్య, ఫలేగ్రహి.

పండ్లమ్రాను. వా. వి.—వై.—

పండ్లుకొఱుకుట. జా. అధికముగకోపపడుట. "పాపితుంబురుఁడాయంచోఁ బండ్లుకొఱుకుకొంచే." (కళాపూర్ణోదయము.)

పంతకాఁడు. ద్వ. విణ. (పంతము+కాఁడు) 1. పోటీచేయువాఁడు: పోటిగాఁడు; 2. ప్రతిజ్ఞకలవాఁడు; 3. పౌరుషముగలవాఁడు.

పంతగించే. వై. అ. క్రి. 1:చూ, పోటీచేయు; 2. ప్రతిజ్ఞచేయు: పట్టు, పట్టుపట్టు; 3.చూ, సెలవిచ్చు.

పంతము వై. వి. 1.=స్పర్ధా. రూ-పంతు. ఉ, హరి. 5, ఆ. 178· చూ, స్పర్ధ. 4; 2. పౌరుషము. ఉ, హరి. 3, ఆ. 47: చూ, శక్తి. 1; 3. రీతి: చూ, విధము 1, 4. పోటి కళా. 1, ఆ. 146· చూ, స్పర్ధ. 1.

పంతు. వై. వి. 1.=స్పర్ధా. చూ, రూ-పంతము. 1; దే. వి. 2. మేలిమి: చూ, హెచ్చు. 1; విణ. 3. మేలు:చూ, శుభము. 1. [స్త్రీ

పంతులమ్మ. వా. వి. ఉపాధ్యాయిని. చూ,

పంతులు. వై. వి. బ.=పండిత (దేశ్యమని శ.ర) 1 అయగారు- అయవారు- అయ్యగారు- అయ్యవారు, ఒజ్జ- ఓజే, చేదువులయ్య, ఠాకురు. (సం. ప.)—ఇజ్య, ఉపాధ్యాయుఁడు, కలాదుఁడు, గురువు, తీర్థము, తీర్థుఁడు, దేశికుఁడు, ద్రోణుఁడు; తద్వి—నాట్యోపాధ్యాయుఁడు.—నట్టువొజ్జ; (మిగతవానికి చూ, "సూరాచార్యుఁడు."); 2. బ్రాహ్మణులలోగొప్ప యుద్యోగస్థులకును, లౌక్యులకును, నియోగులులోనగువారికినిపూజ్యవాచకము. (దేశ్యమని శ. ర)

కా౫:సర్వదుంబాలా; కా౬: సికత, సైకతము. (తె).—ఇసుకదిన్నియ—ఇసుకదిన్నె, ఇసుకదిబ్బ, ఇసుకనేల; కా౭. స్థండిలము కా౮ వాల్కు. కా౯ హస్తినిఖము, మాలకము (తె) -తిన్నె,దిబ్బ. (మిగతవానికి "చూ,హరిప్రియ 2")(ఇందలి పదముల అర్థవివరణాదులను శ్లో రికాపదములకడఁజూడుము. మఱియు ఇందుగలశబ్దములుకొన్ని "ఒకానొకచోటు" అను నర్థమందుఁగూడ వర్తించును· చూ, స్థానము. 1 ); 2. చోటు: చూ, స్థానము. 1; అం 3 చూ, దానములు, 4:చూ,దిశలు.

భూమిక. సం పి. ఆ. స్త్రీ 1. మాఱువేషము· చూ, వేషము. 2; 2. రచన చూ, విషయసూచిక; 3 ౼బూమె కపటము చూ, నూత్కృము. 2

భూమికర్కారువు. సం. వి ఉ పుం. నేలగుమ్మడి* (ఇదె నల్లనేల గుమ్మడి) చూ, సర్వతోభద్ర. [౫*: చూ, సంపఁగి

భూమిచంపకము సం. వి అ. పుం. నేలసంపెఁ

భూమిజ. సం. వి ఆ స్త్రీ. 1 సీత, శ్రీరామునిభార్య. చూ, భార్య, వా. 2 చూ, నాఁగటిచాలు;వా 3 చూ, పాశ్రిదిని (నది)

భూమిపరిధానహేతుకము. అం: చూ, శతృవుతోడిసంధులు.

భూమిజంబుక. సం వి. ఆ స్త్రీ 1· చూ, నేలనేరేడు. *; 2: చూ, నారింజ*.

భూమిజంబువు సం వి ఉ పుం· చూ, నేలనేరేడు. *

భూమిజుఁడు. సం. వి అ. పుం. 1. అంగారకుఁడు: చూ, రాహువు. 2, 2. నరకాసురుఁడు: చూ, మహీసుతుఁడు.

భూమిస్పృశుఁడు. సం. వి. శ. పుం. 1. కోమటి: చూ, వైశ్యుఁడు; 2: చూ,మనుష్యుఁడు

భూమ్యాలకి. సం. వి. ఈ. స్త్రీ. నేలయుసిరిక.

చూ, శివ. 4. [హోరాళము.

భూయస్సు. సం. విణ. (స్). అధికము: చూ,

భూయిష్ఠము. సం. విణ —పై.—

భూరి. సం. వి. ఇ. న. 1. బంగారు: చూ, లోహము. 1; విణ 2· చూ, భూయస్సు; అం. 3 చూ, సంఖ్యాభేదములు.

భూరిఫేన సం. వి. ఆ. స్త్రీ చూ,సంబరేను *.

భూరిమాయము. సం. వి. అ. పుం. నక్క: చూ సృగాలము.

భూరిమాయువు. సం. వి. ఉ. పుం —పై.—

భూరిరంధ్రము. సం. వి. అ. పుం. అట్టు చూ, భక్ష్యము [చూ, హస్తిని.

భూరుండి సం. వి ఈ. స్త్రీ. గురుగు *·

భూరుహము. సం. వి. అ. పుం పుడమిపుట్టు: చూ, వృక్షము [చూ, లేఖనము 3.

భూర్జపత్రము. సం వి అ పుం = బుజేపత్రి*:

భూర్జము. సం వి అ. పుం.—పై.—

భూలింగశకునిన్యాయము. పా తానొకరికిఁగూడదని చెప్పినకార్యము తానే చేయుననుగీతి

భూలోకము. సం. వి. అ పుం. 1. ప్రపంచము. చూ, లోకము. 1, అం 2. చూ, ఊర్ధ్వలోకములు. (చూ, భూగోళము.)

భూవరుఁడు సం. వి అ పుం. పుడమిఱేఁడు: చూ, రాజు. 1. [కువలయము. 3.

భూవలయము. సం. వి. అ. పుం, న· చూ,

భూశయ్య సం. వి ఆ. స్త్రీ చూ, నేలపడక.

భూష సం. వి. అ. స్త్రీ: చూ, భూషణము.2.

భూషణధ్వని. సం. వి. ఇ. స్త్రీ. అఘ్రాతము: చూ, స్వరము. 2.

భూషణము. సం. వి. అ. న. 1. అలంకరణము: చూ,భూషణము.2; 2:అ, అమ్. అంకము, అట్టము, అలంకారము, అలంకృతి, అలంక్రియ, అవలేపము, అకల్పము, అబంధము,

ఆబద్ధము, ఆభరణము, ఋ, కందళము, కలాపము, జ, నేపథ్యము—నైపథ్యము, పరిష్కారము, పరిష్కృతి, ప్రతికర్మము, ప్రతిసరము, ప్రసాధనము, భాండము భూష, మండనము, మండము, లలామము, విభూషణము, వేషము, శ్రీ (అవ్య) — అలము, అక్ (తె) - ఒడమి—ఒడమె, ఒప్పిదము, కయిసేత—కైసేత, గోవ్రులు, చిన్నెము, చిన్నెపువ్వు, చిన్నెపూతెకు, తొడవు—తొడుపు—తొడుగు—తొడ్గు, వగ, సీటు, పాటన, మిన్న, రవణము, వన్నియ—వన్నె, వేసము, సొమ్ము, హావణిక (మిగతవానికి "చూ, హావణిక 2"), తద్విశేషములు — ౧. అశ్వాభరణము, ఆవానము, గండము, భాండము (తె) —గుజ్జుపుతొడవు; ౨ (తె)--గణేము; ౩. గ్రింకి; ౪ (తె) — తిరుకాపు; ౫. పరిపాదనము. (తె).—పసదనము, ౬. కంఠభూషలు —(౧) (తె) -అడ్డిగలు, (౨) (తె)—అటిడా - అటికు, (౩) అ, ఉత్సాహము, కంఠసూత్రము, మంగళసూత్రము, శతమానము, సూత్రితంతువు. (తె).— తాళి, తాళిబొట్టు, పుస్తె, బొట్టు, బొట్టుదారము, మినుకు, (౪) (తె)-ఉత్తండము—ఉత్తండాలు (౫) ఉరసూత్రిక, కంఠభూష, భూషణము, కంఠమాల, కంఠసరము, కంఠాభరణము, కంఠి, కంఠిక, గ్రైవము, గ్రైవేయకము—గ్రైవేయము, చిలనీలిక-చిలిమోలిక; (౬) (తె).--కంటసరి, కంటెము-కంటె; (౭) (తె) — కట్టాణిగుండ్లు; (౮) (తె) —గజ్జెలపట్టెడ, దవుదుగళ్ళు; (౯) గలమేఖల-గళమేఖల, సూత్రాలి (తె) —కుతికంటు—కుత్తికంటు; (౧౦) (తె) —గోధుమపూసలు; (౧౧) (తె) —గోళ్ళకుతికంటు; (౧౨) (తె) — చిలుకతాళి, (౧౩) (తె).—తరగతిగుండ్లు; (౧౪): (తె).— తీఁగ - తీఁగియ - తీఁగె — తీవ-తీవియ - తీవె, తీఁగెమెడనూలు, (౧౫): (తె).— నాగ పడగల దండ; నాగపడగలు, (౧౬) (తె) — నాను, నానుత్రోవి; (౧౭) (తె) --పట్టెడ; (౧౮) (తె).-పయిఁడికంటె—పైఁడికంటె, (౧౯) (తె) —పలకసరి—పలుకసరి, (౨౦) (తె) —పుంజాలదండ; (౨౧) (తె) -బికిరి; (౨౨) మకరకంఠి. (౨౩) (తె) -మల్లెమొగ్గలు, (౨౪) (తె) -మెడనూలు; (౨౫) వ్యాఘ్రనఖము. (తె) —పులిగోరు; (౨౬): (తె) —సరము, హారము, హారవిశేషములు — (౨౭) అర్ధమాణవకము; (౨౮) అర్ఘక్షి, కలాపకము; (౨౯) అర్ధహారము; (౩౦) గుచ్ఛకము-గుచ్ఛము-గుత్సము; (౩౧) గుచ్ఛార్ధము, గుత్సార్ధము, (౩౨) గోపుచ్ఛము, గోస్తనము (౩౩) మాణవకము; (౩౪) ఏకయష్టిక, ఏకసరము, ఏకావళి. (తె) —ఒంటిపేటదండ; (౩౫) నక్షత్రమాల; మఱియు.—(౩౬) కంకణము; (౩౭) కంఠసూత్రము, దామము, సరము, హారము. (తె) —కోవ్రిన, చేరు-చేలు, తావడము-తావళము, జిగిని, దండ, పేరు, పసము, సరి, సరిగ-సరిగె, సోగు, (౩౮) కకుభ్ (తె).-సంపెంగదండ; (౩౯) (తె).—కట్లసండ, ఉత్తరిగ, గుబ్బసరము; చీరము, బన్నసరము—బన్నసరి, ముత్తడము, ముత్తెసరము—ముత్తెసరి, మెఱుఁగు వల్లులు; (౪౦) గర్భకము. (౪౧) చంద్రచ్ఛందము, (౪౨): చతుష్కి; (౪౩) చాటుకారము, (౪౪) (తె)—టీకా; (౪౫) తరలము—తరళము; (౪౬) (తె).—తిరుమణిపడము; (౪౭) దండము, దండిక; (౪౮). దేవచ్ఛందము; (౪౯) నిష్కము, పతకము—పదకము, (౫౦): (తె).— సేవడము—సేవలము—సేవళము, సేవారము; (౫౧): పంచ

వారికి "చూ, హవణిక 2") (చూ, భూషణములు.)

భూషణములు. అం. (అలంకారములు) మజ్జనము, అనులేపనము, మాల్యము, వస్త్రము, అధిగణము (5).

భూషణార్థి అం (అలంకారములఁ బొందుటకు ఇచ్చెడివాఁడు) చూ, కృతికర్త

భూషించే. సం. స క్రి చూ, స్తుతించే.

భూషితుఁడు సం. విశే. చూ, సజ్జుఁడు 1.

భూష్ణువు సం విశే (ఉ) కాఁగలస్వభావము గలవాఁడు.

భూసురుఁడు. సం. వి. అ. పుం చూ, నేలవేలుపు. [గొడుగు ౯

భూస్ఫోటము. సం వి అ పుం: చూ, పుట్ట

భూస్తృణము. సం. వి అ.న. చూ, తృణము 1 ౯.

# భృ

భృంగము. సం వి. అ న. 1 చూ, పరాంగకము 1*; పుం 2 తుమ్మెద. చూ, షట్పదము; 3 చూ, భృంగరాజము 3; 4 చూ, భృంగరాజము. 1. *.

భృంగరాజము. సం వి అ పుం 1 అంగారకము, కుంతలవర్ధనము, కేశరంజనము, కేశ్యము, కేసరాంజనము, భృంగము, భృంగారము, మహానీలము, మార్కవము-మార్గవము, మేషవిలోచనము, రాజ (తె).—కలగర, గుంటకలగర - గుంటగలగర _ గుంటగలిజేరు * ("చూ, రాజ"); 2 గండుతుమ్మెద చూ, షట్పదము, 3 అటకము, కటము, కలవింకము, కలింగము-కళింగము, కరికారము, కావృకము, ఘూమ్యాటము, పెతమస్తకము, భృంగము. (తె) —కూకటివ్వె, కూకటిముచ్చ, కూకటిమూఁగ, లింగరాజు.

తద్వి —మాందిలవము. (తె).—పెద్దకూఁకటిమూఁగ ("చూ, శకుంతి")

భృంగరోలము సం వి. అ. పుం కందురీఁగ: చూ, మక్షిక.

భృంగామలక తైలము. అం చూ, తైలములు.

భృంగారము సం వి. అ పుం చూ, భృంగరాజము. 1; 2. బంగారుగిండి చూ, పాత్రము. 6; 3 =బంగిరు చూ, లోహము. 1.

భృంగారి సం వి. ఈ స్త్రీ ఈలపురుగు చూ, ఝిల్లి.

భృంగి సం. వి ఈ స్త్రీ 1 అతివస* చూ, విషి; న్ పుం 2 భృంగీశ్వరుఁడు చూ, శలుఁడు; అం 3. చూ, దండలు (భృంగిదండ)

భృంగిదండ అం చూ, దండలు. (భృంగి. 3.)

భృంగిపటలము. అం చూ, దండలు.

భృంగిరిటుఁడు. సం వి.అ పుం చూ, భృంగి 2.

భృంగీశ్వరుఁడు సం వి. అ పుం.—పై—

భృంగుఁడు సం వి అ పుం: చూ, విటుఁడు.

భృంగుర. సం. వి ఆ. స్త్రీ అతివస: చూ, విష.

భృగుమతము అం. చూ, కళలు.

భృగువల్లి. అం చూ, ఉపనిషత్తులు

భృగువు సం వి. ఉ పుం. 1. కొండచేఱియ. చూ, పర్వతము, 2 ఒకముని. చూ, సప్తర్షి; 3. శుక్రుఁడు చూ, రాహువు. 2; 4 చూ, శివుఁడు.

భృగుస్మృతి. అం: చూ, స్మృతులు

భృతకుఁడు. సం. వి. అ. పుం కూలివాఁడు. చూ, సంబళకాఁడు. [దుగ్ధము.

భృతము. సం. విశే 1 ధరింపఁబడినది; 2 చూ,

భృతి సం. వి. ఇ. స్త్రీ. 1. పోషణ 2 కూలి చూ, సంబళిక. 2; 3. విలువ. చూ, వెల 1.

భృతిభుజుఁడు. సం. వి. జ్. పుం. కూలివాఁడు: చూ, సంబళకాఁడు.

భైరవాదిప్రయోగము అం. చూ, తంత్రములు

భైరవి. సం. వి ఈ. స్త్రీ 1. పార్వతి చూ, హైమవతి (పార్వతి); 2 ఒకానొక రాగము (ఇందుకుసంబంధించినరాగముఆనందభైరవి) చూ, స్వరము. 2, వా 3 కండ్లు కేకట్లు క్రిమ్ముట "వానికండ్లు భైరవిక్రిమ్మినవి", 4 ఒకమందు (భైరవులు.—ఆనందభైరవి, సిన్ధుపాళిభైరవి, స్వచ్ఛందభైరవి మొ)

భైరవుఁడు సం. వి అ పుం =భైరవుఁడు 1 చూ, శివుఁడు, 2 కుక్క చూ, శునకము, 3 మిక్కిలిభయంకరుఁడు చూ, భీముఁడు. 1, 2 3 4 భయానకరసముగలవాఁడు చూ, దిగంబరుఁడు 2

భైషజ్యము సం వి అ న చూ, భేషజము 1

## భో

భో సం అవ్య (భోః) చూ, సంబోధనార్థకములు

భోక్త సం. విణ (ఋ ఈ. ఋ) 1 భుజించువాఁడు చూ, భక్షకుఁడు, 2 అనుభవించువాఁడు; వా 3. బ్రాహ్మణార్థము చేయువాఁడు.

భోక్తవ్యము సం విణ 1 భుజింపఁదగినది చూ, ఖాద్యము, భోజ్యము; 2. అనుభవింపఁదగినది. భోగ్యము.

భోక్తృభోగ్యసంబంధము. అం చూ, సంబంధములు [చూ, సదనము. 1

భోగగృహము సం. వి అ న. పడకఇల్లు

భోగము. సం. వి అ. పుం. 1 =భోగము. సుఖము: చూ, సంతోషము; 2 భోజనము. చూ, సాపాటు; 3. పాముయొక్కపడగ చూ, సర్పము; 4 పాముయొక్క శరీరము చూ, సర్పము; 5 ధనము. చూ, హిరణ్యము. 8, 6. వేశ్యాదులకిచ్చెడు వెల. చూ, శుల్కము; 7. పాలనము చూ, సంరక్షణము; అం 8 చూ, వ్యూహభేదములు; 9. చూ, ధనగతులు.

భోగములు అం చూ, అష్టభోగములు, ఇవి చతుర్విధము — ౧ గంధ, తాంబూల, పుష్ప, భోజన, వస్త్ర, సతి, స్నాన, సంయోగములు, ౨ గంధ, తాంబూల, పుష్ప, అన్న, వస్త్ర, స్త్రీ, పానపు, గానములు; 3 గంధ, తాంబూల, పుష్ప, గృహ, వస్త్ర, స్త్రీ, ఆభరణ, శయ్యలు; ४ ధన, ధాన్య, వాహన, భోజన, వస్త్ర, సతి, స్నాన, సంయోగములు

భోగవతి సం వి ఈ. స్త్రీ 1 పాతాళము చూ, లోకము. 1, 2. పాతాళమునందలి యేఱు చూ, నది, విణ 3 భోగముగలది

భోగవర్ధిని. అం. చూ, కకుజవిన్యాసలు

భోగవ్యూహములు అం 1 చూ, ప్రకృతివ్యూహములు, 2 గోమూత్రికము, అగ్రిసారి, శకటము, మకరము, పతంతకము (5).

భోగసముదయము. అం. (భార్యాపుత్రులుఁగలుగుదురు) చూ, గృహసముదయములు.

భోగి. సం వి. న పుం 1 పాము చూ, సర్పము, 2. రాజు చూ, రాజు. 1; 3 చూ, మంగలి, విణ 4 = భోగి చూ, భోగి 1; 5 =భోగి. సుకవాసి చూ, భోగి. 2.

భోగించు. సం అ క్రి. 1 చూ, సుఖించు: వా. 2. కావలసినంతభుజించు చూ, సాపడు; 3 చూ, సంభోగించు. [వాయువు.

భోగికాంతుఁడు. సం. వి అ. పుం: చూ,

భోగిని. సం. వి. ఈ. స్త్రీ. 1 ఆఁడుఁబాము. చూ, సర్పము; 2: చూ, వేశ్య; 3. పట్టాభిషిక్తురాలుకాని రాజుభార్య చూ, భార్య

భోగివిలసితము. అం (చూ, విలసితము): చూ,

వృత్తము. 1 ("భ, స,జగురువులు 7యతి. 10 వ ఛందస్సు)

భోగ్యము సం వి. అ. న 1. ధనము చూ, హిరణ్యము 3; 2 ధాన్యము చూ, స్తంబకరి (ధాన్యము); విశే 3. భోగింపఁదగినది భోక్తవ్యము.

భోజచరిత్ర అం (ఈగ్రంథమును బల్లాలుఁడు వ్రాసెను) చూ, కావ్యనాటకములు

భోజనపుటి సం వి ఈ స్త్రీ =భోనపుటిక. కంచేము చూ, హరివాణము (పాత్రము 6)

భోజనము సం. వి. అ. న. 1.=బోనము-బోనము చూ, సాపాటు; అం 2. చూ, భోగములు; 3: చూ, శకునసమయములు.

భోజనసమయము. అం (భోగముకలుగును) చూ, గ్రహసమయములు

భోజము అం చూ, దేశములు

భోజ్యము. సం విశే 1 భుజింపఁదగినది: చూ, భోక్తవ్యము. 1, అం. 2 చూ, భక్ష్యములు

భోటజభాష. అం.మాంగళి చూ, సంస్కృతము.

భోటము. అం చూ, దేశములు.

భోషణము హా. వి పెద్దపెట్టె చూ, సందుకా.

## భౌ

భౌచ్యమనువు. అం చూ, మనువులు

భౌతికము సం వి. అ న. 1 ముత్తెము. చూ, రత్నము. 1, విశే. 2 భూతసంబంధమైనది

భౌతికుఁడు సం వి. అ. పుం చూ, శివుఁడు.

భౌమవారము సం వి అ పుం. మంగళవారము చూ, వారము 2.

భౌమమండలములు అం భ్రమణము, శకటాస్యము, సమము, స్ఫురితము అస్తగము, పుట్టపట్టము, ఏకక్రీడితకము, అస్కందితము, అవక్రము, అసంగతము. (10).

భౌముఁడు. సం వి. అ. పుం 1. అంగారకుఁడు: చూ, రాహువు. 2, 2 నరకాసురుఁడు: చూ, మహీసుతుఁడు; విశే 3 భూమియందుఁబుట్టినవాఁడు; అం 4 చూ, రుద్రులు.

భౌరికుఁడు. సం వి. అ. పుం చూ, కనకాధ్యక్షుఁడు.

## భ్ర

భ్రంశము సం వి అ పుం. 1 చలించుట: చూ, లోలము; 2 జారుట: చూ, స్ఖలనము. 2 [భ్రూకుంసుఁడు.

భ్రకుంసుఁడు సం వి. అ పుం: చూ, రూ-

భ్రకుటి సం వి ఇ స్త్రీ చూ, రూ-భ్రూకుటి [గుపఱచుట

భ్రక్షము సం వి అ. పుం తనతప్పును మఱుఁ

భ్రమ సం వి అ. స్త్రీ 1. మైకము: చూ, మోహిక; వా 2 చూ, సందేహము;3 చూ, స్ఖాలిత్యము; 4 చూ, భ్రాంతి 1.

భ్రమణము. సం. వి అ న 1 =బ్రిమరి: చూ, విహారము. 1; పుం. 2 గుమ్మరం చూ, ఎట్బడము, అం 3 చూ, తారాక్రియలు; 4 చూ, కళలు

భ్రమణాంశము అం. చూ, ఎప్పట్యాంశములు.

భ్రమము సం. వి. అ పుం 1 =బమ్మెర చూ, భ్రాంతి 1, 2.=బొమ్మర. తిరుగుడు చూ, భ్రాంతి 2, 3 బండికంటె తిరుగుడు; 4: జలనిర్గమము చూ, వాహసము. 2.

భ్రమరకము సం. వి. అ. పుం. 1 చూ, భ్రమరము. 1; 2 =బంగరము: చూ, బొంగరము; 3. చూ, భ్రమరము. 2

భ్రమరకీటన్యాయము. పా. ఒకపదార్థమును దీవ్రముగ భావించిన దానియట్లే తానగుటి. (తుమ్మెదపురుగుం దెచ్చి తనగూటిలో నుంచి దానిచుట్టు తిరిగి ధ్వని చేయుచే నుం

డఁగానుండఁగా వాపురుగు దీనియందే మనసునిల్పి తుమ్మెదయగుననురీతి )

భ్రమరము సం. వి. అ. పుం 1.=బమి తుమ్మెద చూ, షట్పదము; 2. ముంగురులు చూ, పెండ్రుక. 1; 3 అభినయహస్తవిశేషము చూ, వ్యంజకము 1, అం 4: చూ, భ్రామండములు, 5: చూ, కరణములు; 6 చూ, అసంయుతహస్తములు; 7 చూ, విపరీతకరణబంధములు.

భ్రమరవిలసితము అం చూ, వృత్తము 1 ("మ, భ, న,లగణములు 6 యతి 11వర్ణం పున్న")

భ్రమరాంబ. సం వి. ఆ స్త్రీ చూ, అంబ 5

భ్రమరి అం చూ, ఆకాశచారులు

భ్రమించు. సం అ క్రి తిరుగు చూ, ఆరళ్ళ 1, అ 2 చూ, సంచరించు

భ్రమి. సం వి ఇ, ఈ స్త్రీ . చూ, భ్రమణము 1 [సంభ్రమించు

భ్రమించు. సం అ క్రి _బమ్మరిల్లు చూ,

భ్రష్టము. సం విశే. చెడినది. చూ, సిక్తము

భ్రష్ట సం. విశే రూ—భ్రష్టుఁడు 1 చూ, జెలివాఁడు; 2 చూ, వ్యాఘ్రుఁడు. 2

భ్రష్టుఁడు సం విశే —పై —

## భ్రా

భ్రాంతము. సం విశే. 1 భ్రాంతినొందినది, అం 2. చూ, చుంబనములు 1, 3 చూ, పరిణారములు; 4. చూ, చుంబనములు. 2

భ్రాంతి సం వి ఇ. స్త్రీ 1.=బ్రాఁతి_బ్రాఁతి. మిథ్యామతి, ఉన్నదిలేనట్టును లేనిది ఉన్నట్టును తెలఁచుట. లక్ష్మీ. 4, ఆ. 129 చూ, విభ్రమము. 1; 2 చూ, భ్రమణము 1; అం. 3. చూ, అలంకారము. 3. (వస్తుభేదము తెలియక భ్రమించుట" తుమ్మెద నీమొగమాఁగని పద్మమనుకొన్నది." "నల్లనగు రాముని దేహచ్ఛాయంజూచి మేఘమను నూహచే చాతకములు సంచరించుచుండెను.")

భ్రాంతిమత్తు అం చూ, భ్రాంతి 3

భ్రాజితము సం విశే ప్రకాశమునొందినది. చూ, శోభితము

భ్రాజిష్ణువు సం. విశే. (రు) ప్రకాశించువాఁడు, రోచిష్ణువు చూ, విభ్రాట్టు

భ్రాత సం వి ఋ పుం 1 తోడఁబుట్టినవాఁడు చూ, సహోదరుఁడు, అం 2 చూ, గయాపిండదానార్హులు

భ్రాతృజాయ సం వి ఆ స్త్రీ ప్రజావతి చూ, భార్య 1-వ-అర్థ [త్రీయుఁడు

భ్రాతృజుఁడు. సం వి అ. పుం చూ, భ్రా

భ్రాతృవ్యుఁడు. సం వి అ పుం 1 చూ, భ్రాత్రీయుఁడు, 2 చూ, శత్రువు

భ్రాతృసౌదాయికము అం చూ, స్త్రీధనములు.

భ్రాత్రీయుఁడు సం వి అ పుం తోడఁబుట్టినవాని కొడుకు చూ, సూనుఁడు. 1.

భ్రామరము సం వి అ న 1 భ్రమరములఁ గూర్చిన తెల్లనితేనె. చూ, మధువు 5, పుం 2 భ్రామరకమునుజాయి చూ, రాయి; విశే. 3 భ్రమరసంబంధమైనది, అం. 4 చూ, మధువులు.

భ్రామరి. సం వి ఈ. స్త్రీ చూ, పార్వతి.

భ్రాష్ట్రము. సం. వి. అ. పుం. మంగలము: చూ, పాత్రము. 8

## భ్రు

భ్రూకుంసుఁడు. సం. వి అ పుం: చూ, రూ— భ్రూకుంసుఁడు.

భ్రుకుటి సం వి. ఇ స్త్రీ. 1. చూ, రూ-భ్రూకుటి; అం 2 చూ, భ్రూకిర్యలు.

భ్రువులు. అం. రూ-భ్రూవులు. (కనుబొమలు) 1 చూ, లక్షణాంగములు (పురుషునికి.— కనుబొమలచివర గుండ్రముగా పక్షణావర్తములుగలిగిన నూరేండ్లు బ్రదికి యేకచ్ఛత్రాధిపతియగు పార్వ్యశరోజములవంటివ ముప్పదేండ్లు బ్రతుకును, 2· చూ, స్త్రీలక్షణాంగములు (బాలచంద్ర సమములైన మగని ధనవంతునిఁజేయును. చంద్రాయుధమువలెనున్న సుఖభోగియగు మన్వేయున్నయాత్రివాసనము మధ్యముడియున్న అంకులాఁడియగు బొమలనడుమ వెండ్రుకలున్న మగనిఁజంపును కలసియున్న దరిద్రురాలగు.)

## భ్రూ

భ్రూకుంసుఁడు. సం వి అ. పుం స్త్రీవేషధారియైనటనము చేయుపురుషుఁడు రూ-భ్రుకుంసుఁడు—భ్రుకుంసుఁడు — భృకుంశుఁడు-భ్రూకుంశుఁడు - భృకుంసుఁడు — భ్రూకుంసుఁడు, కచరి, పాత్రము. (చూ, నాటకము)

భ్రూకుటి సం వి ఇ స్త్రీ రూ-భ్రుకుటి—భ్రుకుటి, భ్రూభంగము. (తె).— బొమముడి-బొమ్మముడి.

భ్రూకిర్యలు అం. భ్రుకుటి, కుంచితము, రేచితము, పాతనము, ఉత్క్షేపము, సహాటము, చతురము (7)

భ్రూణ సం వి అ స్త్రీ. చూలాలు. (తె) — చూలాండ్రుండునది — గార్భిణము-గార్భిణ్యము.

భ్రూణము సం. వి. అ పుం 1 శుక్లశోణిత పిండము అర్భకము, ఉదరము, కబంధము, కృత్స్నము, కోశము, గరభము-గర్భము, చటువు, దరి, దోహదలక్షణము, పిండము. (తె) —కడుపు—కడ్పు, కరువు, చూలి, వేఁకటి-వేవ్రిఁకటి(ఈగతవానికి " చూ, వ్రేఁకటి "); తద్విశేషములు —౧. కడుపు (గర్భకుహరము)నకు.—ఉదరము, కంజరము-కంజారము, కుక్షము, కుక్షి, కృత్స్నము, కృపీటకము- కృపీటము, జఠర-జఠరము, తుందము, తుంది, పిచండము (తె).— కడుపు—కడ్పు, డొక్క, పొట్ట, బొజ్జ, బొఱ్ఱ, వాలుగడుపు-వాల్గడుపు. ౨. కడుపులోనిపిండమునకు.—గర్భము, ప్రోషము (తె).—చూలు, ౩. క్రిందికడుపునకు — (చూ,వస్తి 2),౪. గుల్మముయొక్క గర్భస్థపిండమునకు (తె) —చోబలము, ౫. జఠరకోశమునకు -జాగము,౬. తిండిపోతునిఁగడుపునకు -(తె) పెరగడుపు, ౭ బొజ్జకడుపునకు. (తె) —పొట్ట,బొజ్జ, బొఱ్ఱ, ౮. బాలింతస్త్రీగర్భమునకు -ఖరువు; ౯.లోఁగడుపునకు —కోష్ఠము (ఈగతవానికి " చూ, వ్రేఁకటి ")

కుటి.

భ్రూభంగము. సం వి అ పుం' చూ, భ్రూ

భ్రూమధ్యము సం వి. అ న బిందువు.

భ్రూమధ్యావర్తి. అం చూ, అనుభావగ్రములు.

భ్రూవు సం. వి ఊ స్త్రీ.బొమ 1 అవి. కూర్చిక, కోదండము (తె )—కనుబొమ, బొమ-బొమ్మ, అం 2 చూ, చక్రిములు.

భ్రూవులు అం. చూ, రూ-భ్రువులు.

## మ

మ. ఒకయక్షరము. సం. వి. అ. పుం 1 చూ, శివుఁడు; 2. చూ, బ్రహ్మ. 1, 3. చూ, హిమాంశువు; 4. చూ, వహ్ని. 1; 5.పాణి· చూ, సంకతి.1; 6 చూ, యముఁడు, 7. చూ, సముద్రము. 1; 8· చూ,

విషము; 9: చూ, విష్ణువు 1; అం. 10: చూ, కవర్గము; 11. మధ్యమస్వరస్థానము. మధ్యమము (మ) చూ, సంగీతస్వరములు (స్వరము. 2). [సంతతి 1

మష్. సం. వి. అ. న జనము. మంది: చూ,

మంకు. దే విశ 1 =మూర్ఖ చూ, స్తబ్ధుఁడు, 2 చూ, మొండి. 1.

మంకుతనము దే. వి. 1. చేండితనము చూ, విలంబము 1; 2. మూర్ఖత్వము చూ, మౌర్ఖ్యము.

మంకెన. దే. వి. 1: చూ, రక్తకము. 3 * పాండు 2, అ. 41; 2 ఎద్దుమీఁద నీళ్ళ బిందెలు తెచ్చేనపుడు ఆబిందెలక్రింద కుదురుగా సంతనచేసి యుంచేబడు వెత్తపుబుట్ట లజేత చూ, మట్టు 3

మంకెనలు దే. వి బ. చూ, ధాన్యము; 2 చూ, శాలక్రిష.

మంక్షు సం. అవ్య. శీఘ్రముగ: చూ, వేగము 3

మంఖుణము సం. వి అ. న. పిక్కలకుఁదొడిగికొను కవచము: చూ, వారవారణము

మంగ. దే వి: చూ, వ్యసనము * (మగలది)

మంగల. దే. వి. క్షౌరకజాతి. (మంగలవాఁడు,

మంగలకత్తి ద్వ వి క్షురము: చూ, రిష్టి. 2

మంగలకత్తిరూపు ద్వ. వి కృత్తిక: చూ, రిక్క.

మంగలచక్క. దే వి చూ, మత్స్యము 1

మంగలపిట్ట ద్వ వి చూ, వ్యాఘ్రాటము.

మంగలము. సం. వి. అ. న: చూ, రూ-మంగళము 1-2; దే. వి (1) వేఁపుడుచేట్టి చూ, పాత్రము. 6-క౧.

మంగలవాఁడు. దే. వి చూ, మంగలి.

మంగలి. దే. వి. 1: రూ_మంగలవాఁడు, మంగి. (సం).—అంతావసాయి-అంతేవసాయి, అంబష్ఠుఁడు, కల్పకుఁడు, కేశచ్ఛిత్తు, క్షురమర్ది, క్షురి, క్షౌరికుఁడు, చండిలుఁడు, చండాలుఁడు_చాండాలుఁడు, దివాకీర్తి, నాపితుఁడు, ముండి ("చూ, శిల్పులు."); అం. 2: చూ, శిల్పులు [7, ఆ 75: చూ, వీణె.

మంగలిగొల్ప దే. వి. బ. సన్నాయి. కళా.

మంగలిపని. దే వి. క్షౌరము చూ, ముండనము.

మంగళ. సం. వి. ఆ. స్త్రీ. 1 చూ, పార్వతి; 2. తెల్లగరికె*: చూ, హరిత (తృణము 1 )

మంగళకౌశిక. అం: చూ, స్త్రీరాగములు.

మంగళదేవత సం వి. ఆ స్త్రీ: చూ, లక్ష్మి.

మంగళమహాశ్రీవృత్తము అం: చూ, వృత్తము 1 ("భ, జ, స, న, భ, జ, స, న, గగములు. 9_17 యతులు. 18వ ఛందస్సు.)

మంగళము. సం. వి. అ న. 1: చూ, శుభము 1; వా. 2. ధ్వంసము

మంగళముచేయు వా. మి. స. క్రి. 1 క్షేత్రముస్కారు చూ, దీవించు; 2. ధ్వంసము చేయు. [జోహారు-జోహారు.

మంగళ వాచకములు అం: (తె) —శుభ,

మంగళవాద్యము. అం: చూ, వాద్యములు.

మంగళసూత్రము సం. వి. అ. న: బొట్టు దారము కళా. 7, ఆ 75: చూ, భూషణము. 2; 2. మాంగల్యము, పుస్తె చూ, భూషణము 2

మంగళహారతి వై వి =మంగళార్తి. రూ-మంగళారతి చూ, హారతి.

మంగళారతి. వై వి —వై —

మంగళార్తి. సం వి ఈ. స్త్రీ =మంగళహారతి —వై.——

మంగళాశాసనము. సం. వి అ. న. (వైష్ణవపరిభాషయందు) ఆశీర్వాదము: చూ, దీవన.

మంగళుఁడు సం. వి. అ. పుం. కుజుఁడు చూ, రాహువు. 2

మంగళ్య. సం. వి. అ. స్త్రీ 1. గోరోజనము. చూ, రోచన.1; 2. జెమ్మి*: చూ, శమి. 1;

3. తెల్లవస*: చూ, విష; 4: చూ, పెదాళ * [మంగళ్యము. 6

మంగళ్యకము సం వి. అ. పుం: చూ, రూ—

మంగళ్యము. సం. వి. అ న. 1. మల్లెపూవాసన గల అగలు, మల్లెపూవాసనగల కృష్ణాగరు (నల్లఅగలు) (అనికొందఱు)' చూ, రాజా గ్రము; 2 చూ, మీఁగడపెరుఁగు, పుం 3. కలుకాంత *' చూ, వార్షికము 1; 4 చూ, మారేడు*; 5 చూ, రావి*; 6 మంగళ్యకము, చిఱుసెనగలు: చూ, సెనగలు; విశే. 7' చూ, శుభకరము.

మంగి. దే వి: చూ, రూ—మంగలి

మంగు. దే వి. రూ—మంగుడు—మాఁగు ముఖసిధ్మము చూ, సిధ్మము.

మంచకము. సం వి. అ పుం చూ, మంచె

మంచము. సం. వి అ. పుం =మంచేము. 1' చూ, మంచేము; 2 చూ, మంచె.

మంచి దే వి 1 యోగ్యత' చూ, సామర్థ్యము. 2, 2 ఇష్టోక్తి చూ, శబ్దము 2; 3 బాజ్జీగింపు చూ, సమరసము. 2; అం 4. సామము. చూ, ఉపాయములు (1_2-3-4); విశే. 5 చూ, సజ్జనుఁడు; 6 చూ, శైత్యము; 7. చూ, యోగ్యము 2 (మఱియు దీనికి సందర్భానుసారముగా ననేకార్థములు చెప్పెదరు) [వాసన. 1.

మంచిగంపము ద్వ వి. శ్రీచందనము' చూ,

మంచిచెడ్డలు దే. వి. బ. అవుగాములు-ఔగాములు, కలిమిలేములు, సముగాములు, బాగు ఓగులు, మేలుగీళ్లు (సం) —ఉచ్చనీచములు, సుఖదుఃఖములు, (వ్య) కష్టసుఖములు వెం.

మంచిలసము పొంటట. అం చూ, సామము 3

మంచి తెలిపి అం చూ, రాజలక్షణములు

మంచితోవ దే. వి సత్పథము. చూ, మార్గము. 1

మంచిదారి. దే. వి: చూ, మంచితోవ.

మంచిది. దే. అవ్య. మూ బాగు: చూ, సమ్మతి.1.

మంచినడత. దే. వి. 1: చూ, శీలము. 2: 2: చూ, వర్తనము. 1.

మంచినీరు. ద్వ. వి. కుడినీరు' చూ, సలిలము.1.

మంచినూనె ద్వ. వి. అంటునూనె: చూ, స్నేహము. 2.

మంచిపని. దే. వి: చూ, హితము. 1.

మంచిపాము. దే. వి. నాగుఁబాము: చూ, సర్పము.

మంచిబెల్లము దే. వి. చెఱకురసముతోఁజేసిన: బెల్లము: చూ, శర్కర 1.

మంచిమాట. వా. వి. 1. పరిభాష: చూ, శబ్దము. 2; 2. ఇష్టోక్తి' చూ, శబ్దము. 2.

మంచిముత్తెము. ద్వ. వి అకృత్రిమమైన మౌక్తికము: చూ, రత్నము. 1

మంచియ నై. వి =మంచ: చూ, రూ—మంచె

మంచివాఁడు. దే వి 1: చూ, మంచి. 5; 2' చూ, సుకృతి. 1. [చూ, శయ్య. 1.

మంచె. నై వి =మంచ. రూ—మంచియ అరప.

మంచేము నై వి =మంచ. పానుపు' చూ, శయ్య 1.

మంచు దే. వి 1: చూ, హిమము; పేరి. 2 (రూ-మనుచు-మనువు) మనఁజేయు

మంచుఁగొండ. ద్వ వి హిమవత్పర్వతము: చూ, పర్వతము. [మానద్వయము.

మంచుకారు దే. వి. హేమంతఋతువు' చూ,

మంచుగుబ్బలి. ద్వ వి' చూ, మంచుఁగొండ.

మంచుటిలదాల్పు. దే వి —పై.—

మంచుతటి. దే వి. చూ, మంచుకారు.

మంచుతాగుడుపులుఁగు. దే వి' చూ, వెన్నెల పులుఁగు.

మంజర సం. వి ఇ, ఈ. స్త్రీ. 1. చిగిరించిన లేఁతకొమ్మ' మా, శాఖ 1, 2. బొట్టుగు*. చూ, శ్రీమాన్ (నువ్వు); 3. పెద్దముత్తెము; చూ, రత్నము. 1, 4. పూగుత్తి. చూ, స్తబ

శ్లేషము; అం. 5. చూ, మహాకావ్యము; 6: చూ, క్షుద్రప్రబంధము; పా. 7: చూ, వృత్తము. 1. (ఒక్కొక్క పాదమున మూఁడింద్రగణంబులును ఒక సూర్యగణంబును గలిగి మూఁడవ గణాద్యక్షరము యతిగాఁగల వృత్తము ద్విపదవలెనే పడమను కాని ప్రాసము లేదు. యతియున్న చోలును.)

మంజిడి. వై. వి. 1 =మాంజిష్ఠమ్. చిత్రవర్ణ వస్త్రము. పాండు. 1, ఆ 110; వై. 6, ఆ. 108. చూ, వస్త్రము; 2. నీలవస్త్రము. ఉ, హరి 2, ఆ 171: చూ, నీలి (2)

మంజిమ. సం వి. న్. పుం. రూ-మంజిమము: చూ, మనోజ్ఞత.

మంజిష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. 1.=మంజేటి: చూ, సమంగ. 1; 2 మిక్కిలి ప్రకాశించెడి యెఱుపు. చూ, వర్ణము. 6.

మంజిష్ఠారాగము. సం వి. అ. పుం. బయటికిని విశేషముగఁ గనఁబడుచే లోపలను ఎప్పటికిని వీడకుండెడు గాఢానురాగము (చూ, పూర్వ రాగము.)

మంజీరము సం. వి. అ. పుం. అందె: చూ, భూషణము. 4. [బుద్ధుఁడు.

మంజుఘోషుఁడు. సం. వి. అ. పుం: చూ,

మంజుభద్రుఁడు. సం. వి. అ. పుం.—పై.—

మంజుభాషిణి. పా: చూ, వృత్తము. 1. ("స-జ-స-జ గురువులు. 9యతి. 13 వఛందస్సు)

మంజులము. సం. వి. అ న. 1. పాఁచి: చూ, శైవలము. 1; 2. పొదరిల్లు. చూ, సదనము. 1; పుం. 3 ఒకరకము కూకురుగుండెంగ' చూ, దాత్యూహము (చూ, కకుంతి); విశే 4. ఒప్పిదమైనది. చూ, హృద్యము; అం. 5: చూ, సంయుతహస్తములు.

మంజువు. సం. విశే. (ఉ): చూ, మంజులము.4

మంజుశ్రీ. సం. విశే' చూ, బుద్ధుఁడు.

మంజూష. సం. వి. ఆ. స్త్రీ=మంజేస. పెట్టె యు. చూ, సందుకా.

మంజేటి వై వి =మంజిష్ఠ*: చూ, సమంగ. 1.

మంజేస. వై. వి.=మంజూష: చూ, మంజూష.

మంజోడి. దే. వి. రూ-మంజోలి 1. వజ్రముల తూనిక; వా. 2. బట్టతలతూనిక.

మంజోలి. వా. వి.—పై.— [ల్లుబడి.

మంజోరు. వా. వి 1' చూ, సమ్మతి. 1; 2. చె

మంట. దే వి 1: చూ, కోపము; 2. జ్వాల' చూ, వహ్ని. 1; 3. చేయుకుసుమనెడునొప్పి. "గాయముమంట యెత్తుచున్నది."

మంటకము. సం వి. అ. పుం.=మండెగ' చూ, భక్ష్యము. [మంటనేయి.

మంటచేమురు. దే. వి కాలిన గరిఁటెచేమురు:

మంటనేయి. దే. వి —పై— [సదనము. 1.

మంటపము. సం. వి. అ. న. రమ్యభవనము. చూ,

మంటఁబెట్టు. వా. స. క్రి: చూ, మండఁబెట్టు.

మంటమారి. దే. విశే. 1. జ్వాలనశీలుఁడు; 2. కోపశీలుఁడు వసు. 4, ఆ 44.

మంటిగడ్డ ద్వ. వి. గడ్డ చూ, భూమి. 1.

మంటిగోడ ద్వ. వి: చూ, రూ--మట్టిగోడ.

మంటినూనె. ద్వ. వి. (మన్ను + నూనె)' చూ, మట్టితైలము

మండ సం వి. ఆ. స్త్రీ. 1. ఉసిరిక*: చూ, శ్రీఫలి. 1, దే. వి (1). కొమ్మ: చూ, శాఖ.1; (2). చిన్నకొమ్మ స్వా.4, ఆ.87: చూ, శాఖ.1; (3). వితతశాఖ: చూ, శాఖ.1; (4)' చూ, సీలమండ.

మండఁబెట్టు. వా. స. క్రి. దహింపఁజేయు: చూ, వెలుఁగు. 5. (కోపమువచ్చునట్లుఁగూసె వాడెవరు.)

మండకంచెము. ద్వ. వి. అంచుకట్టిన కంచెము చూ, హరివాణము (పాత్రము. 8)

మండగబ్బ. వా. వి. రూ-మండ్రగబ్బ: చూ, వృశ్చికము. 1.

మండనము సం. వి. అ. న. 1: చూ, భూష ణము. 2; 2. అలంకరించుట చూ, భూష ణము. 2, విణ 3 అలంకరించునది

మండనుఁడు. సం. విణ అలంకరిష్ణువు, అలంకర్త.

మండపము సం. వి అ పుం, న 1 చేవిక చూ, సదనము 1, 2 చౌవడి చూ, సదనము. 1; వై వి. (1) =మంట పము చేవిక చూ, మండపము 1.

మండపి. సం వి ఈ స్త్రీ చిన్నమండపము చూ, సదనము. 1

మండము సం వి అ. న 1 మీఁగడ రూ- మండాము చూ, స్తన్యము; పుం, న. 2. గంజి చూ, సాదము (1), 3. నెయ్యి నూనె లోనగువాని పైతేట చూ, హవిస్సు 1, పుం 4 ఆముదము* చూ, వ్యాఘ్రంబక ము, 5 చూ, భూషణము 2; 6 ఒక కూరాకు, దే వి (1) రూ-మండామూ చేఁప లఁగొడుమే చిల్లకోల చూ, సవ్వల

మండలకము సం. వి. అ న. ఎఱ్ఱపులుము చూ, మండలము 8

మండలగతి అం చూ, బాహుప్రచారములు.

మండలచ్ఛదము సం వి. అ న. అటకమామిడి * చూ, మామిడి. [లు (3)

మండలక్రియము అం. సూర్య, చంద్ర, అగ్ను

మండలభ్రమణము అం చూ, విశంతివిగ్ర హములు.

మండలము. సం. వి. అ. న. 1 చూ, వలయ ము, బిట్టు —మధ్యము (తె) —నడి- నడిమి_నడిమి చోటు, 2.=మాడెము చూ, దేశములు, 3 పన్నము చూ, సితము. 1, 4 విలుకాఁడు రెండుకాళ్లతో మండలాకా రముగా నిలుచుట చూ, స్థానము. 4 (చూ, విలుకాని స్థానములు.), 5 పన్నిద్ద ఱురాజులు (చూ, ద్వాదశరాజమండలము), పుం 6 చూ, సమూహము, 7 పలయాకా రముగఁదీర్చినవారియొక్క వ్యూహము: చూ, వ్యూహ భేదములు; 8 చూ, శునకము; 9 (?) 9 సూర్యచంద్రాదుల బింబము: చూ, బింబ ము. 6. (చూ, వర్తులము); 10: చూ, పుంస్థానకములు

మండలవికల్పము అం చూ, పరికరణములు.

మండలవ్యూహములు. అం చూ, ప్రకృతి వ్యూహములు

మండలస్వస్తికము అం చూ, కరణములు.

మండలాగ్రము. సం వి. అ. పుం కత్తి చూ, క్షిష్టి 2

మండలి. సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, సమూ హము; వా. 2 సమితి చూ, పరిషత్తు, న. పుం 3 చూ, సర్పము; 4 చూ, మం డలేశ్వరుఁడు, 5: చూ, సూర్యుఁడు, 6. పిల్లి: చూ, సూచకము 5; 7 కుక్క: చూ, శునకము.

మండలాటి దే. వి రూ-మండిలాటి. మర్మ వర్ణము చూ, వర్ణము.

మండలేశుఁడు. సం వి అ పుం. అధీశ్వర సామంతులకంటె ఇతరుఁడైనరాజు చూ, రాజు 1.

మండలేశ్వరుఁడు సం వి అ పుం.—పై —

మండవాయి ద్వ. వి గుల్మమారుతము చూ, వాయువు

మండహారకుఁడు సం. వి. అ. పుం. కల్లమ్ము వాఁడు చూ, శౌండికుఁడు.

మండాటము. దే. వి. దైన్యముతో యాచిం చుట చూ, యాచన.

మండాడు. దే. స. క్రి. దైన్యముతో యాచిం చు. చూ, వేఁడు 4

మండాము సం. వి. అ న. 1 చూ, రూ_ మండము. 1 దే వి. (1) చూ, రూ- మండము (1). [రూ_మండీ.

మండి. దే వి ఒకకాలు నేలమోఁకరించుట:

మండిగ. వా. వి. 1. కుంపటి. చూ, హసంతి; 2. బాణసంచాల మందులనూరెడు మట్టిపాత్రము: చూ, భాండము. 3.—33.

మండిగండ్రిలు. దే వి. బ: చూ, ధాన్యము

మండిగము. దే. వి. వాకిటి క్రిందియడ్డుకొయ్య. చూ, శిల. 2.

మండిఁగలు. వై. వి బ =మంటక రూ-మండెఁగలు. చేక్కెరవేయని గోదుమపూరి. చూ, భక్ష్యము. [సజ్జుఁడు 2

మండితుఁడు సం. విశ. అలంకృతుఁడు. చూ,

మండిపడు దే అ క్రి చూ, మండు. 1

మండిపాటు దే వి చూ, సంభ్రమము.

మండియ. దే వి. రూ—మండె. 1. జొన్నకంకులు పొగాకు లోనగునవి మగ్గుటకై ప్రోగువేసి మీఁదకప్పి పెట్టుట, 2 ఎగురఁబోయక ముందు కళ్లములో ప్రోగుచేసినధాన్యపురాసి

మండిలూటి దే వి చూ. రూ- మండలూటి

మండీ దే.వి: చూ, రూ—మండి [మల్లశాస్త్రము.

మండీలు దే వి బ. మల్లవిద్యాభేదము చూ,

మండు. దే అ. క్రి 1. జ్వలించు పొందు 2, ఆ 109, స్వా. 4, ఆ. 88 చూ, వెలుఁగు. 5 (చూ, మండు.3 ), 2. చురుకుమనినొచ్చు "గాయము మండుచున్నది", 3 ఈర్ష్యాదులచే తపించు అడిచిపడు, ఎగసిపడు (చూ, మండు 1 )

మండునెల. దే. వి. వసంతఋతువు ఉ హరి 2, ఆ. 194 చూ, మాసచ్ఛాయము

మండువా వై వి 1 =మండువా ఒక తట్టు గోడలేని గుజ్జాలసాల స్వా. 1, ఆ 40 చూ, సదనము 1; 2 చతురముగా స్తంభములమీఁద దించినది, 3 పాక. చూ, సదనము 1; వా 4 నాలుగిండ్ల బవంతినడుమను వెలుఁగువచ్చుటకును వానసీరు పడుటకును తెరిన కాళీభాగము "మండువాలోగిలి"

మండువాలోగిలి వా. వి నాలుగిండ్ల బవంతి: చూ, సదనము. 1.

మండూకతులాన్యాయము. పా. కప్పలనుతక్కెడలోఁబెట్టఁగా నిలువక పారిపోవుచుండునను రీతి [ము*. చూ, శోణకము.

మండూకపర్ణము. సం వి అ పుం దుండిగ

మండూకపర్ణి సం వి ఈ స్త్రీ 1 బొన్నగంటి*. చూ, శీతసారము; 2 చూ, బెండ*; 3. చూ, మంజిష్ఠ* 1.

మండూకప్లుతిన్యాయము పా. కప్ప దాఁటు వేసినట్లు కొంచెముపనిచేసి యదివిడిచి మతికొంత చేయుటయనురీతి.

మండూకమక్షికాన్యాయము పా. కప్ప పాము నోటనుండియుఁగనుమిగ్రింగఁబోవుననురీతి.

మండూకము సం వి. అ పుం. 1. కప్ప. చూ, హరి. 12, 2 చూ, మండూకపర్ణము

మండూకుఁడు. సం. వి. అ పుం ఒకఋషి: చూ, సన్యాసి.

మండూరము. సం వి. అ న. 1 ఇనుపచిట్టెము చూ, శింఘాణము 1; 2 ఇనుపచిట్టెముతోఁజేసినసిందూరము. చూ, శింఘాణము. 1.

మండె దే వి: చూ, రూ-.మండియ

మండెఁగలు వై. వి బ —మంటక చూ, రూ- మండిఁగలు. శై 8, ఆ 204, శై 6, ఆ 134

మండెచేటనలుఁగు వా. వి. ఎగురఁబోసిన వడ్లరాసిపైన చేటతో నునుపుఁజెట్టుట

మండెము. వై. వి 1. చూ, రూ-మాడెము- దుర్గమస్థలము. చూ, స్థానము. 1; 2. చూ, మాన్యము 1.

మండెవెంటినలుఁగు వా. వి ఎగురఁబోయని వడ్లరాసిపైన చేటతో నలుఁగుఁజెట్టుట. చూ, వెంటినలుఁగు [క్షము

మండ్రి దే వి. ఒకముండ్లచెట్టు చూ, వృ

మండ్రిగబ్బ. దే. వి: చూ, పుట్టతేలు.

మండ్రాటము. దే వి: చూ, సంతాపము. ఉ- హరి. 2, ఆ. 167

మండ్రాడు. దే అ క్రి చూ, సంతాపించే.

మంత సం. విణ. (ఋ. ఈ. ఋ) ఆలోచించేవాఁడు.

మంతనము. వై. వి.=మంత్రణమ్. 1. ఆలోచన, హరి. ఉ. 1, అ. 14: చూ, యోచన; 2. ఏకాంతము. అచ్చ. సుం, కాం. 98 చూ, రహస్యము. 1; అం 3 తిరిక్తులలో మాఁటపది: చూ, జేతనము; 4 (చూ, త్రియము.)

మంతరము వై. వి.=మంత్రమ్. రూ-మంతు-మంత్రము. 1 ప్రిసవోపాయము, 2. జాల విద్య: చూ, విద్యలు, 3 గాయత్రిలోనగునది: చూ, గాయత్రి(చూ, మంత్రము. 1;) 4 = చూ, మంత్రము. 1.

మంతరసాని. వై. వి =మంత్రిస్వామినీ ప్రిసవ మంత్రిజ్ఞ రూ-మంతురసాని-మంత్రిసాని.

మంతవ్యుఁడు సం విణ. ఆలోచింపఁదగినవాఁడు.

మంతిరి. వై వి =మంత్రి. ప్రధానుఁడు. ఉ. రా. 2, అ. 220: చూ, సచివుఁడు. 1.

మంతిరించే. వై. అ క్రి. 1 మంత్రముచేయు: మంత్రించే, వా. 2. మంత్రించే చూ, పిలుచే

మంతు. వై. వి. 1.=మంత్రి. అచ్చ. కిష్కిం, కాం. 6 చూ, రూ-మంతిరి; 2. చదరంగము లోని రాజుతర్వాతనుండెడుకాయ, ద్యూత మంత్రి; 3 చూ, రూ-మంతరము. 1.కళా 2, అ 48; 4 చూ, రూ-మంతనము. 2, జే వి. 5. చూ, ప్రసిద్ధి. 1.

మంతుకెక్కినవాఁడు. ద్వ. వి. చూ, పార. 5 అం, భా. స్క 4. [రూ-మంతరసాని.

మంతురసాని. వై. వి.=మంత్రిస్వామినీ. చూ,

మంతువు. సం వి. ఉ స్త్రీ. 1. తెలివి: చూ, హృల్లేఖము. 2; పుం. 2 చూ, నేరము; 3. చూ, మనుష్యుఁడు; 4 రాజు. చూ, రాజు. 1.

మంతుసాని. వై. వి.=మంత్రిస్వామినీ: చూ, రూ-మంతరసాని.

మంత్రకాఁడు. ద్వ. వి. (మంత్రము + కాఁడు) ఇంద్రజాలవిద్య నెఱిఁగినవాఁడు. అచ్చ. యు, కాం. 448. చూ, వ్యాళగ్రాహి.

మంత్రణ. సం. వి. అ స్త్రీ.=మంతనము. రూ-మంత్రణము. రహస్యాలోచన: చూ, యోచన.

మంత్రణము. సం. వి. అ. న.—పై.—

మంతదీధితి.సం వి.ఇ.పుం.అగ్ని:చూ,వహ్ని.1.

మంత్రపదము. అం: చూ, అరూఢము.

మంత్రబ్రాహ్మణము. అం ఋగ్వేదబ్రాహ్మణములలోనొకటి. ఋచలి మొత్తము 4000. (దీనివ్యాపకముగానరాదు): చూ, బ్రాహ్మణము

మంత్రము. సం. వి. అ. పుం. (విచారింపఁబడునది) 1 =మంతరము అంకము, అ స్త్రము, క్షిపణి, గుహ్యభాషితము, మనువు. (తె). --మంతరము. తద్విశేషములు.—౧. అన్నపూర్ణపంచదశాక్షరి (ఐం హ్రీం సౌః శ్రీం క్లీం ఓం నమోభగవత్యన్నపూర్ణే); ౨ దేవీపంచాక్షరి (ఓం ఈం ఈం నమః); 3. నారాయణాష్టాక్షరి. (అష్టాక్షరి) (ఓమ్ నమోనారాయణాయ); ౪. రామాష్టాక్షరి(ఓమ్ శ్రీం రాంరామాయ నమః); ౫. వాసుదేవ ద్వాదశాక్షరి (ఓమ్ నమోభగవతే వాసుదేవాయ); ౬. శివషడాక్షరి (షడక్షరి) (పంచాక్షరి) (ఓమ్నమశ్శివాయ); ౭ శ్రీరాజరాజేశ్వరీ పంచదశాక్షరి (క, ఏ, ఈ, ల, హ్రీం, హ, స, క, హ, ల, హ్రీం, స, క, ల, హ్రీం); ౮. సూర్యాష్టాక్షరి (సౌరాష్టాక్షరి) (ఓమ్ ఘృణిసూర్యఆదిత్యోమ్.);౯. సౌభాగ్య విద్యేశ్వరీపంచాక్షరి.(శ్రీం క్లీం హ్రీం బ్లూం

వం); ౧౦.హయగ్రీవద్వాదశాక్షరి(ఓమ్‌నమో భగవతేహయగ్రీవాయ) ఇత్యాది మంత్రం బులెల్ల యంత్రంబులతో నుపాసింపఁదగినవి; మఱియు.—౧౧. అ; ౧౨. అఘమర్షణము; ౧౩. అజప; ౧౪ అపసరము; ౧౫. అఘ్రము; ౧౬. అపరిచ్ఛిన; ౧౭. అభిశ్రితము; ౧౮. అసురి; ౧౯ ఉపాంశువు; ౨౦ బృహ్మంత్రము; ౨౧ ఐంద్రము; ౨౨ గాయత్రి; ౨౩.గారుడము (తె)–గారడము, ౨౪. జప్యము; ౨౫.తారకమంత్రము; ౨౬.దిగ్బంధము (మంత్రముచేఁగట్టెడు దిక్కులకట్టు); ౨౭.ప్రతిసరము; ౨౮ బీజాక్షరములు; ౨౯ హంస, ౩౦ హృద్యము.ఇత్యాది(మిగతవానికి "చూ,హృద్యము.5."); 2 ఏకాంతము చూ, రహస్యము. 2. 3. అథర్వవేదము. చూ, వేదములు; అం. 4. చూ, యోగములు (యోగచతుష్టయము); 5. చూ, ప్రకాశింపఁజేయఁగూడనివి; 6: చూ, శక్తులు; 7: చూ, క్రియలు; వై. వి (1)· చూ, రూ–మంతరము 1; (2)·చూ, రూ–మంతరము. 2. [త్రికుఁడు

మంత్రివాది. సం. వి. న్. పుం· చూ, మాం

మంత్రవికల్పము. అం చూ, ప్రకరణములు.

మంత్రశక్తి. అం. 1· చూ, శక్తిత్రయము; 2. చూ, పిశంతి విగ్రహములు.

మంత్రసాని. వై. వి.=మంత్రస్వామినీ. మంతగసాని-మంతుగసాని_మంతుసాని.

మంత్రసిద్ధి అం. 1. చూ, కళలు; 2 చూ, సిద్ధిత్రయము (త్రయము).

మంత్రాంగము. సం వి. అ. న. మంత్రిత్వము.

మంత్రాప్తి. సం. వి ఇ స్త్రీ. జపము:చూ, తపము 2.

మంత్రి. సం. వి న్ పుం =మంత్రిరి_మంతు. 1. ధీసచివుఁడు చూ, సచివుఁడు, 2· చూ, సహాయుఁడు 1 [1—2

మంత్రించు సం అ. క్రి= చూ, మంత్రిరించు.

మంత్రిసింహాసనము. అం: చూ,సింహాసనములు.

మంత్రోపదేశము చేసినవాఁడు. అం: చూ, గయాపిండ దానార్హులు.

మంథజము సం వి. అ. న చూ, కలంబుటము.

మంథదండము సం. వి. అ. పుం: చూ, మంథానము.

మంథనము. సం. వి. అ. న 1: చూ, మథనము; పుం. 2: చూ, మంథానము. [త్రము. 6.

మంథని. సం వి.ఈ స్త్రీ. తరిగడవ: చూ, పా

మంథము. సం. వి. అ పుం. 1: చూ, మంథానము; 2. కంటినొప్పి. చూ, హర్షణము; 3 అంబలి: చూ, పానము (1); 4 వధము: చూ, హింస. 1.

మంథరజ్జువు సం. వి. ఉ.పుం:చూ, తరిత్రాడు.

మంథరము. సం వి. అ పుం. 1: చూ, మంథానము; విణ. 2. చొరవలేనిది·జిహ్మము, మందము (తె).—మసలిక; 3. మెల్లగాఁబోవునది· జిహ్మగము, మందము (తె) —మసలిక; 4 వంకరైనది· చూ, వేల్లితము. 2; 5. విరివియైనది: చూ, సుర 3.

మంథరుఁడు సం. వి. అ. పుం. మెల్లగానడచువాఁడు: మందగామి.

మంథరువు. సం. వి. ఉ పుం చామరపుగాలి: చూ, వాయువు [చూ, పర్వతము.

మంథాద్రి. సం. వి. ఇ పుం. కవ్వపుఁగొండ:

మంథానము. సం. వి. అ పుం రూ–మంథనము–మంథరము, మంథము, కవ్వము: చూ, వైశాఖము. 2; తద్వి.—(కవ్వపుగుత్తికి — చూ, వైశాఖము. 2.)

మంథుఁడు. సం వి. అ పుం:చూ, సూర్యుఁడు.

మంద. దే వి. 1 గొల్లపల్లె: చూ, దేశములు, 2 పసులమంద: చూ, సౌరభేయి(ధేనువు); 3. ఊరికివెలుపల పసులుండుచోటు; 4. గోవులమంద యుండుచోటు, పశువులసాల (అని కొందఱు): చూ, సదనము. 1.

మందకట్టు. దే వి. 1. గొల్లపల్లెవారు ఏర్పఱచుకొన్న యేర్పాటు: మందగట్టు. వా. 2 చూ, పెంటగట్టు; 3. వరిమళ్ళయందు బలమునకై పశువులను నిలుపుట మందగట్టు

మందగట్టు దే,వా.వి —పై.— [మంథరుఁడు.

మందగామి సం విశే. (పు. ఈ. న): చూ,

మందగించు. నై. అ క్రి. 1 మందమగు "ఆఁకలిమందగించెను" జెంపారు. (సం) —మందీభవించు, వా 2 చూ, సన్నగిలు. "వాడి మందగించినది." 3 తగ్గు "ధరిమందగించెను."

మందగొను దే అ క్రి మందగాఁగూడు.

మందట దే. వి. 1.వ్యవహారయోగ్యము; 2 చూ, సమీపము. 1 పంచ. నా 1, ఆ 562; 3 చూ, వినయము 1 హరి,ఉ 7, ఆ.39

మందటిలు. దే. అ. క్రి. రూ-మందటిల్లు. అనఁగ య 4, ఆ 81 చూ, సుప్రిక్కు. 9.

మందడి. వై వి 1.=మందురా. లాయము చూ, సదవము 1; వా. 2. ఉమ్మడి "మీకును మాకును వ్యవహారపుమందడివిడి పోవలయును." "గోడమండడి" పెం

మందడీఁడు దే. వి (మండడి + ఈఁడు) గుఱ్ఱపువాఁడు చూ, సాహిణి.

మందపిచ్చుక దే. వి కుర్వకపులుఁగు చూ, పిచ్చుక [అ. 15 చూ, వేగిరి

మందపోరియాలు ద్వ వి. గొల్లగి పొందు 2,

మందము. సం వి అ పుం 1 గజజాతి విశేషము (యుద్ధకాలమందు వాహనయోగ్యమైనది) చూ, హస్తి; విశే 2 చొరవలేనిది చూ, మూఢము 2; 3 మెల్లనిది చూ, మంథరము 3, అం. 4 చూ, గజజాతులు, 5 చూ, ముఖరజ్జువులు, 6: చూ, వారికాకిరితులు; 7 చూ, కుగ్రీహులు; దే. విశే (1). దట్టము. చూ, సాంద్రము 2, (2) లావు: చూ, స్థూలము. 2.

మందరము. సం. వి. అ. పుం. 1. కవ్వపుఁగొండ: చూ పర్వతము; 2 మందారమను కల్పవృక్షము: చూ, కల్పవృక్షములు; 3: చూ, స్వర్గము; విశే 4 అలసము: చూ, విలంబము. 1; 5. బహుళము చూ, హారాళము.

మందరావర్తి. అం: చూ, అశుభావర్తములు.

మందరి. దే వి: చూ, వైద్యుఁడు

మందల. దే. వి. 1. ఉసులు: చూ, పాగ్రము. 6; 2 మేర చూ, విధము. 1; 3 చూ, సమీపము. 1; వా 4 హద్దు: చూ,సీమ. 1.

మందలించు దే. స క్రి 1 చెప్పు చూ, పచించు, 2 ఆజ్ఞాపించు భాగ. 2, స్కం 188: చూ, పెలిపిచ్చు; 3 మనవిచేయు అని. 3, ఆ 25 చూ, విన్నవించు; 4 చూ, హెచ్చరించు, 5 తలఁచు చూ, యోచించు; వా 6. అదమాయించు. (కొద్దిగాశిక్షించు.): చూ, శిక్షించు [2 అదమాయింపు.

మందలింపు దే వి. 1 చూ, వ్యవహారము. 8;

మందస వై వి.=మంజూష రూ-మందసము. పెట్టె: చూ, సందుక [83.

మందసము. వై వి.=—పై — నీలా. 3, అ.

మందస్మితము సం వి అ పుం. చిఱునగవు: చూ, హాస్యము 1.

మందహాసము సం. వి అ పుం.—పై —

మందాకిని. సం. వి. ఈ. స్త్రీ 1. గంగ. చూ, నది; 2 ఆకాశగంగ: చూ, నది; 3. ఐరావతేంద్ర ఆఁడుది చూ, స్త్రీ; పా 4: చూ, వృత్తము 1. [చూ, వృక్షము.

మందాకు. దే. వి. (మందు + ఆకు) ఓషధి:

మందాక్రాంతము. పా: చూ, వృత్తము. 1. ("మ, భ, న, త, త, గగములు 11 యతి. 15 వ ఛందస్సు.")

మందాక్షము సం. వి. అ. న: చూ, సిగ్గు.

మందాగ్ని. సం. వి. ఇ పుం: అగ్నిమాంద్యము.

మందాత్మగాంతము. అం: చూ, వస్త్రాంతములు.

మందామణి సం. వి. ఈ స్త్రీ పెద్దబాన· చూ, పాత్రము. 6—గ.

మందారము. సం. వి. అ పుం. 1. ఈగిమాను: చూ, వేలుపుఁజెట్టు; 2. జిల్లేడు* చూ, వికీరణము; 3 పారిభద్రము* చూ, పారిదము (1); అం· 4: చూ, కల్పవృక్షములు; దే వి (1) మేఘావరణము. చూ, మేఘము 1.

మంది దే వి 1 జనము చూ, సంతతి. 1, వా 2 సంతానము చూ, సంతతి. 1, 3 గుమి ఈ, రా 6, ఆ 105 చూ, పరివారము 1, 4 కాలుబలము యు 4, అ 155 చూ, భటుఁడు; వా బ 5 చేట్టములు "పెండ్లివారు ఎంతమందివచ్చిరి (ఎంతమంది_ఎండలు చేట్టములు.)" చూ, సంబంధి 1

మందిరము సం. వి అ న 1 ఇల్లు చూ, సదనము. 1; 2 పట్టణము· చూ, దేశములు, వా 3 దేవగృహము: చూ, సదనము 1, 4. అల్పదేవాలయము, ఇంటిలోని దేవునిపీఠము (అని కొందఱు) "రామమందిరము" చూ,సదనము. 1, పుం. 4 చూ,సముద్రము

మందీభవించు సం అ క్రి 1 చూ, మందగించు 1, వా 2 చూ, మందగించు. 2.

మందు దే వి 1 (ఇందు(చూ)భస్మములు,చూర్ణములు, లేహ్యములు, రసాయనములు, ఘృతములు, తైలములు, ద్రావకములు, గుటికౌషధములు, అంజనములు, కషాయములు, ఆసవములు మొదలగునవి చేరును) (సం) — అగదము, అజాయువు, ఔషధము, కమలము, గదారాతి, జయువు-జాయువు, తంత్రము, ప్రతిక్రియ, భేషజము-భైషజ్యము, యోగము; తద్విశేషములు. ౧ అతికించు మందునకు (సం) — జీవగఱ్ఱ, జీవనౌషధము, జీవాతువు; ౨. కంటి మందునకు (సం) — ఓడాలకము; 3. కుష్ఠమును మందునకు. (సం). — కుత్సితము,కుష్ఠఘ్నము, కుష్ఠహంత్రి, వాకుచి, హితావళి; ౪ పుంటిమందునకు (సం) — ఉపనాహము (తె) — పాలాము-మొలాము-మొల్లాము, ౫. శాఖింతమందునకు (తె). - కాయము (సం) - సర్పక్ష్య; ౬ బిడ్డలమందునకు. (సం) — కారము; ౭ బెల్లములో వండిన మందునకు (సం) — గుడకము, గుడేరము; ౮. విషమునకు — (చూ, సంగరము 6), (విగతవానికి "చూ, సంగరము 6"), 2 పథ్యౌషధము. ఋత్తు: చూ, రాజార్హము; వా 3 చావునకు ఇచ్చెడి ఔషధము "మందులవాఁడు మందు పెట్టి కాకినిచేంపెను". చూ, సంగరము 6; 4 చికిత్స, ఉపక్రమము, ప్రక్రమము, ప్రతిక్రియ, ప్రతీకారము; 5. చూ, విరవు; విణ. 6 చూ, వెక్కసము 3

మందుఁడు. సం వి. అ పుం 1 శని చూ, రాహువు 2· 2 చూ, సోమరి. 3: చూ, హీనుఁడు, 4 ఇచ్చవచ్చినట్లు తిరుగువాఁడు: చూ, సంచారి 2, 5 నిర్భాగ్యుఁడు చూ, వాడె; 6. చూ, మూర్ఖుఁడు; 7 చూ, వ్యాధితుఁడు [చూ, సదనము 1.

మందుపట్టె దే. వి బాణసంచు చేసెడుశాల:

మందుభాయి వా వి. నల్లమందుతినెడి సెవులుగొంటు· చూ, వ్యాధితుఁడు.

మందుమల ద్వ వి మందుచెట్లుండుకొండ: చూ, హిమాలయము (పర్వతము)

మందుర సం వి. ఆ స్త్రీ. 1 = మందువాలాయము: చూ, సదనము 1; 2. పడక: చూ, శయ్య. 1.

మందురపుఁడు. సం. వి అ పుం చూ, ప్లవంగుఁడు విక్రి. 3, అ 17. [సెవు

మందురా. దే. వి చంద్రుఁడు: చూ, హిమాం

మందులవారి దే విశ 1 మర్లుమందుపెట్టువది; 2. మర్లుమందుపెట్టువాఁడు మందులవాఁడు
మందులవాఁడు వా విశ 1 చూ, మందుల వారి. 2, 2 మందులు అమ్మెడువాఁడు, 3 మందులుచేయువాఁడు, 4 చూ, మందరి; 5 ఒకానొకకిరాతుఁడు చూ, వ్యాసుఁడు 1
మందమేలము దే వి 1 ఉపేక్ష చూ, సయ్యాట, 2 చూ, పరిహాసము, 3 ప్రియము, స్నేహము (అనకొంటలు) భో 4 ఆ 157 చూ, స్నేహము. 1
మందోదరి సం వి ఈ (స్త్రీ) 1 రావణుని భార్య చూ, భార్య, అం 2 చూ, కన్యకలు [చూ, వేఁడిమి
మందోష్ణము. సం వి అ న, విశ ఇంచుక వేఁడి
మందప్రకారవర్తిన్నము అం చూ, అలంకారము. 3 [లంకారములు
మంద్రమధ్యము అం చూ, సంచారివర్ణగతా
మంద్రము సం విశ 1 గంభీరమైనది (స్వరము) చూ, స్వరము 2, అం 2 చూ, స్థాయి
మంద్రస్థాయి అం చూ, ఉచ్చతమము. (హృదయమునందుండెడి కొంటె 7 స్వరముల గుంపు) [లంకారములు
మంద్రాంతము. అం చూ, సంచారివర్ణగతా
మంద్రాది. అం —తై— [మబ్బుకొను.
మంపిలు. దే అ క్రి రూ-మంపిల్లు. చూ,
మంపిల్లు దే. అ క్రి —తై —సా. 1, అ 68
మంప్ర దే వి మత్తు, మైకము హ. 1, అ 147 చూ, హేమిక.
మాంప్రగొను దే అ క్రి 1 చూ, మంపిలు ఉ, హ 4, అ. 26, ప్రే 2 మంపు గొలుపు. [ము, దహనము.
మంటరము దే వి కాల్చుట (సం) —ఓష
మంటనముసేయు దే స క్రి చూ, దహించు ఉ, హ 3, అ 158.

మంతె. దే. వి: అటుకడ—అటుకడము, ముచ్చె
మంథిము సం. వి. అ. న: చూ, పాగ.(హా)
మకతక్రియ అం: చూ, క్రియాంగములు. (అంగము 9)
మకరందము. సం వి అ. పుం 1 ఆసవము కుసుమము, పుష్పరసము, మరందము. (తె) —కమ్మనీరు, పూఁదేనియ-పూఁదేనె-పూవుఁగేనియ ("చూ, సుమనోరజము."), అం 3 చూ, జన్యతాళములు
మకరకంఠి సం వి. ఈ. (స్త్రీ) నడుమ మొసలి ముఖమేర్పఱచిన కంఠభూషణ చూ, భూషణము 2
మకరకుండలము సం వి అ. న. మొసలి ముఖమేర్పడఁజేసిన పురుషునికర్ణభూషణ: చూ, భూషణము 2 [గధ్వజుఁడు.
మకరకేతనుఁడు సం వి. అ పుం చూ, మక
మకరతము సం వి అ న రూ-మరకతము, ఉ, రా. 6, అ 76 చూ, రత్నము 1.
మకరతోరణము సం. వి అ. పుం, న మొసలి రూపమేర్పడఁజేసిన తోరణము (చూ, తోరణము) [నములు
మకరతోరణములు గట్టించుట అం. చూ, శోభ
మకరధ్వజుఁడు. సం వి. అ. పుం చూ, మకరాంకుఁడు
మకరము సం వి అ పుం. 1. పెద్దచేఁప చూ, మత్స్యము 1, 2. మొసలి: చూ, మత్స్యము 1, అం 3. మకరమనునిధి చూ, నిధులు చూ, లిప్సు 1-2, 4. అభినయ హస్తవిశేషము చూ, వ్యంజకము 1, 5 మొసలిరాశి చూ, రాసులు, 6 చూ, ఆసనములు; 7 చూ, శస్త్రములు, 8 చూ, భోగవ్యూహములు, 9: చూ, పరిధానవ్యూహములు, వా వి అ పుం 10. మట్టమధ్యాహ్నము, ఎండవేళ. "నెత్తిమీదుమెండఁగా మకరములోపచ్చిరిని"

మకరాంకుఁడు. సం. వి అ. పుం. చూ, మన్మథుఁడు. [సముద్రము

మకరాలయము. సం. వి అ. పుం. చూ,

మకరిక. సం వి ఆ స్త్రీ. స్త్రీలకు చెక్కిళ్ల లోనగు తావులయందు లత్తుకతో వ్రాసెడు మకరరూపమగు రేఖ ఉ, రా 1, ప 44 మకరికాపత్రము

మకరికాపత్రము. సం వి. అ న — పై —

మకరివల వి. వి మృగములనుబట్టెడువల చూ, వల 1 [స్థలము, ఎస.

మకాము. వా వి. ప్రయాణమందునిలుచే

మకిల వై. వి 1 నలుపు చూ, వర్ణము 6, 2 మలిన. మాలిన్యము చూ, మలినము 1.

మకిలి వా వి చూ, మకిల.2 [సీసకము (1)

మకుటము సం. వి అ న కిరీటము చూ,

మకురము సం. వి అ పుం 1 అద్దము చూ, ముకురము, 2 చూ. పొగడ*, 3 చూ, మల్లెపువ్వు; 4. కుమ్మరిసారెదిరిగెడుకఱ్ఱ

మకుస. గే వి చూ, మూర్ఖ్యము

మకురుతనము దే వి. — పై —

మకుష్ఠకము సం.వి అ పుం.బ (రూ- ముకుష్ఠకము- మపుష్ఠకము - మయష్టకము - మయుష్ఠకము) అడవిపెసలు. చూ, పెసర. [విశిల్య 4.

మకూలకము సం వి అ పుం దంతి* చూ,

మకూలము సం వి. అ పుం — పై —

మక్క. వై వి. 1 నిలువైక పొన్నయము మలుగు-మల్గు, 2 పెద్దలతల్లి పొత్తికడుపున బుట్టెడి అపాయకరమగు నెత్తురుగడ్డ మక్కనగాయ: చూ, వ్రణము 1, 3 కాలఖండము చూ, యకృత్తు

మక్కనగాయ ద్వ వి చూ, మక్క 2.

మక్కలు వై. వి మక్కొ మొక్కజొన్నలు చూ, స్తంబకరి (ధాన్యము).

మక్కల్లము. సం. వి అ. పుం చూ, మక్క.2.

మక్కళించు దే అ. క్రి. 1 తిరుగుకొను: చూ, వెనుదీయు; 2 చూ, సరిపడు. 2 వై 6, ఆ 108, 3 చూ, సరిపోలు. ఉ, హరి 6, ఆ 250; అం ప్రే 4 తిరుగు కొనఁజేయు పా 1, ఆ 53; 5 సరిపఱచు కాశీ. 3, ఆ 118, 6 సరిపోల్చు ఉ, హరి 5, ఆ 50

మక్కా. వై వి అమఘ యవనదేశమందలి ముఖ్యపట్టణము చూ, సీమ.(1) (దేశములు.)

మక్కి దే వి ఉప్పారము చూ, ఇండు. 2.

మక్కికిమక్కి అ 1 ఉన్నదున్నట్లు "తెల్గు సేయఁగా, మక్కికిమక్కియున్నటులు మార్చినకావ్యము శ్రావ్యమెట్లగున్" (శ్రీనివాసవిలాసము); వా. 2. వారుచేసినట్లు పిరుచేయుట. "దెబ్బకుదెబ్బ యన్నటుల మక్కికిమక్కిచేసెను."; 3 అసలుకు సరియగునకలు

మక్కు దే వి 1 మాలిన్యము చూ, మలినము 1, 2 చింతఅంబలితో బొమ్మలను పెట్టిన అతుకు; అ. క్రి 3 కాంతిహీనమగు చూ, మ్రక్కు; 4 చూ, శోషించు పంచ నా 2, ఆ 179, 5 చూ, మాణించు య 3, ఆ 123, స క్రి. 6. గీలు. అచ్చు. యా, కాం 423 చూ, అక్కు, వా వి. బ. 7 పువ్వులయొక్క నాలితొడిమ కట్టెడు కట్టపుల్లలు; బ. 8 పువ్వులయొక్క అద్యంతముల నిడు నటుగుచ్చెడుకొయ్యతునకలు; బ. 9. ఎముకలు చూ, శల్యము. 1

మక్కువ. దే వి కూరిమి. చూ, స్నేహము 1

మక్కో. దే. వి. బ చూ, మక్కు. 9

మక్తా వా. వి. రైతు ఈనాందారునకిచ్చెడు ధాన్యాదికము.

మక్షిక. సం. వి అ. స్త్రీ క్రిమిలూనము, క్షుద్ర, గంధలోలుప, చర్వణ, నీలంగువు.

(తె) —ఈఁగ-ఈఁగె, ఈవ-ఈవె, వల్లని యీఁగ, తిర్విశేషములు —౧ అడవి యీఁగకు —క్షుద్రి, క్షుద్రిక, గోమక్షిక, దంశము, వనమక్షిక. (తె) — అడవి యీఁగ-అడవీఁగ, జోల్టీఁగ-జోటీఁగ-జోఱీఁగ; ౨. కణుఁదురీఁగకు.—కంటక, కంటకాసన, కణ, కాష్ఠకారి, గండోలి-గండోలి, గృహిణి, తృణపట్పదము, భృంగరోలము, వరటము, వరోలము, విఘస్పృక్కు, శూకకీటము (తె) —కందురీఁగ-కందురు- కణుఁదురీఁగ-కణుఁదురీఁగ, కడుఁదురు – కణుఁదురు-కనుఁదురు, ౩ చిన్నయీఁగకు —క్షుద్రిదంశక, ౪. తేనెటీఁగకు.—క్షుద్రి, పతంగిక, పుత్తిక, మధుమక్షిక, సరఘ (తె) —జుంటీఁగ, తేనెటీఁగ-తేనీఁగ, తూనీఁగ-తూనీఁగ, తేరయీఁగ, ౫ పెరయీఁగ: ౫ నీరుపట్టు యీఁగకు.—ఘోణి, ౬. నోటిపట్టుయీఁగకు —కుంభీరమక్షిక, ఘోణి, ౭ పశుమక్షికకు -పశుమక్షిక (తె) —జోల్టీఁగ-జోటీఁగ-జోఱుటీఁగ, ౮. జొద్దీఁగకు (తె) —బదిదెపురుగు-బదిణెపురుగు-బదిదె పురుగు, జొద్దీఁగ-జొద్దీఁగ,౯ వల్మీకమక్షికకు (తె) —ఈసలు (మిగతవానికి "చూ, సరఘ") [యజ్ఞము

మఖము. సం వి అ. పుం. రూ—మఘము చూ,

మఖవంతుఁడు సం. వి క్. పుం ఇంద్రుఁడు చూ, సహస్రాక్షుఁడు.

మ.ఖవ్రుఁడు సం వి. క్ పుం —పై.—

మగ దే వి పుంస్త్వము "మగవాఁడు"

మగఁటిమి దే వి చూ, పౌరుషము. 1 (ఇది చింత్యము) [శౌర్యము 1

మగఁటిమి దే వి 1.—పై.—, 2: చూ,

మగఁడు. దే వి 1. పురుషుఁడు నిర్వ. 1, అ. ౪ చూ, మనుష్యుఁడు, 2 భర్త చూ, స్వామి. 2; 3. ప్రభువు. రామా. 5, ఆ. 204: చూ, స్వామి. 1; 4. శూరుఁడు చూ, పరాక్రముఁడు 2; (వృత్తియందంత్యవర్ణ లోపము "మగపాటు, మగపొందు") మొ.

మగఁడులేనియాఁడుది. అం. చూ, అవ్రికాళములు

మగచెయ్యులు ద్వ. వి బ చూ, సంయోగము.

మగణము. అం మూఁడుగురువులు."వైకుంఠా". చూ, అష్టగణలక్షణము.

మగతనము దే వి 1 చూ, పౌరుషము 1, 2 చూ, శౌర్యము 1.

మగది. దే వి. మొగది.

మగధము అం చూ, దేశములు

మగధుఁడు సం. వి. అ పుం వంశావళి చేది పడువాఁడు రూ—మాగధుఁడు, మధుకుఁడు చూ, వంది [పతిపత్ని.

మగవాలు. దే వి. (మగని + ఆలు) చూ,

మగనిఅన్న వా. వి. బావ, బావగారు

మగనిపే రెడనున్న పగలాఁడి దే. వి. చూ, లక్ష్మి. 1.

మగనిపైఁదోడు. వా. వి: చూ, దేవరుఁడు.

మగపనులు. వా వి బ చూ, మగచెయ్యులు

మగపాటి దే వి చూ, మగఁటిమి. 2

మగపాడి దే వి.1.—పై—; 2 చూ, పయికూటమి

మగపోడుములు దే వి.బ చూ,మగచెయ్యులు.

మగపోల్కికూటమి దే వి. చూ, మగపాడి 2

మగమానికపువాలు. ద్వ. వి. పన్రియుధము. నీలా. 3, ఆ 8 చూ, హేతి. 4 (బాణము 1)

మగమానికము. ద్వ వి పద్రిము: చూ,రత్నము.1.

మగకాతివాలు. ద్వ.వి చూ,మగమానికపువాలు.

మగటాయి దే వి: చూ, మగమానికము.

మగలాగు. దే. వి. చూ, పయికూటమి.

మగవాఁడు. దే. వి 1 చూ, మగఁడు. 1. విజ. 1, అ. 78, 2· చూ, మగఁడు. 4.

మగవానినడక. పా (దీనికి ఉపమానములు — ఏనుఁగు, ఎద్దు, సింహము )

మగవానివక్షము పా (దీనికి ఉపమానము.- తలుప్రు.) [ము· చూ, నాగసరము 1

మగిడి 'దే వి పాములవాఁడు ఊఁదెడువాద్య

మగియించే. దే.స.క్రి. చేంపు చూ, సంహరించే

మగుడ దే. దక్రి. పునరర్థకము·చూ, వెండియు

మగుడఁబడు ద్వ అ క్రి మరలు: చూ, వట్రిల్లు

మగుడు దే అ. క్రి —పై— [డ్చు.

మగుడుచే. దే ప్రే మగుడఁజేయు.రూ-మగు

మగుడ్చు దే ప్రే —పై— [మదులు

మగులు దే వి గోడమీఁదికప్పు మదురు-

మగులుగోడ ద్వ వి మదురుపెట్టినగోడ, మదురుగోడ కళా.3,అ.66 చూ, మఱుఁగుగోడ

మగువ. దే. వి ఆఁడుది. చూ, స్త్రీ

మగ్గపుగుంత ద్వ వి సాలెవాఁడు నేయుటకుఁ గూర్చున్నపుడు కాలుచోఁచుకొనెడుపల్లము హంస. 2, అ. 11

మగ్గము దే వి.సాలెవాఁడు నేసెడుయంత్రము తద్విశేషములు(ఉపకరణములు).-౧. అచ్చు; ౨ అను;అనుఁగోలి;3 కారపుఁబడుగు;౪. కుంచియ-కుంచె. ౫ (సం) —తంత్వాతర్చ వము, ౬. పంటియ-పంటె, పంటికఱ్ఱ, పంటెకోల, పఁగె (సం) —తసరము-త్రిసరము; ౭. పడుగు. (సం) —ఆతానము, తంత్రము, ౮ పలక; ౯. పేక; ౧౦ లాక, లాకచేయి, లాకబద్ద. (సం).—వ్రిపాణి; ౧౧ లాకకట్టు; ౧౨. సరి; (మిగతవానికి "చూ, సరి. 2") ( (౧) మగ్గము యొక్క ఉపకణములు —(ఇందుకొన్ని శిథిలకలుగానేరవు ) అచ్చు అతుకుట, అచ్చుబద్ద, అచ్చుతాడు, అరిక (తడుపుట); అర్చుట (చేయుట); ఊడితెలు, కండె; గడ్డపాఱ, గడ్డపలుగు; చేడు; చేడుముల్లు, చుట్టుకఱ్ఱలు, చుట్టుబద్దలు, గుదిబద్దలు, గోఁజో, గంజి; జోవ్వలు-నవ్వలు; దోనియ-దోనె, నాడి, నాడిముల్లు; నేఁతలాకలు, బండి, మొలలాకలు; మోకు; మోకుగిలక; సుద్దకడ్డి (౨) రాట్నములోని భాగములు.—అడ్డ; ఆకులు; ఇరుసు; ఊఁచెలు; కిదురు; గుంజెలు; చెవులనడుమ దారము; చెవులపీఁట; తొక్కుడుపీఁట; దారము, పోగు,తంతువు (మిగతవానికి "చూ, సరి. 2.") [వాఁడు.

మగ్గరి. దే. వి (మగ్గము + అరి) చూ, సాలె

మగ్గు దే. అ క్రి. ఉక్కచే చెమ్మగిల్లిచెడు: మగ్గుడుపాలు

మగ్గుడు దే వి మగ్గుట'

మగ్గుడుపాలు. దే. అ. క్రి. చూ, మగ్గు

మగ్గాఁడు వా వి. అధికారము. [హితము.

మగ్నము. సం విణ. మునిఁగినది చూ, విగా

మఘ సం వి ఆ. స్త్రీ 1· చూ, మక్కలు; అం 2 చూ, పితరులచుక్క

మఘము సం. వి అ. పుం. 1· చూ, రూ-మఖము; 2 ఒకదీవి· చూ, లంక (1)

మఘవంతుఁడు. సం. వి. న్. పుం. చూ, రూ-మఖవంతుఁడు

మఘవుఁడు సం వి న్ పుం.—పై—

మఘాభువు. సం వి. ఊ పుం. శుక్రుఁడు: చూ, రాహువు. 2

మచర్చిక అం: చూ, శ్రేష్ఠవాచకములు

మచ్చిక. దే వి. రూ-మచ్చికె-మచ్చిగ. 1 ప్రేమము చూ, స్నేహము 1; 2 మోహము. భాగ. 7, స్కం. 46, మార్క. 5, ఆ. 200: చూ, వలపు 2, 3 చూ, వాంఛ 4: చూ, బుజ్జగము. 1

మేచకము. సం. వి. అ.న. 1.=మసకవ. చీఁకటి. (చీఁకటికిని, ఇందుల విశేషములకును "చూ, శ్యామిక. 1."); పుం. 2. నెమలిపురికన్ను: చంద్రికము, మేచకము. (తె.) కన్ను, పించియము-పించెము; 3.నలుపు: చూ, వర్ణము 6; విశే. 4 నల్లనిది: చూ, వర్ణము. 6

మేచే. దే. వి. కడియు: చూ, కల్యాలము.

మేజా. వా. వి. బల్ల: చూ, సింహాసనము.

మేజువాణి. వా. వి. రూ-మేజువాని. 1. భోగమువాండ్రమేళము, నాగవాసము చూ, వేశ్య; 2. భోగమువాండ్ర ఆటస్థలము: చూ, స్థానము. 1; 3 విందు.

మేజువాని. వా. వి. —పై —

మేజోడు. వా వి పాదగతులకు లోపలఁగాలికి వేయుజోడు: చూ, సమ్మెరిగలు.

మేట దే వి: చూ, ఎక్కలి "ఇసుకమేట."

మేటరి. దే. విశే. (మేటి + అరి) మేటి: చూ, శ్రేష్ఠుఁడు.

మేటి. దే వి. 1. ఏలిక. హరి. పూ. 7, అ 206: చూ, స్వామి 1: 2 రూ-మేటు. కసవుఁగుప్ప, గడ్డిమేటి, గడ్డివామి (సం).-గరకము: చూ, వెంటి; విశే. 3. చూ, శ్రేష్ఠుఁడు; 4: చూ, శ్రేష్ఠము; వా. 5. చిల్లరపనులు చేయుబంటు: చూ, సేవకుఁడు. 1.

మేటినీరుచూలిమెయి దాలుపులసామి. ద్వ. వి. చూ, వరుణుఁడు. ఆం ఎం. దే. 21.

మేటిల్లు. దే. అ. క్రి. అతిశయించు. హరి. పూ. 9, అ. 13 చూ, సందడించు.

మేటు వా. వి: చూ, రూ-మేటి.

మేడ. దే. వి. సౌధము. కళా 6, అ. 138 చూ, సదనము 1.

మేడము. వై. వి. 1.=మేళ. కూడిక. ఉ, రా 2, అ 188: చూ, సంయోగము; 2: చూ, యుద్ధము. [వాటులాడు.

మేడముపాడుడు. ద్వ. అ క్రి. పెనఁగు: చూ,

మేడమెట్టు. వా.వి. మేడచీడీ: చూ, సోపానము.

మేడి. దే. వి. 1: అంజోరు, అత్తి బొడ్డ. (సం).—అపుష్పము, ఉదుంబరము, కాంచనము, కృమికంటకము-క్రిమికంటకము-క్రిమికంటకము, క్షీరవృక్షము, క్షేమఫలం-క్షేమాఫల, జంతుఫలము, దుగ్ధము, పవిత్రకము, యజ్ఞాంగము, హేమదుగ్ధకము-తద్వి.—౧: (సం) కలిపోషానము; ౨ (సం) కుంకుమప్రియము; 3: (సం) అద్యుదంబరి. (సంగతవానికి "చూ, హేమదుగ్ధకము."); వై. వి 2=మేళ. నాఁగటికిఁజేతికిఁగల్గు కొయ్య: చూ, లాంగలము 1.

మేడియము. దే. వి చెక్కడపు జోమికీయందే వనితరము: రూ-మేడెము.

మేడు. దే వి. మిట్టు చూ, భూమి. 1.

మేడుపడు ద్వ అ. క్రి అజ్ఞతఁబొందు. రూ-మేడ్పడు.

మేడెము. దే. వి: చూ, రూ-మేడియము.

మేడ్పడు. ద్వ. అ. క్రి: చూ, రూ-మేడుపడు.

మేఢ్రము సం. వి. అ. పుం: చూ, మగగుఱి.

మేఢ్రశ్వేతి. అం: చూ, చిత్రవర్ణములు.

మేతాలుపు. దే. వి: చూ, రూ-మయితాలుపు.

మేదకము. సం. వి. అ. పుం. పెళ్లెము: చూ, సుర. 2.

మేదకుఁడు దే.విశే.అంబష్ఠ, దమ్మఁడు.(సం).-అకౌటిల్యుఁడు, నిష్కపటి-నిష్కపటుఁడు.

మేదతనము. దే. వి. సాధుత్వము.

మేదర. దే. వి. వెదురు బొంగులు లోనగువానిని అమ్మి జీవించెడుజాతి. [దలు): చూ, మేదరి.

మేదరవాఁడు. దే. వి. (వై.=మేంధ్ర). అనికొం

మేదరసాని. ద్వ. వి. మేదరవానిభార్య: చూ, సహధర్మిణి(భార్య.)

మేదరి. వై. వి.=మాహేంద్ర.(దేశ్యమని శ.ర.) (మేదర + ఇ): చూ, వేణులావకుఁడు. హర. 1, అ. 128. [చూ, మెదడు.

మేదస్సు. సం. వి. స. న.=మెదడు-మేదుః

మేదావి. దే. వి. ఔపాసనాగ్ని కుశి.కళా.4,ఆ.44 చూ, సిగరి. 1(భస్మము.) [కాశీ.3,ఆ.118.

మేదించే. వై. స. క్రి: చూ, రూ—మెదించే

మేదిని. సం. వి. ఈ. స్త్రీ. 1: చూ, భూమి. 1; అం 2: చూ, వృత్తము. 1. (న-జ-భ-జ-గ గురువులు. 11 యతి. 16వఛందస్సు.)

మేదు. వై. వి.=మేదస్: చూ, మేదస్సు

మేదురము. సం. విణ. చిక్కనైనను పైనది.

మేదురుఁడు. సం. విణ. (తె).—గరగరనివాఁడు, మిసమిసనివాఁడు. [హృల్లేఖము. 2.

మేధ. సం. వి. ఆ. స్త్రీ. అవలధ: చూ,

మేధము. సం. వి. అ. పుం: చూ, యజ్ఞము.

మేధావి. సం. వి. న్. పుం. 1. చిలుక: చూ, శుకము. 2: విణ. 2. ధారణాశక్తిగల గొప్ప బుద్ధిగలవాఁడు: చూ, విద్వాంసుఁడు.

మేధి. సం. వి. ఇ. పుం. కట్టుగొయ్యి: చూ, స్తంభము.

మేధ్యము. సం. వి. అ, పుం. 1. ముంజికసవు*. చూ, హారిత (తృణము. 1.); విణ. 2. పవిత్రమైనది. (వస్తువు): పవిత్రము, పూతము: చూ, సమీచీనము.

మేన. సం. వి. ఆ. స్త్రీ. 1: మేనక; దే. వి (1) తోఁడఁబుట్టినదానియొక్కయు, తండ్రి తోఁడఁబుట్టిన దాని యొక్కయు, తల్లి తోఁడఁబుట్టిన వానియొక్కయు దేహసంబంధము. ఉదా — మేనఁగోడలు (తోఁడఁబుట్టినదానికూఁతురు), మేనత్త (తండ్రితోఁడఁబుట్టినది), మేనబావ (తనకంటె పెద్దవాఁడైన మేనత్త మేనమామలకొడుకు), మేనమఱఁదలు (తనకంటె చిన్నదైన మేనత్త మేనమామల కూఁతురు), మేనమఱఁది (తనకంటె చిన్నవాఁడైన మేనత్త మేనమామల కొడుకు), మేనమామ (తల్లితోఁడఁబుట్టినవాఁడు), మేనల్లుఁడు (తోఁడఁబుట్టినదానికొడుకు), మేనవదిన (తనకంటె పెద్దదైన మేనత్తమేనమామలకూఁతురు) (చూ, మేనరికము.)

మేనక. సం. వి. ఆ. స్త్రీ: చూ, మేన. 1.

మేనకాత్మజ. సం. వి. ఆ. స్త్రీ: చూ, పార్వతి.

మేనఁగోడలు: చూ, మేన. (1).

మేనత్త. దే. వి: అత్త అత్తమ్మ, అత్తయ్య. (సం).— అంబిక. (చూ, మేన (1))

మేనత్తకొడుకు. వా. వి: చూ, మేనబావ.

మేనత్తమగఁడు. వా. వి: చూ, మామ 3. (మేనత్తమగఁడు మేనమామకాఁడు. పినతల్లిమగఁడు పినతండ్రికాఁడు. అనిలోకోక్తి.)

మేనబావ. దే. వి: మేనత్తకొడుకు. (సం) — పైతృష్వ సేయుఁడు — పైతృష్వస్రీయుఁడు. (మేన. (1).)

మేనమఱఁదలు. వా. వి. (చూ, మేన, (1).)

మేనమఱఁది. వా. వి: (చూ, మేన (1).)

మేనమామ. దే. వి. 1. తల్లితోఁడఁబుట్టినవాఁడు: మామ. (సం).—అధీగవుఁడు, కలాదుఁడు, గురువు, భోజ్యుఁడు, మాతులుఁడు, మామకుఁడు; అం. 2: చూ, స్త్రీరక్షకులు; 3. చూ, గయాపిండదానార్హులు.

మేనయల్లుఁడు. వా. వి: చూ, రూ-మేనల్లుఁడు.

మేనరికము. దే వి తోఁడఁబుట్టినదానియొక్కయు, తండ్రితోఁడఁబుట్టినదానియొక్కయు, తల్లితోఁడఁబుట్టినవానియొక్కయు దేహసంబంధభావము, శరీరసంబంధబంధుత్వభావము: చూ, మేన. (1)

మేనల్లుఁడు. దే వి. రూ-మేనయల్లుఁడు: చూ, స్వస్రీయుఁడు. (చూ, మేన. (1).)

మేనవదిన. దే. వి: (చూ, మేన. (1).)

మేనా. వా. వి. పల్లకి: చూ, సవారి.

మేనాదము. వా. వి. 1. పిల్లి: చూ, మార్జాలము; 2. మేఁకపోతు: చూ, మేషము. 1.

మేనాధవము. సం. వి. అ. పుం. హిమాద్రి: చూ, పర్వతము. [మయి-మై-మే.)

మేని. దే. వి. కాంతి: చూ, వెలుతురు. 1.(రూ—

మేను. దే. వి. (రూ-మయి-మై-మే.)1: చూ, శరీరము; 2: చూ, సంభవము; 3: చూ, పార్శ్వము. 2. [అచ్చ. బాల, కాం. 54.
మేనుకాలువు. దే.వి: చూ, రూ-మయికాలువు.
మేనుకాలువులసామి. ద్వ. వి: చూ, వరుణుఁడు.
మేనేజరు. వా. వి. పైయధికారి.
మేనచ్చేన. ద్వ. వి చిహ్నము చూ, లక్షణము.1.
మేపరి. దే.విణ. (మేపు+అరి): చూ, భక్షకుఁడు.
మేపు. దే. వి 1 పశుపక్ష్యాద్యాహారము. పాండు. 4, ఆ. 227; 2. దోసెపిండి మెదిరైనదానికి నూతికూడఁజేర్చుదుమినుప పప్పులోనగునది; క్రి 3. మేయఁజేయు.
మేపుట్టువు. దే. వి. 1. కూఁతురు: చూ, నూన.1; 2. కొడుకు చూ, నూనుఁడు. 2
మేపుమేయు. దే అ. క్రి: గర్వాడు.(భక్షించే)
మేమరుగు. దే. వి (రూ-మేమరువు-మేమర్వు-మేమఱువు) కవచము. చూ, వారవారణము
మేమరపు దే. వి: చూ, మూర్ఛ.
మేమరువు. దే. వి: చూ, రూ-మేమరుగు.
మేమర్వు. దే. వి.—పై—
మేమఱువు దే వి —పై—
మేము దే స.బ.అస్మచ్ఛబ్ద ప్రథమాబహువచనము.
మేముడు. దే. వి. మేకోలు. చూ, సమ్మతి 1.
మేమెయి. దే. వి.క్రి.విణ.(రూ-మెయిమెయి-మైమై-మైగయి-మయిమయి): చూ, రూ-మయిమయి.
మేయు. దే. స. క్రి పశ్వాదులు మేఁతఁదిను. భాగ. 7, స్కం. 61; కాశీ. 6, ఆ. 257; హరిశ్చ. 1, ఆ. 140.
మేర. వై. వి =మిరా. 1. సీమాస్థలము: చూ, సీమ. 1; 2 మర్యాద: చూ, సన్మానము; 3 క్రియము చూ, విధము. 1;4. ఏర్పాటు. రాజ,3, ఆ. 18: చూ, సత్యము. 1.
మేరగట్టు. ద్వ. వి. చక్రవాళాద్రి: చూ, పర్వతము ౧౫.
మేరతప్పు. వా. స. క్రి హద్దుమీఱు. ఆజ్ఞమీఱు.
మేరమీఱు. ద్వ. స క్రి: చూ, దాఁటు. 9.
మేరు దే వి. రూ-మేరువు. 1 ఎక్కుటకును దిగుటకును పొడుగుగా కట్టవలె వేయించెడి యినుపలోనగువాని దిబ్బ: చూ, సారువ. 1; 2. శిఖరమునందుండెడిమణి: చూ, సారువ. 4; 3 హారమధ్యమందు వ్రే లెడుమణి: చూ, సారువ. 5.
మేరువ. దే వి. వీణాగ్రము: చూ, వీణ.
మేరువు సం. వి. ఉ. పుం. 1. హేమాద్రి: చూ, పర్వతము; అం 2.వర్షపర్వతములలో నొకటి. చూ, పర్వతము. ౨౫; దే. వి. (1) చూ, రూ-మేరు. 1. య. 4, ఆ 82; (2) చూ, రూ-మేరు. 2. పను. 2, ఆ. 42, (3): చూ, రూ-మేరు 3.
మేల్. దే. వి. రూ-మేలు 1 క్షేమము. అం. భా. వ్రి 98: చూ, శుభము. 1; అవ్య. 2. చూ, సెబాసు.
మేలమాడు దే. స. క్రి. (మేలము + ఆడు) పరిహాసముచేయు: చూ, హసించే.
మేలము. దే. వి: చూ, పరిహాసనము.
మేలిచ్చెపులుఁగు. దే. వి. గరుడుఁడు: చూ, హరివాహనుఁడు.
మేలిమి. దే. వి. 1. అపరంజి చూ, లోహము. 1; 2. ఆధిక్యము చూ, సామ్యే. 2; 3. గౌరవము: చూ, సన్మానము.
మేలిమిమెట్టవిల్కాటి. దే. వి: చూ, శివుఁడు.
మేలిల్లు. దే. వి. (మేలు + ఇల్లు): చూ, మేడ.
మేలు. దే. వి. 1. క్షేమము: చూ, శుభము. 1; 2 ప్రేమము. అం. భా. వ్రి 186: చూ, స్నేహము; 3. చొక్కు. స్కా. 6, ఆ. 66: చూ, వలపు. 2; 4. ఒడుపు చూ, లాభము. 1; 5. మదము: చూ, పోడిమి; 6: చూ, సౌందర్యము; 7. పుణ్యము: చూ, సుకృతము. 1; 8. ధర్మము, బాగు; చూ, సుకృ

మేల్కను. దే. అ. క్రి: చూ, రూ-మేలుకను.

మేల్కనుపు. దే. ప్రే: చూ, రూ-మేలుకనుపు.

మేల్కొను. దే. అ. క్రి, స. క్రి: చూ, రూ-మేలుకొను. [కొలుపు.

మేల్దావరి. దే. వి: చూ, దేశ్య.

మేల్పడు. ద్వ. అ. క్రి: చూ, రూ-మేలుపడు. ఉ, రా. 4, ఆ. 198.

మేల్బంతి. ద్వ. వి. విశే: చూ, రూ-మేలుబంతి.

మేల్ముచ్చు. దే. వి: చూ, రూ-మేలుముచ్చు.

మేవ. దే. వి. 1: చూ, మూడిద; 2: చేవ: చూ, సత్త్వము. 1.

మేవడి. దే. వి. 1. నమ్రత: చూ, వంగుట; 2. ఉపాయము: చూ, వెరవు; 3 చూ, వినయము; విశే. 4: చూ, యోగ్యము.

మేవడికాఁడు. దే. విశే. 1: చూ, విధేయుఁడు; 2: చూ, సమర్థుఁడు; వా. 3. ఉపాయము గలవాఁడు. [మ్రొవు-మ్రేఁగు)

మేవు. దే. స క్రి: చూ, రూ-మేఁగు. (రూ-

మేష్టరు. వా. వి. 1. బడిపంతులు: చూ, సురాచార్యుఁడు (పంతులు), 2. పనిచేయువారిమీఁదపెద్ద, మేస్త్రీ: చూ, యజమానుఁడు 4

మేషము. సం. వి. అ. పుం. 1 = మేఁక: అజము, అతిరోమశము, అమాధ, అమాధురము, అల్పాయువు, ఇడిక్కము, ఉరణము, ఉరభ్రము, ఊర్ణము, ఊర్ణాయువు, బుక్షోసనము, ఏడకము, ఏరకము, కేకటము, ఛగలము, ఛాగము, ఛాగలకము, తగరము, దుంధము, దేవానాంప్రియము, పర్కరము, బలిక్రియాపహము, పర్ణభోజనము, బస్తము, బర్కరము, శాలవాహ్యకము, బుక్కము, మేండము, మేనాదము, లంబకర్ణము, లఘుకాయము, శర్కరము, వర్ణాత్రు, వృష్ణి, శివాప్రియము. (తె. వ).—అగ్నికత్తడి, ఇరుదంతేజి, ఏడిక, చింబోతు, తగరు, కొమము, పొటేలు-పొట్టెలు-పొట్టేలు, మేఁక, మేఁకపోతు, మేటి. తద్విశేషములు.—౧. ఆఁడు మేఁకకు.—అజ, గలస్తని-గళేస్తని, చులాంచ, భాగి-భాగిక, దేవానాంప్రియము, మేషి, సంజాచులుంచ. (తె). ఆఁడుమేఁక, చింబు, మేచ్చె; ౨: అజౌఘము, అజకము, అజము. (తె).—మేఁకలమంద; 3: (తె).—కంచిమేఁక; ౪. కుల్మాషము—కుల్మాసము; ౫ (తె). గొరియ: ౬: (తె) మేఁక, మేఁకపిల్ల; ౭: వనచ్ఛాగము. (తె).—అడవిమేఁక; మగ్గొర్రె:—౮. మగగొఱ్ఱెకు.—పశువు, బహురోగము, మేషము, రోమశము, లోమశము, సంస్ఫాలము, హుడువు; ౯. ఆఁడుగొఱ్ఱెకు.—అవి, ఏడక, ఏరక, కురరి, గడ్డర, జాలకిని, ప్లవము, మేషి. (తె) —ఆఁడుగొఱ్ఱె, ఏలిక, గొఱియ-గొఱె-గొఱ్ఱియ-గొఱ్ఱె; ౧౦: ఔరణము, ఔరభ్రకము, ఔరభ్రము. (తె).—గొఱ్ఱెలమంద; ౧౧: (తె). కురుచగొఱ్ఱె-కురుమగొఱ్ఱె; ౧౨: లోకాల్యము, రోహిషము-రాహిషము (తె).-కొండగొఱియ-కొండగొఱ్ఱియ - కొండగొఱ్ఱె. (మిగతవానికి "చూ, హుడువు") (మేషము=మగమేఁక, మగగొఱ్ఱెయునియు, మేషి=ఆఁడుమేఁక, ఆఁడుగొఱ్ఱెయునియు రెండు విధములుగ వాడుచున్నారు.); 2.=మేఁకరాశి, మొదటిరాశి. "మీనమేషములు లెక్కించుచున్నాఁడు.": చూ, రాసులు; 3. ఒక మందు: చూ, వంగరము 8. (చూ, మందు 1.)

మేషయుద్ధన్యాయము. లం. పొటేళ్లుదెబ్బలాడుచుండఁగా మధ్యను వక్కుపడిచచ్చినదానివలె.

మేషి. హా. సం. వి. ఈ. (స్త్రీ).1. గొఱ్ఱె, ఆఁడు గొఱ్ఱె: చూ, మేషము. 1; 2. మేఁక, ఆఁడు మేఁక: చూ, మేషము. 1.

మైలా. వా. వి: చూ, రూ. మయిలా. [మైల త్రము.
మైలతుత్తము. వై. వి.=: చూ, రూ_మైల
మైలపడి. దే. వి: చూ, రూ-మయిలపడి. (విధుర వశి.—వై. 6, అ. 115.)
మైసాక్షి. వా. వి. సాగ చేయుట కుదరదాగించే ఒకమందువస్తువు. (దీని చెట్టు.—మహిసాక్షము, కాలరసము *)

## మొ

మొంగ. దే. వి. ఎన్నులపోఁగు, మంగ: చూ, సస్యము. 1.
మొంటి. దే. వి. (రూ-మొంటె-మొఱటె-మొఱఁటి, కాలికలాడుకోసె చిన్నచేట: చూ, శూర్పము. 1.
మొంటె దే. వి — వై — [మొండికట్టె 3.
మొండరి. ద్వ. విశే. (మొండి+అరి): చూ,
మొండాడు. ద్వ. అ. క్రి. (మొండి+ఆడు) మొండాటలాడు. యయా 3 అ. 16
మొండి. వై. విశే.=ముండ. (రూ-మొండియము-మొండెము) 1. చేతులుకాళ్లు తెగినవాఁడు. భో. 5, అ 98: చూ, మొండివాడు; 2. ఛిన్నశర్యము: మొండు, మొండుమొల, మొల్ల; 3.=మూఢ. మూర్ఖుఁడు: చూ, మ్లేచ్ఛుఁడు; 4. కొంత తెగినది (చేయికాలులో నగునది): మొండు; 4. మొక్కపోయినది. "మొండిగంటము": మొండు; 6 పట్టిది. "మొండిమొండెనగలు లేనిది": మొండు.
మొండికట్టె. వై. విశే. 1. కుజనుఁడు: చూ, వ్యాధుఁడు: 2;3: చూ, మొండి. 3;3 మొండికనముకలవాఁడు: మొండరి. [మొండెము.
మొండియము. వై. వి.=ముండ: చూ, రూ-
మొండు వై. విశే: చూ, రూ-మొండి.3.4 5 6
మొండుమొల. ద్వ. వి: చూ, మొండి. 2
మొండె. వై. వి =ముండ: చూ, రూ-మొండెము.
మొండెపుగాయము. వై. వి. రాహువు: చూ, రాహువు. 1.
మొండెపురక్కసుఁడు. వై. వి. కబంధుఁడు. అచ్చ. అర, కాం.118: చూ, రాక్షసుఁడు.1.
మొండెము. వై. వి =ముండ: రూ-మొండి-మొండియము-మొండె-మొండ్రెము_మొండ్రెము, మొట్టె, అట్ట. (పం) —కబంధము, కమంధము, ముండము, రుండము.
మొండ్రెము. వా. వై వి.=—వై.—
మొకద్దమా. వా. వి వ్యవహారము.
మొకమలు దే. వి. మేలుకట్టు, రూ-మొకామలు-మొకమాలు: చూ, సూత్రము. 1.
మొకమాట. దే. వి. చూ, బాలక్రీడ.
మొకమాలు. దే. వి: చూ, రూ-మొకమలు.
మొకము. వై. వి =ముఖ: చూ, రూ-మొగము. ఉ. హరి. 4, అ. 216.
మొకరము. వై. వి.=ముష్కర (దే. అని కొం.ర) రూ-మొక్కరము. 1: చూ, స్తంభము. వసు. 6, అ. 76; 2. గడ్డిమాను: చూ. విష్కంభము. 2.
మొకరరు. వా. విశే. 1. ఏకరు. "వాఁడు మొకరరై మాట్లాడెను"; 2. నిర్ణయింపబడినది; 3: చూ, ఉకోత్త.
మొకరి. వై. విశే.=ముఖర. 1. మ్రోఁగునది, ధ్వనితము: చూ, రవణము. 2; 2. అసంబద్ధవచనములాడునది.
మొక్క. వై. వి. 1.=మాలికా*: ఇగురు-ఇగురు, ఈరిక, వసువు, మొటిక-మొట్టిక, మొలక-మొల్క-మొలక-మోక, మోటిక, మోడు-మోడు, మోసరిక-మోసేరిక-మోసు (పం).—అంకిలము, అంకురము-అంకూరము, అభినవోద్భిజ్జము, ఆరోహణము, ఉద్భిజ్జము, ఉద్భిత్తు, ఉద్భిదము, ఔద్భిదము, కందళము, కందరము, కలుపము.

పరిరోహము, మారిక, రోహము. తద్వికేప ముల.—౧ కొయ్యగాలనుండి మొలిచిన మొలకలు - నాము: ౨. చిగురు మొలకలు.— మొక్క, మొలక - మొల్క, మొలక - మోక: 3. కాటి విత్తునకు — కొంగట - గం గట, తెగ. (సం) — అశ్వోష్మి; ౪. కాటిమొలక; ౫ చెవుడు మొలకలు. - చెవుడు మొలక. (సం) —గమనము, శరీరము, చోరకి. (మిగతవానికి "చూ, వృక్షము"); 2. చిగురు మొలక. హరి. 6, అ. 64; చూ, మొక్క 1- ౨; విశే. 3.—మోసు' చూ, వ్యర్థము; 4. మొదమొడగినది' మొలక.

మొక్కడు దే. విశే. 1 బలిసినవాడు; చూ, లావరి; వై విశే. 2—మొక్కర. కఠినుడు. చూ, వ్యాఘుడు 2.

మొక్కచిక్కుడు. వా. వి: గోరుచిక్కుడు, మటిక - మట్టిక*. [పోతు. 2.

మొక్కచెవు. ద్వ. అ క్రి' చూ, మొక్క

మొక్కజొన్నలు. ద్వ వి బ: చూ, మక్కలు.

మొక్కటేడు, దే వి 1. చిన్నకొమ్ములుగల యెనుబోతు; చూ, రాస్త్రి, వై. 2—మొక్కర రూ. మొక్కడేడు - మొక్కడి కఠినుడు: చూ, వ్యాఘుడు 2. [వైకరి)

మొక్కట్టు. గ్య. వి. (మొకము + కట్టు) ముఖ

మొక్కడము. వై. వి.—మొక్కర. 1. దిట్టతనము; 2. కాఠిన్యము: చూ, మొక్కలము 5.

మొక్కడి. వై. వి —మొక్కర' చూ, రూ- మొక్కటేడు. 2.

మొక్కడీడు. వై. వి.—మొక్కర.— వై—

మొక్కపడు. వై. అ. క్రి. 1: చూ, మొక్కపోవు. 2; చేసి 2 మొక్కపుచ్చె. పా. 1. అ. 50.

మొక్కపోవు. ద్వ. అ. క్రి. 1. మొనముడిగినదగు: మొక్కలుపోవు, మొద్దువోవు, మొలవపోవు, మొనకుపడు - మొరిగిపడు, ఎవరు. (వి).—భగ్నమగు; 2: గుల్లపడు, చేటులుపడు, పాలిపోవు, బన్నపడు, మొక్కచెడు, మొక్కపడు మొక్కవోవు- మొక్కలుపోవు, మొలవపోవు, మొరిగిపడు, (వి) —అవమానపడు, భంగపడు; చేసి 3 మొక్కపుచ్చు.

మొక్కపోవుట. ద్వ. వి' (సం).—కుంఠనము.

మొక్కమామిడి ద్వ. వి. 1. జీడిమామిడి*: చూ, పరిశ. (చూ, సహకారము); వా. 2. విత్తుపలనబుట్టినమామిడి' చూ, మామిడి.

మొక్కము వై వి —మొక్కర.* (సం.వి).— కాలముష్కకము, క్షారదుమ్రము, క్షారవృక్షము, క్షారాఖ్యము ఘంట, ఘంటాపాటలము, ఘంటాపాటలి, గోలీఢము, గోలిహము, ఘూబలము, ముష్కకము - ముష్కము, మోక్షకము - మోక్షము, శిఖరి. ("చూ, శిఖరి. 4.")

మొక్కమొలచిపోవుట వా. చెడుట. గింజ మొలచేటచేత చెడుట. "ఒక్కపాటి యొక్కడి కాలిక్కడకు వేసినచో మొక్క మొలచి పోరుగాని రంపి" (ధర్మజరాజ మాయము)

మొక్కరము. వై. వి —మొక్కర (దే. అవిక. ర): చూ, రూ- మొకరము 1—2.

మొక్కలము. వై. వి 1. ఉత్సాహము. భో. 5, అ. 280: చూ, సన్నాహము.2; 2. రూ- మొగ్గెము. జై. 6, అ 118; చూ, కోడ్డెము. 3: 3. ధైర్యము. ఉ, హరి. 5, అ. 87: చూ, ధైర్యము; 4 అవిరితరము, ముష్కరత్వము. కాశీ.7, అ.74' రూ- మొక్కలము, మొగ్గలము; విశే. 5—మొక్కర. కాఠిన్యము. అర్చ, కిష్కిం, కాం. 64: మొక్కడము, మొగ్గరము. (చూ, బెడిదము); 6. అవిరితరము, మొగ్గలము: చూ, కార్క

తము; బ. 7. మస్కారవచనములు. జై 1, అ. 87: చూ, శబ్దము. 2.

మొక్కలి. వై. విశే. (మొక్కలము + ఇ) 1 = మూస్కర మస్కరుఁడు: చూ, వ్యాధుఁడు. 2; 2.=మూర్ఖ. మూర్ఖుఁడు: చూ, ప్రద్భుఁడు; 3. శూరుఁడు: చూ, వాంఠీరుఁడు

మొక్కలించు. వై. అ క్రి. 1. ముష్కరము చేయు; 2. ఉత్సహించు. చూ, పముకట్టు. 2

మొక్కలించుట. వై. వి. ముష్కరముచేయుట

మొక్కలికాఁడు. ద్వ విశే: చూ, మొక్కలి 1

మొక్కలీఁడు. వై. విశే.=ముష్కర (ద్వ అని శ. ర.): చూ, మొక్కలి. 1—2—3.

మొక్కలు. వై. వి. బ 1. పలుగకముల చిన్న చెట్లు; 2. ఒకరకము జొన్నలు; చూ, స్తంబకరి (ధాన్యము).

మొక్కలుఁడు. వై. విశే.=ముష్కర: చూ, మొక్కలి. 1—2—3 [క్కపోవు.

మొక్కవోవు. ద్వ. అ. క్రి: చూ, రూ-మొక్కలుపోవు. ద్వ. అ. క్రి.— పై.—

మొక్కశము. వై. వి =ముష్కర: చూ, రూ-మొక్కలము. 4.

మొక్కలి. వై. వి. 1: చూ, పనికుచ్చె: 2. ఈడిగ: చూ, సురాజీవి; 3 ముందువెనుకలఁ జూడనివాఁడు; 4. తళుకు, కాంతి: చూ, వెలుకుచు. 1.

మొక్కు. దే వి. 1 రూ-మ్రొక్కు. వతి చూ, వాణిగలు; బ. 2. పువాదుల మొక్కులు: (చూ, మక్కు. 7. చూ, నక్కు. 6) అ. క్రి 3: ప్ర రూ-మ్రొక్కు, అయిదువది చేయు-ఐదుపది చేయు, ఎఱఁగు-ఎఱుఁగు, చేమోడుచు-చేమోడ్పు, చేవిచ్చు, జోగిలు. (వం).—నమస్కరించు, నమించు; 4. మొకలించు. భో. 1, అ.101: చూ, మ్రొక్కు 8,

మొక్కుబడి. దే. వి. రూ-మ్రొక్కుబడి. 1. దేవతలకిచ్చెదనని మ్రొక్కుకొనినకానుక. "తిరుపతి దేవునకునిలువుదోఁపు మొక్కుబడిచెల్లించితిని.": (చూ, ముడుపు): 2. దైవప్రార్థనగంధ, యాచితకము. (చూ, ముడుపు) [దుపాంబ. దే. 9)

మొక్కుసాక్కుపాము ద్వ. వి. చూ, మూర్యోఁ

మొఖాసా. వా. వి. 1. తీరువలేనిభూమి; 2 చిన్న జమీందారి. [2. చిన్నజమీందారుఁడు.

మొఖాసాదారు వా. వి. 1: చూ, పాలెగాఁడు;

మొగ. వై. వి. 1. ద్వారము: చూ, వాకిలి; 2.=ముకుళ. యు. 4, అ. 26: చూ, రూ-మొగ్గ. 1; 3 =ముఖ: చూ, ముగము, 4. అప్రాణివస్తుముఖము. "మొగముక్కలి.": 5 తెలి. జై. 2, అ. 42: చూ, మొదలు. 4; 6. నదీసముద్రాదులముఖము: మొగాళము; 7. చూ, మొన. 1. [102. చూ, కల్దించు.

మొగకట్టు. ద్వ అ. క్రి. కూర్చుగు. వై. 6, అ.

మొగకొను. ద్వ. అ. క్రి. 1. ఎదురగు: చూ, పొడూరించు. 1; పై క్రి 2. మొగకొలుపు.

మొగచాటు. ద్వ. వి. వెగటు: చూ, విరసము 2.

మొగడ. వై. వి. గణికాదుల పెలికిల-మొగ్గ: చూ, రూ-మొగ్గ; 2.=ముకుళ. రామా. 4, అ. 66: చూ, రూ-మొగ్గ. 1.

మొగడదామర వై. వి: చూ, సోఁకుడుముడుఁగు*.

మొగడించు వై. అ క్రి: చూ, మొక్కు. 4.

మొగడు. దే. వి. కొప్పు, ఇంటినడికొప్పు. భాగ. 8, స్కం 809. చూ, నదనము. 1.

మొగతనము. వా. వి: చూ, రూ-మగతనము.

మొగతప్పు. ద్వ. అ. క్రి. పిఱుతివియు: చూ, మ్రొక్కు. 7.

మొగతిరుగు. ద్వ. అ. క్రి.— పై —

మొగదల. ద్వ. వి. 1. ఎదురు: చూ, ముందలు. 1; 2. ముందటిభాగము.

మొగదారవన్న. అం: చూ, మహాలక్ష్మి. 3.

మొగదాళము. ద్వ. వి. రూ-మొగపాళము-మొగవాళము: చూ, విస్సరణము.

మొద్దడు. వై. విశే. 1. మూఢుడు: చూ, స్తబ్ధుడు; 2: చూ, లావరి.

మొద్దు. వై. వి. 1.=స్థాణువు. మ్రానిమోడు: చూ, వృక్షము; విశే. 2.=మూఢ: చూ, మొద్దడు; 3. మూఢురాలు, మోటు: చూ, స్త్రీ; 4. వాడిలేనిది, మోటు; 5. లావు: చూ, స్థూలము.

మొద్దువోవు. ద్వి. అ. క్రి వాడిలేనిదగు. వై. 3, ఆ. 183 చూ, మొక్కపోవు.

మొన. దే. వి. 1. మొంగ. అగ్రము: చూ, మద. 3; 2. దండు: చూ, సేన. 1; 3. సేనా ముఖము: చూ, సేన 1; 4: చూ, వ్యూహ ము. 1; 5. ముందు: చూ, మొదలు. 4; 6 వరాదిమొన; 7: కలిమొన.

మొనకట్టు. దే. వి. 1. ఉత్సాహము: చూ, సన్నాహము; 2. ఒకానొక స్తంభనమాలిక: చూ, వృక్షము; విశే. 3. ఉత్సాహకరము; అ. క్రి. 4. ఉత్సహించు. పారిజా. 1, ఆ. 141: చూ, సమకట్టు. 2.

మొనకాడు. దే. వి. 1. సేనాధిపతి: చూ, సై నికుడు; విశే. 2. శూరుడు: చూ, పాంచీ రుడు; 3. ముఖ్యుడు చూ, శ్రేష్ఠుడు.2

మొనకొను. దే. అ. క్రి: చూ, మొనకట్టు. 4

మొనగాలు. దే. వి. అప్పండితవిశేషము: చూ, పాయము. [పోహరించు

మొనచేయు. దే. అ. క్రి. అభిముఖమగు: చూ,

మొనదప్పు. దే. అ. క్రి. విముఖమగు: చూ, మ్రొక్కు. 7.

మొనవు. దే. వి. 1. పూనిక. విక్రి. 6, ఆ. 78: చూ, సన్నాహము; పేరి. 2. పూనుకొయు; 3. కలగడేయు. రామా. 1, ఆ. 190.

మొనయించు. దే. స. క్రి: చూ, ఒడ్డు. 15.

మొనయు. దే. అ. క్రి. 1: చూ, మొనకట్టు. 4; 2: చూ, సంభవించు. పా. 4, ఆ. 12.

మొనరు. దే. అ. క్రి. ఒప్పు. కళా. 3, ఆ. 194: చూ, సమ్మతించు.

మొనలు. అం. (చూ, కాయమానములు.): లో మొన, వెలిమొన, ఉసిమొన, చకురుమొన, పుణ్యంపుమొన, పాపంపుమొన, చోటడుగు మొన, దాటమగుమొన, కదలుమొన, అర మోటుమొన, కెలమోటుమొన, సరికాకంపు మొన (12) (అనికొందఱు)

మొనసరి. దే విశే శూరుడు. చూ, పాంచీరుడు.

మొన్న. దే. వి. (మొదలా + నాడు) కడచిన దినమునకు ముందుదినము: చూ, వాసరము.

మొప్పలు. దే. వి. బ చేపమెడ కిరుప్రక్కల నుండు ద్వారములు.

మొప్పియ. దే. విశే. రూ-మొప్పె. 1. మూ ర్ఖుడు చూ, స్తబ్ధుడు; 2 కఱకు: చూ, బెడిదము.

మొప్పు. దే. వి. కీడు: చూ, హాని. 2

మొప్పె దే. విశే: చూ, రూ-మొప్పియ. 1—2; 3 ముప్కురురాలు: చూ, స్త్రీ.

మొయమొయ్యగా వా. అవ్య. కచ్చెపచ్చెగా. తగిలీతగులనట్లుగా. [(దే. అని. కర)

మొయిలు. వై. వి.=మేఘు: చూ, మేఘము. 1.

మొయిలుతేడు. దే. వి: చూ, వరుణుడు.

మొయులు. వై వి.=మేఘు: చూ, మొయిలు. (దే. అని క ర.)

మొర. దే. వి. రూ-మొరను-మోర. 1. వ శ్వాదుల దీర్ఘముఖము: చూ, వదనము. 3; 2. విందయందు మనుష్యముఖము: చూ, వదనము. 2.

మొరడు. దే. వి. మ్రోడు: చూ, వృక్షము.

మొరవ. దే. వి. (రూ-మొరమ-మొర్వ- మొరను.) కర్కరాళి: చూ, రాయి.

మొరవసేల. దే. వి. కర్కల-కర్కలము; రూ- మొరవుసేల- మొరనుసేల: చూ, పాపి ప్రియ. 2 (భూమి. 1—శా.)

మొరవము. దే. వి. మ్రోఁత: చూ, స్వరము. 2
మొరవుసేల. దే. వి: చూ, రూ—మొరవసేల.
మొరము. దే. వి: చూ, రూ—మొరవ.
మొరయిక. దే. వి: చూ, మొరవము.
మొరయు. దే. అ. క్రి· చూ, శబ్దించే
మొరలి. దే వి. మోరటి. చూ, సన్నకదుర్వు *
మొరసు. దే. వి. 1: చూ, రూ—మొఁగవ; 2: చూ, మొర. 1; 3· చూ, మొర. 2; 4· చూ, మొప్పియ. 1; 5 మూర్ఖము: చూ, మోటు. 6.
మొరసుసేల. దే వి. చూ. రూ—మొరవసేల.
మొరిఁటె. దే. వి· చూ, రూ—మొంటె
మొర్ము. దే. వి· చూ, రూ—మొరము. హరి. ఉ. 7, అ. 20.
మొఱ దే. వి. రూ—మొఱ్ఱ ఆర్తధ్వని. కాశీ. 4, అ 64: చూ, స్వరము. 2.
మొఱఁగు. దే వి. రూ—మొఱ్ఱ. 1. కుక్కకూఁత: రూ—మొఱుఁగు—మొఱుఁగుడు—మొఱవు: చూ, బొయ్యి; 2. మోసము. రూ—మొఱఁగుడు. భాగ. 10, స్క. ఫూ. 86 చూ, వంచన; విణ. 3· చూ, వంచకుఁడు. భాగ. 8, స్కం. 87, ప. క్రి. 4· చూ, వంచించే కాశీ. 4, అ. 38; 5. పొందే రామా. 5, అ 318: చూ, లాఁచే
మొఱఁగుడు. దే. వి: చూ, వంచన.
మొఱఁటి. వా. వి: చూ, రూ—మొంటి.
మొఱక. దే. వి. 1. న్యూనత· చూ, హీనము. 1; విణ. 2. న్యూనము: చూ, హీనము. 1.
మొఱకదము. దే వి. దౌష్ట్యము: చూ, వ్యళీకము. 2.
మొఱకు. వై. విణ. 1.—మూర్ఖ (రూ—మొఱ్ఱ—మొఱకుఁడు—మోఱకు—మోఱకుఁడు.): చూ, ప్రథుఁడు; 2. పరుషము: చూ, శబ్దము. 2.
మొఱకుఁడు. వై. విణ: చూ, రూ—మొఱకు. 1.
మొఱకుతనము. వై. వి.—మూర్ఖత్వ. (దే. అని శ. ర.): చూ, మూర్ఖ్యము. [కుటిలము.
మొఱఁగుపోఁగుబొక్కము. దే. వి. కుక్క: చూ,
మొఱటు. వై విణ.—మూర్ఖ. (దే. అని శ. ర.): చూ, రూ—మొఱకు. 1. [కుతనము.
మొఱటుతనము వై. వి.—: చూ, రూ—మొఱ
మొఱవు. దే వి: చూ, మొఱ.
మొఱపెట్టు. దే. అ క్రి రూ—మొఱ్ఱపెట్టు. (సం).—ఉద్ఘోషించే
మొఱమొఱ. వై. వి.—మర్మర. 1· చూ, మర్మరము; 2. కోపవికారము, చిఱచిఱ, రవరవ: చూ, కోపము.
మొఱమొఱలాడు. ద్వ. అ. క్రి. వస్త్రములలో నగునవి మొఱమొఱయని మ్రోయు.
మొఱయిడు. దే. అ. క్రి. రోదనముచేయు. చూ, శోకించే
మొఱప. దే విణ: చూ, మొక్క. 4.
మొఱపెట్టు. దే. అ. క్రి: చూ, మొక్కపో వు. కాశీ. 6, అ. 83.
మొఱసదము. దే. వి: చూ, ఉడుపకుక్క.
మొంటి. దే.వి. (రూ—మొంటికి—మొంట్టి) 1. అంగ న్యూనత: నవుకు—నాకు; విణ. 2 అంగన్యూ నము: నవుకు—నాకు.
మొంటికి. దే. వి, విణ.—వై.—
మొఱుఁగు. దే. వి. రూ—మొఱువు. 1 కుక్క కూఁత: చూ, రూ—మొఱఁగు. 1; 2. కూఁత: చూ, స్వరము. 2; అ. క్రి. రూ—మొఱువు. 3. కుక్కకూయు: చూ, శబ్దించే; 4. కూ యు: చూ, శబ్దించు. [రూ—మొఱఁగు. 1.
మొఱుఁగుడు. దే. వి. కుక్కకూఁత: చూ,
మొఱుములు వా. వి. బ. చేటచే తనవైపు కొడఁగావచ్చిన పెద్దగింజలు మూకలలోనగున వి: గుండ్రాలు: చూ, కంబూకము.
మొఱువు. దే. వి, అ. క్రి: చూ, రూ—మొఱుఁగు.
మొఱ్ఱ. దే. వి. 1: చూ, రూ—మొఱ. హర. 4, అ. 110; 2. చూ, మొండి. 2; విణ. 3: చూ,

మొటికు. 1; 3: చూ, మొటికు 2; వా. వి. 4: చూ, విన్నదము. "నా మొట్టరిచిరి."

మొట్టపెట్టు. దే. అ. క్రి: చూ, రూ-మొటపెట్టు.

మొట్టి. దే. వి, విశే: చూ, రూ-మొటి. 1-2.

మొట్టివోవు. దే. అ. క్రి. అంగన్యూనమగు. "కుంచమొట్టివోయినది."

మొల. దే. వి 1. కటిప్రదేశము: (సం) — కటము, కటి, కటీరము, జఘనము; 2. చీల: చూ, బంకికన్ను; 3. త్రాసుముల్లు, చుంబకము: చూ, సితాగ్రము.

మొలక. వై. వి.=మూలికా. రూ-మొల్క: చూ, మొక్క. 1-2.*; 3. ఆసనమునందలి దుర్మాంసవిశేషము: రూ-మొల్క, పిలక: చూ, మూలసంక; 4. వ్రణమునందలిదుర్మాంసవిశేషము: మొల్క; విశే. 5. లేత. "మొలకనవ్వు.": చూ, సుకుమారము.

మొలకకట్టు. ద్వ. స. క్రి. రొంపియందు చేల్లుటకుగాను విత్తనము మొలకలెత్తకడిపి ముడియకట్టు. పాండు. 3, ఆ. 194.

మొలకట్టు. దే. వి. 1. చూ, మొలనూలు; 2 కట్టుకోక చూ, వస్త్రము.

మొలకత్తి. ద్వ. వి చిల్లాడము. శకాం. 5, ఆ. 14: చూ, బాణము. 1.

మొలకబంగారు. వై వి. పుట్టలలో పురుగులవల్ల కలిగెడు బంగారు, పుట్టబంగారు: చూ, లోహము. 1. [కోల.

మొలకిడిముమ్మ. ద్వ. వి. మొలందోపుకొనుగుజ్జ

మొలకెత్తు. ద్వ. అ క్రి. అంకురించే: చూ, సంభవించే.

మొలకోలికి. వా. వి. బ: చూ, మొలగులికలు.

మొలగులికలు. దే. వి. బ.—పై.—

మొలగులికి. దే వి. (మొల + కులికి): చూ, సస్యము. 1.

మొలచే. వై. అ. క్రి.=మూర్ :చూ, మొలకెత్తు.

మొలతెంచే. ద్వ. అ. క్రి (మొలచే + తెంచే.) పుట్టు. శాకు. 7, ఆ. 33: చూ, సంభవించే.

మొలత్రాడు. దే. వి. 1. పురుషుని కటిసూత్రము. (సం) అందుకము, కటిసూత్రము; 2: చూ, అడంగుబొద్దు; 3: చూ, మొలనూలు, 2.

మొలత్రాను. దే. వి. మొలగలత్రాను. హంస. 2, ఆ. 181: చూ, త్రాను. [వస్త్రము.

మొలదట్టి. దే. వి. మొలకట్టుకాసె: చూ,

మొలనూలు. దే.వి.1. ఆండువాండ్రు అలంకారార్థము ధరించెడు కటిసూత్రము. కళా. 7, ఆ. 68: చూ, భూషణము. 2; వా. 2. చూ, మొలత్రాడు. 3 [మొక్క.1 —2.

మొలవ. వై వి =మూలికా: చూ, రూ-

మొలవేయు. ద్వ. స. క్రి (మొలక + వేయు) ఆడు, ఊకుకొను, ఊనుచు-ఊదు, ఒత్తు, ఒత్తుకొను, కాండు-గాండు, కీలుకొను, కొను, గుచ్చు, చెరువు, తొట్టు, తొలుచే, నాటు, నాడు, నాటునాటు, వను వడు-వన్నువడు, పెట్టు, పొడుచే.

మొలాము. దే. వి. (రూ-ములాము-మొల్లాము-మోళము-మోలము); 1. బంగారులోనగువానిపూత: చూ, సమాలంభము. 1; 2. పంటికిపూసెడుమందు: చూ, మందు. 1-౮.

మొలుగు. కో. వి. నల్లచౌడునేల: రూ-మోలుగు. [మొరక.

మొల్క. వై. వి =మూలికా: చూ, రూ-

మొల్చు. వై. అ. క్రి: చూ, రూ-మొలచే.

మొల్ల. వై. వి.=మల్లి. కుందము*. (దే. అవిక. ర.) (మొల్లకును మిగత విశేషములకును " చూ, హసంతి. 2 ")

మొల్లతీగె. ద్వ వి. కుందలత*: చూ, హసంతి. 2.

మొల్లమి. దే. వి. రూ-మొల్లము. 1: చూ, సమూహము; 2 సాంద్రత. కళా. 6, ఆ. 222: చూ, సాంద్రము. 2; విశే. 3. అచ్చే

ము. స్వా. 3, ఆ. 28: చూ, సౌందర్యము. 2; వై. వి. 4.=మూల్య. వల: చూ, విక్రయము; 5.=మూల్య. వందెము: చూ, వ్యవహారము. 4.

మొల్లము. వై. వి. 1.=మూల్య. ధనము: చూ, హిరణ్యము. 3; దే. వి. 2: చూ, మొల్లమి. 1; 3: చూ, మొల్లమి. 2; 4 తఱచే. స్వా. 4, ఆ. 37: చూ, హేరాళము; విశే. 5. త అపైనది. పర. 2, ఆ. 144: చూ, హేరాళము; 6. అధికము. రుక్మి. 4, ఆ. 44: చూ, హేరాళము; వై. వి. 7.=మూల్య: చూ, మొల్లమి. 4; 8.=మూల్య: చూ, మొల్లమి. 5.

మొల్లాము. దే. వి: చూ, రూ—ముల్లాము.

మొవు. దే. వి. తాళతరుణపత్రము: రూ—మోవు—మొవ్వు, మోసు. [మొంగుడు.

మొవుడు. వై. అ. క్రి.=ముకుళన: చూ, రూ—

మొవ్వు. దే. వి: చూ, రూ—మొవు.

మొసలి. దే. వి. నక్రము: చూ, మత్స్యము. 1—3. (బ. మొసలులు - మొసళులు - మొసళ్లు - మొసళ్లులు.) [వాయి.

మొసలికాటు. దే. వి. చిమటా: చూ, మొసలి

మొసలిగుజ్జుపురాతు. దే. వి: చూ, వరుణుఁడు. సాం. దే 19. [ణము.

మొసలితోరణము. ద్వ. వి: చూ, మకరతోర

మొసలిరాసి. ద్వ. వి: చూ, మకరము. 5.

మొసలివా. ద్వ. వి: చూ, రూ-మొసలివాయి.

మొసలివాపోఁగులు. ద్వ. వి. బ. మకరకుండలములు. అచ్చ. శాల, కాం. 62: మొసలివారొంట్లు : చూ, పావడిక. 2, (భూషణము. 2—అగ.)

మొసలివాయి. ద్వ. వి. 1. రూ-మొసలివా, చిమటా, మొసలికాటు; 2: చూ, చిమటా. 1.

మొసలివారొంట్లు. ద్వ. వి: చూ, మొసలివాపోఁగులు.

మొసలివారొంట్లదాల్పు. ద్వ. వి: చూ, విష్ణువు. 1.

మొహతాదు. వా. వి. గ్రామనౌకరు: చూ, మోతాదు 1.

మొహదా. దే. వి: చూ, పట్టిసము 1.

మొహమలు. వా. వి: చూ, రూ—మొంకములు.

మొహరము. వా. వి. కురకలపీర్ల పండుగ: (చూ, పీర్లు) [రించు. 1—2—3.

మొహరించు. వా. అ. క్రి: చూ, రూ—మోహ

మొహరీ. దే. వి. (రూ—మొహురి—మోహరీ.). కుల మెత్తు స్వర్ణముద్రిక, ముచ్చదిచిన్నముల రొుత్తు బంగారునాణెము.

మొహరు. వా. వి. ముద్ర: చూ, పీకా.

మొహాళము. దే. వి. కూరాకుచెట్టు. మోహానము.

మొహురి. దే. వి: చూ, రూ—మొహరీ.

## మో

మోఁకటించు. దే. అ. క్రి. మోఁకాళ్లు నేలపాని ముందటికొఱగు: మోఁకటిలఁబడు—మోఁకటిల్లఁబడు, మోఁకటిలు—మోఁకటిల్లు, మోఁకారించు, మ్రొగ్గతిలఁబడు—మ్రొగ్గతిల్లఁబడు, మ్రొగ్గతిలు—మ్రొగ్గతిల్లు, మ్రొగ్గఁబడు, మ్రొగ్గు: చూ, వంగు.

మోఁకటిలఁబడు. ద్వ. అ. క్రి—పై.—భాగ. 8, స్క—o. 388. [3. అ. 65.

మోఁకటిల్లఁబడు. ద్వ. అ. క్రి.—పై.—పారి.

మోఁకటిలు. దే. అ. క్రి.—పై.—

మోఁకటిల్లు. దే. అ. క్రి.—పై.—

మోఁకారించు. దే. అ. క్రి.—పై.—

మోఁకాలు. దే. వి. (మోఁద + కాలు) 1. ముడుకు, ముడుము. (సం).—జానువు: చూ, పాక్షి; అం. 2: చూ, కళలుండుస్థలములు.

మోఁకాలుచిప్ప. దే. వి. మోఁకాలిఎముక: చూ, కల్యము.

మోఁచేయి. దే. వి. (మోఁద+చేయి) రూ—

మోఁచెయ్యి-మోఁచేయి, కూర్పరము: చూ, హస్తము.

మోఁచేతిముద్దుపట్టిల్లు. ద్వ. వి. రెండిండ్లకొకటి కట్టిన కట్టడము: చూ, సదనము. 1.

మోఁచేతివంపుటిల్లు. ప్వ. వి.—పై.—

మోఁచేయి. ద్వ. వి: చూ, రూ-మోఁచెయి.

మోఁత. దే. వి. బరువు: చూ, వివధము. 3

మోఁద. దే. వి. మోఁదు చేతకట్టిన నెత్తురుగడ్డ. చూ, వర్ణము. 1. [గడ్డకట్టు.

మోఁదకట్టు. దే. అ. క్రి. మోఁదు చేతనెత్తురు

మోఁదు. దే వి. 1. దెబ్బ: చూ, హతి;స. క్రి 2. కొట్టు. ఉ, హరి. 6, అ. 108. చూ, కేళ్రియు.

మోక. వై. వి.=మూలికా: చూ, మొక్క.1-2

మోకు. దే. వి. లావుత్రాడు: చూ, మూత్రి ము. 1.

మోక్షణము. అం: చూ, హస్తక్రియలు.

మోక్షదము. అం: చూ, తానములు (ని-గ-హీనతానములు)

మోక్షము. సం. వి. అ. పుం. 1. అక్షరము, అపగ్గము, అపవర్జనము, అపునర్భవము, అమృతము, కలాపము, కైవల్యము, నిర్యాణము, నిర్వాణము, నిర్వృత్తి, నిస్సరణము, పరము, భగము, ముక్తి, మోచనము, శివము, శ్రేయము, సదాగతి, స్థిరము. స్వర్గము. (తె)—పెంపోర్చిన, మీఁదు, ముగితి-ముత్తి. (మిగతవానికి "చూ, స్వర్గము.2.") 2. విడుపు చూ,విమోచనము; 3 =మొక్కము. రూ-మొుంక్షము *: చూ, మొక్కము, అం 4: చూ, పురుషార్థములు.

మోఘ. సం. వి. ఆ. స్త్రీ. రూ-అమోఘ. కలిగొట్టు. *: చూ, స్థాలి. 2.

మోఘము సం. విశ.=మొక్క. 1: చూ, వ్యర్థము; 2: చూ, దీనము.

మోచ. సం. వి. ఆ. స్త్రీ. 1. అరఁటి*: చూ, రంభ. 2; 2: చూ, బూరుగు *; 3. చిల్లి*: చూ, పల్లకి [సమ్మాళిగలు.

మోచక. సం. వి. ఆ. స్త్రీ. ముచ్చె: చూ,

మోచకము. సం. వి. అ. పుం. 1: చూ, మోచ.*. 1; 2: చూ, మునగ *; విశ. 3.విడుచేసది; 4. విసుగునది.

మోచనము. సం. వి. అ. న: చూ,మోక్షము. 1.

మోచని. సం. వి. ఈ. స్త్రీ: చూ, మోచక.

మోచము. సం వి. అ. పుం: చూ, మోచకము. 2. *. [(ఇట్లు పరిమోచితము.)

మోచితము. సం. విశ. విడిపించఁబడినది.

మోచే. దే. అ. క్రి. 1. అవు: చూ, సంభవించే, స. క్రి. 2. ఊను: చూ, వహించే; 3. మొదలుకొను, మొదలఁజేయు. స్కా. 5, ఆ. 44: చూ, వహించే.

మోచేవాఁడు. వా. విశ. మోపుకాఁడు. (సం).—భర్త. (చూ, భారవాహుఁడు.)

మోజే. వా. వి. ఆకుచెప్పులు: చూ, సమ్మాళిగలు. [1; 2: చూ, వాంఛ.

మోజో. వా. వి. 1. ఇష్టము: చూ, సమ్మతి.

మోట. వై. విశ =మూఢ: చూ, మొద్దు. 2-3-4-5; దే. వి. 5: చూ, మొద్దు. 1; 6. చూ, కపిలె.

మోటకత్తి వై. వి: చూ, మచ్చెకత్తి.

మోటగూన. వా. వి: చూ, మోటబావ.

మోటజోరుమొకము. ద్వ వి: చూ, రూ-మొట్టిమొకము.

మోటనము. సం. వి. అ. న. 1. ఆక్షేపించుట, 2. పొడిచేయుట; అం. 3: చూ, హస్తక్రియలు. [కామాటము.

మోటపని. ద్వ. వి. కర్మాగారపుపని: చూ,

మోటపాటిరెడ్లు. ద్వ. వి. బ: చూ, రూ-మోటారెడ్లు. [చూ, వృషభము. 1.

మోటబరి. ద్వ. వి. బరువు మోసెడిరొద్దు:

మోటబాగ. ద్వ. వి. ఏకముకగట్టి నీళ్లు తోడుకూన (ఏకపుకడవ, బాన: చూ, భాండము. 3— ర) చూ, వారివాణము.

మోటవాఁడు. వా. వి. 1. బందగుఁడు: చూ, వ్యాధుఁడు.2; 2: చూ, శక్తుఁడు; 3. రసగ్రి హణములేనివాఁడు: చూ, వ్రిజె. [ర్కారు).

మోటారు. వా. వి: చూ, బండి. (రూ-మోటా

మోటార్కారు. వా. వి.—పై.—(ఇదేబస్)

మోటించు. లే. స. క్రి. పోటీగావిలుపు. "దూలముక్రింద స్తంభమును మోటించెను".

మోటిక. దే. వి: చూ, రూ-మొటిక.

మోటు. పై. వి. 1: చూ, మొద్దు. 1; 2. తట్టు వ: చూ, హాయము; 3. మూర్ఖకగుణము: చూ, హాయము; 4. పందికెదుటను మనుష్యా కారముగా నిలిపిన కపటలక్ష్యము. ప్వా. 4, అ. 84; కుణ. 5.=మూఢః: చూ, మొద్దు. 2; 6. మొరను: చూ, మూర్ఖ్యము.

మోటుకాఁడు. ద్వ.వి.దళపతి: చూ, సైనికుఁడు.

మోటుతనము. పై. వి.=మూఢత్వ: చూ, మూర్ఖ్యము. [మెకము.

మోటుమెకము. పై. వి: చూ, రూ-మొట్టి

మోటువామెకము. పై వి —పై.—

మోట్టాయితము. సం. వి. అ. న. ప్రియుని కథాదులయందు మనసుతగిలి యుండుటను తెలియఁజేసెడు స్త్రీలయొక్క కర్ణకండూ యనాది శృంగార చేష్టావిశేషము.

మోడము. దే. వి. మేఘావరణము: చూ, మేఘము. 1—గు.

మోడి. దే. వి. బిగువు, బింకము. శకాం. 4,అ. 82: చూ, లవణి; 2 గణికాదులు మొగ్గవాలి కాలికి సమీపమందుంచిన వస్తువునెత్తుట; 3. వార్త్రిత యొక్క వైఖరి,జిలుగు, గొలుసు మోడివార్త్రిత: చూ, వార్త్రిత.

మోడు. దే. వి. రూ-మోడ్రు.1: చూ, మొద్దు.1; 2. కర్ర: చూ, వలాలము. 3; వా. 3. మొలక: చూ, మొక్క. 1; 4. తల వతి కివచెట్టు; 5. (చేసుకోసిన) కొయ్యగాలు; అం. 6: చూ, మల్లబంధములు (తద్విశేష ములలో 3 చూడుము.) [కాశీ.3, అ.5.

మోడుచు. పై. పేర్రి: చూ, రూ-మొగుడుచు.

మోడుపడు. ద్వ. అ. క్రి. రూ-మోడ్పడు: 1 మోడగు: చూ, మొక్కపోవు; 2. మొ క్కయగు; 3. కుసుఁగు. హరి. ఉ. 3, అ. 188: కిన్న, మడియు; 4. ఖండితమగు: చూ, వ్రిక్కవాలు; పేర్రి 5. మోడుపఱచు.

మోడుపు. దే. వి. రూ-మోడ్పు. 1. నతి: చూ, వాణిగలు; 2. మొగుడుట.

మోడ్చు. పై. పేర్రి: చూ, రూ-మోడుచు.

మోడ్పడు. ద్వ.అ. క్రి: చూ, రూ-మోడుపడు.

మోతాదు. వా. వి. 1: చూ, రూ-మొహతాదు; 2. గౌరవము. "ఎందుకుచెప్పితినోవినియూమో తాదు నిలుపుకొనుము.": చూ, మొగ్గు. 1; 3 ఒక్కసారి యిచ్చెడు మందుకొలత.

మోతబరీ. వా. వి. మంచిస్థితి.

మోతుబరు. వా. వి. స్థితిపరుఁడు.

మోద. సం. వి. అ. స్త్రీ. 1.కదళీ*: చూ, రంభ. 2; దే. వి. (1) తములపాకులకట్ట: మూపటము.

మోదకము. సం. వి. అ. పుం. 1. కుడుము: చూ, భక్ష్యము. (చూ, ఉండ్రము);2.లడ్డు: చూ, భక్ష్యము. [ములు.

మోదకీగద. అం. (గద, శిఖరిగద): చూ, అస్త్ర

మోదమానము. సం, విణ. సంతోషించుచున్నది. చూ, హ్లాదనము, 2. [సంతోషము.

మోదము. సం. వి. అ. పుం. ముదము: చూ,

మోదయము. దే.వి. బల్బజము*: చూ, తృణము.1.

మోది. వా. వి.పిచ్చెమిచ్చెవాఁడు, రూ-మోదీ.

మోదీ. వా. వి.—పై.—

మోదించు. సం. అ. క్రి: చూ, సంతోషించు.
మోదిలు. సం. అ. క్రి. రూ—మోదిల్లు —పై—
మోదిల్లు. సం. అ. క్రి —పై:—
మోదుగు. దే. వి. (యా 4, ఆ 5,)* రూ—మోదువు, పర్పర. (సం) —కనకము, కాష్ఠ దుగ్రివు, కింశుకము, కింశులుకము, కిర్మి, క్షారదుగ్రివు, క్షారశ్రేష్ఠము? జాహూతరువు, పర్ణము, పలంకష, పలాశము, బీజస్నేహము, బ్రహ్మతరువు, రక్తపుష్పము, రుమ, వాతపోథము, సమిత. ("చూ, సమిత")
మోదుగుతొడిమలు. దే. వి. బ. శాలిధాన్యము: చూ, ధాన్యము [2 మోదుగువిత్తులు
మోదుగుమాడలు దే. వి. బ 1 —పై —;
మోదుగుమొగ్గ. వా. వి: చూ, మొగ్గ 1—2
మోదుగుమొగ్గపుల్గు. ద్వ వి: చూ, శుకము. వేం, ఆం. 99.
మోదువు. దే. వి: చూ, రూ—మోదుగు*.
మోదెన. దే.వి. రూ—మోదెనము: చూ, శివమల్లి*.
మోదెనము. దే. వి.—పై.—
మోపరి దే. విశే. (మోపు + అరి) 1. మోపు మోయువాఁడు; 2· చూ, బెస్త. ఆం, భా. ద్వి. 288. [చూ, హాని. 2.
మోపాది. దే. వి. (మోపు + అది) అపాయము:
మోపి. దే. వి. చూ, ముండమోపి.
మోపించు. వా. ప్రే· చూ, మోపు. 8.
మోపిక. దే. వి. భారము (ఓపికవంటిది): చూ, వివధము. 3 [ఎక్కిడు: చూ, మోపెట్టు.
మోపిడు. దే స. క్రి. (మోపు + ఇడు.) విల్లు
మోపు. దే.వి. 1. (పుల్లల)కట్టు; 2: చూ, మోపిక. 3: చూ, మూర్చ. 1; 4: చూ, మోపుదల. 1; 5: చూ, (సం).—త్రిణ్య; విశే. 6: అధికము: చూ, హేరాళము; క్రి. 7: కట్టు, పాదపెట్టు, పెట్టు. (సం) —ఆరోపించు: 8. మోయఁజేయు: మోపించు; 9. అనించు:
(చూ, పిసుకు. 2–3)· చూ, సమ్మర్దించు.
మోపుకాఁడు. దే. విశే: చూ, మోయువాఁడు.
మోపుదల. దే. వి. 1: మోపు. (సం). —ఆరోపణము, ఆరోపము. (అవ్య).—అరి;·2. చూ, మోపిక.
మోపెట్టు. దే స. క్రి. (మోపు + పెట్టు ): ఎక్కిడు, ఎక్కుడుపెట్టు-ఎక్కుపెట్టు-ఎక్కువెట్టు, మోపిడు. [స్నేహాళము.
మోబత్తులు. వా. వి. బ. ఒకకరదీపిక: చూ,
మోమిచ్చు. వా. వి: చూ, మోమోటమి.
మోము. తై. వి.=ముఖ: చూ, రూ—మొగము.
మోముముట్టు. ద్వ. వి: చూ, రూ-మొగముట్టు. రామా. 2, ఆ. 20.
మోమోట ద్వ వి· చూ, రూ-మొగమోట. (దాక్షిణ్యమునకు.—కాశం. 4, ఆ. 25.)
మోమోటము. ద్వ. వి.—పై —(సంకోచించుటకు.—ఉ, హరి. 6, ఆ. 102 )
మోమోటమి ద్వ వి. ముఖప్రీతి: రూ-మొగమాట-మొగమాటము, మొగమోట-మొగమోటము, మోమోట-మోమోటము, మొగమిచ్చు-మోమిచ్చు, గడుసు, పుయిలోట.
మోమోడు. ద్వ. అ. క్రి: చూ, రూ-మొగమోడు. (దాక్షిణ్యపడుటకు.—కాశీ.2, ఆ 37.)
మోయిమ. వా. వి. 1. రీతి: చూ, విధము. 1; 2. చూ, బత్తియము 1. [వహించు.
మోయు. దే. స. క్రి (భారము) దాను: చూ,
మోర. దే. వి: చూ, రూ-మొర. 1–2 (పశ్వాదుల దీర్ఘముఖమునకు.—కాశీ. 4, ఆ. 271; పాం. 4, ఆ. 27 )
మోరచెంగు. వా. విశే. చిన్నముఖము. రూ-మొర్చెంగు: చూ, పీఠా.
మోరట. సం. వి. అ. స్త్రీ. 1. చౌగ*: చూ, సర్రివ; 2.=మోరు. మజ్జిగ: చూ, స్త్రవ్యము (మజ్జిగ)

మోరటి. దే. వి; చూ, పిఱియాలము. 1.*.

మోరటిలు. దే. అ. క్రి. రూ-మోరటిల్లు. మోముమీఁదికెత్తు.

మోరటిల్లు. దే. అ. క్రి.—పై.—

మోరత్రోపు. దే. వి: చూ, వైముఖ్యము.

మోరదక్కు. దే. వి: చూ, మత్స్యము. 1.

మోరపాక. దే. వి. (రూ—ఓగపాక-దోరపాక) చోఁపిడి,చిన్నగోఁడలయిల్లు.చూ,సదనము. 1.

మోరా. వా. వి. కాఁపీఁట.చూ, సింహాసనము.

మోరి. వా. వై. వి.=మోరట. రూ-మోరు చూ, మజ్జిగ.

మోరు. వై. వి. 1=మోరట.—పై.—ఉ, రా. 6, ఆ. 122; దే వి. 2. పర్వత శిఖరము, పేటు. ఉ, హరి 6, ఆ. 76: చూ, హిమాలయము (పర్వతము).

మోరుండ. ద్వ. వి: చూ, భక్ష్యము.

మోర్చెంగు. వా. వి: చూ, రూ-మోరచెంగు.

మోఱకము వై. వి.=మౌర్ఖ్య. 1. మూర్ఖత్వము: చూ, మౌర్ఖ్యము; విశే. 2. మూర్ఖము: చూ, మౌర్ఖ్యము. [మూర్ఖురాలు: చూ, స్త్రీ.

మోఱకకత్తె. వై. విశే (మోఱకము + కత్తె)

మోఱకు. వై. విశే.=మూర్ఖ. మూర్ఖుఁడు. భో. 1, ఆ. 115: చూ, స్తబ్ధుఁడు.

మోఱకుఁడు. వై. వి.=—పై.— [మొలాము.

మోఁతము. జే. వి. రూ-మొత్తళము: చూ, రూ-

మోలుగు. దే. వి: చూ, రూ-మొలుగు.

మోవి. దే. వి. 1. పెదవి: చూ, వాతెఱ; 2 మోవిఅనుచెట్టు: చూ, వృక్షము.

మోవు దే. వి: రూ-మొవు-మొవ్వు, మోను.

మోష.సం.వి.ఆ.స్త్రీ.=మోషము.1.దొంగతనము చూ, చోరణము. 1; 2. కీడు: చూ, హాని. 2.

మోషకుఁడు. సం. వి. అ. పుం. 1. దొంగ చూ, చోరకుఁడు. 1; వా. 2. కంసాలి: చూ, స్వర్ణకారుఁడు. (ఇట్లుమోషకుఁడు వాడుక).

మోస. వై. వి.=మోషా.రూ-మోసము. 1:చూ, మోష. 1. కాశీ. 5, ఆ 67; 2: రూ, ప్రమాదము. 1. కాశీ. 6, ఆ. 6; 3: చూ, వంచన.

మోసగాఁడు. ద్వ. విశే: చూ, వంచకుఁడు.

మోసపుచ్చు. వా. స. క్రి. మభ్యపెట్టు. వేం, ఆం. 65: చూ, వంచించే.

మోసపోవు. ద్వ. అ. క్రి. 1. ఓటుపడు, చేలుపడు-చేల్పడు, చేలుపోవు. (సం).—ప్రమాదపడు; 2: చూ, వంచింపఁబడు.

మోసము. వై. వి.=మోషా: చూ, రూ-మోస. (ప్రమాదమునకు.—మార్క. 7, ఆ. 203)

మోసరిక. వా. వి. అంకురము: చూ, రూ-మోసేరిక.

మోసల. వై. వి=ముఖశాలా' చూ, రూ-మొగసల. 1—2—3. (నగరితలవాకిటి చావడికి.—సా. 8, ఆ. 199.)

మోసాల. వై. వి.=—పై.—(నగరితలవాకిటి చావడికి.—కాశీ. 2, ఆ. 41.)

మోసు దే. వి. 1. తునుక: చూ, శకలము. 4; 2 అంకురము.పర 3,ఆ.158: చూ, మొలక. 1; 3 చూ, మూలము. 1; 4: చూ, మోవు.

మోసేను. వా వి. పిటీషను.

మోసేరిక. వా. వి: చూ, మోసు 2.

మోస్తరు. వా. వి. 1. మాదిరి; 2. స్వభావము.

మోహచతుష్టయము అం: లజ్జామోహము, విభవమోహము, కరుణామోహము, నిజమోహము. (4) (మతాంతరమున.—ఉత్తమము కూర్మమోహము, మధ్యమము మత్స్యమోహము, అధమము మృగమోహము.)

మోహన. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకరాగము; చూ, స్వరము 2.

మోహనము. సం. వి అ. న. 1: చూ, మూర్ఛ.1; అం. 2. చూ, విద్యలు; 3: చూ, మన్మథబాణములు; 4: చూ, అస్త్రములు;

